


ముందుచూపు


తెలుగు చలన చిత్రాకాశాన
'ధ్రువతార'
25 సంవత్సరాలుగా కీర్తి శిఖరాగ్రాన
జయపతాకం ఎగురవేస్తున్న
నిత్య నూతన నటుడు
నటసమ్రాట్
పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు
మా శుభాకాంక్షలు - అభినందనలు
అక్కినేని నాగేశ్వరరావు
చలన చిత్ర జీవిత రజతోత్సవ సమితి

# ఈసంచికలో



ముఖచిత్రం : క్రాంతిగమన

చిత్రకారుడు : **వడ్డాది పాపయ్య**


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-00

యువ సైఫాబాద్ హైదరాబాద్ - 4



వి బి రాజేంద్రప్రసాద్ సమర్పించు
జగపతి ఫిలింస్ వారి

# అక్కా చెల్లెలు

నిర్మాత వి కృష్ణప్రసాద్ B.Sc.
దర్శకత్వం ఎ సంజీవి

మాటలు: ఆచార్య ఆత్రేయ  సంగీతం కె.వి. మహదేవన్  కెమేరా ఎస్. వెంకటరత్నం

LAKSHMI




మీ యువ జనవరి సంచికలో "నగరంలో నాలుగిళ్ళు" నన్నెంతో సంతోషపరిచింది. కాని కథలు చాల తక్కువగా ఉంటున్నవి. రచయిత్రి సి. కామేశ్వరిగారికి నా అభినందనలు తెలుప ప్రార్థన.

పి. సత్తిరాజు, రాజమండ్రి.

జనవరి సంచిక సంపాదకీయం చదివాను. యథార్థాన్ని సూటిగా చెప్పారు. ఆంధ్రప్రభుత్వము, పార్లమెంటులోని ఆంధ్రసభ్యులూ, ఆంధ్రప్రదేశ్ న్యాయమైన కోర్కెలు తీర్చాలని పట్టుపట్టాలి.

కథలకూ, కార్టూన్లకు 'యువ' ఎప్పుడూ మిన్నే. వాటిగురించి అంతకన్నా చెప్పేదేముంది. సంక్షిప్తనవల, రెండు సీరియల్సు చాలాబావున్నాయి. కానీ 'మీనా' ఇంకాస్త ఎక్కువగా వేస్తుండండి.

పి. వి. మురళీధర్, హైదరాబాదు.

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్







ప్రతీపైసాకూడ మీరు కష్టపడి చెమటఊడ్చి సంపాదించుకున్నారు. మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?

హెర్క్యులిస్‌ను కొనండి. దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలువున్నాయి — బలిష్టత, సాఫీగా పోవడము, కచ్చితము, వేగము, మన్నిక.

అది సహజమే.

హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలుగల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది. భారతదేశమందంతటా 3,000,000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు.

హెర్క్యులిస్ ఒక్క సైకిలేకాదు- మీ జీవిత కాలపు నేస్తము.

భారతదేశములో తయారుచేయువారు. టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53.

ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు.

* రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్ -
ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో., లిమిటెడ్ యు. కె. వారిది.



TIC-M-5402

జనవరి 1970 "యువ" సంచిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది. ముఖ్యంగా నన్నాకర్షించిన కథ డి. కామేశ్వరిగారి 'నగరంలో నాలుగిళ్లు' చాలా బాగున్నది. 'భాస్వతి' ఫర్వా లేదనిపించింది. యద్దనపూడి సులోచనారాణిగారి 'మీనా' నెలనెలా నన్నెంతో ముగ్ధుణ్ని చేస్తున్నది. కథ చాలా ఇంటరెస్ట్‌గా సాగుతున్నది.

కథలు చాలా తక్కువగా ప్రచురిస్తున్నందులకు నాదో చిన్న మనవి. 'యువ'ను 200 పేజీలకు పెంచి, వెలను రూ. 1-50 పై. లకు పెంచితే బాగుంటుందని నా అభిప్రాయం.

జట్లింగ్ నర్సింగం, వరంగల్.

జనవరి యువ చదివాను. డి. కామేశ్వరిగారి "నగరంలో నాలుగిళ్లు" చాలా బాగుంది. కార్టూన్లు బాగున్నాయి.

వడ్లమాని రామకృష్ణ,
మల్కాజ్‌గిరి.

1970 జనవరి "యువ" సంచికలో "నగరంలో నాలుగిళ్లు" అను కథ సమాజానికి చాల దగ్గరలోయుండి అద్భుతంగా వున్నది.

"మీనా" సీరియల్ క్రిందటిసారి కన్నా చాల ఆసక్తిదాయకంగా కొనసాగుతున్నది.

ఎస్. స్వాతంత్ర్యరెడ్డి, ఎ. మల్లయ్య,
Md. హిసామొద్దీన్, బెల్లంపల్లి.

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 21 ఫిబ్రవరి, 1970 సంచిక 2

తమిళనాడులో ఆహారధాన్యాల కంట్రోలు తొలగించబడింది. రేషనింగు అమలులోవున్న మదరాసు, కోయంబత్తూరు పట్టణాలలో, జనవరి మాసాంతంతో రేషనింగు రద్దు అయిపోతుంది. కాని, నెలకు రెండు వందల రూపాయలలోపు ఆదాయం వచ్చే కుటుంబాలకు మాత్రం, రూపాయకు ఒక పడి ధరలో బియ్యం అమ్మడం జరుగుతుంది. రూపాయకు పడి బియ్యం అమ్మించడం, ప్రస్తుతం రాష్ట్ర పరిపాలన సాగిస్తున్న ద్రవిడమున్నేట్ర కళగం, ఒక పార్టీ విధానంగా అమలు జరుపుతున్న కార్యక్రమం. ఈ సదుపాయం, తక్కువ ఆదాయం వచ్చే వాళ్ళకోరకే అమలులో వుంటుంది. ఇది, కేవలం కొన్ని వర్గాలకు (వచ్చే ఎన్నికలలో ఓట్లు సంపాదించుకోవడానికి) రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న సహాయం. ఎక్కువ ఖరీదుకు బియ్యం కొని, తక్కువ ఖరీదుకు అమ్మడంలో రాష్ట్ర ప్రభుత్వం కొంత నష్టపడవచ్చును. ఈ నష్టాన్ని, ఇతర ఆదాయాలవల్ల భర్తీ చేసుకోవచ్చును. ఇది కేవలం, రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించిన విషయం.

ఇతర రాష్ట్రాలకూ, కేంద్ర ప్రభుత్వానికీ సంబంధించినదీ, ఇతర రాష్ట్రాలూ, కేంద్ర ప్రభుత్వమూ ఆలోచించవలసినదీ ఏమిటంటే, జనవరి పదవ తేదినుంచి, తమిళనాడులో ఆహారధాన్యాల కంట్రోలు రద్దుకావడం. ఈనాడు, దక్షిణదేశంలోని అన్ని రాష్ట్రాలలోనూ ఆహార ధాన్యాలపై కంట్రోళ్ళు వున్నాయి. ఆ రాష్ట్రాలలోని ముఖ్య పట్టణా లలో రేషనింగు అమలులో వుంది. కాని, ఒక్కసారిగా ఆహార ధాన్యా లపై కంట్రోళ్ళను తమిళనాడు ప్రభుత్వం రద్దుచేసింది.

దీని అర్థం ఏమిటి? రాష్ట్రంలోని ప్రజల అవసరాలకు కావలసినంతగా ఆహార ధాన్యాలు రాష్ట్రంలో పండాయన్న మాట. ఈ మాటను రాష్ట్ర ప్రభుత్వమే స్పష్టంగా చెపుతోంది. గత మూడు సంవత్సరాలలోను రాష్ట్ర ప్రభుత్వం అమలు జరిపిన అధికాహారోత్పత్తి పథకాలు ఫలించ డం వల్ల, యీనాడు ఆహారధాన్యాలపై కంట్రోళ్ళను రద్దుచేయడా నికి వీలు కలిగిందని, తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి అన్నారు. బాగుంది; కాని యీ విషయంలోనే ఒక చిన్న తేడా కనపడుతోంది.

నాలుగైదు నెలల పూర్వమే, తమిళనాడు రాష్ట్రం అంతాకూడా అనావృష్టివల్ల కాటకబాధలో పడిందనీ; పంటలు సరిగా లేకనూ, పంట వెయ్యడానికి నీరు లేకనూ, రాష్ట్రం అంతటా పొలాలు బీళ్ళుగా వున్నాయనీ; పనులులేక ప్రజలు అల్లాడుతున్నారని, ఆందోళన జరిపి, అనావృష్టి బాధనుంచి ప్రజలను కాపాడడానికి ఇరవై కోట్ల రూపా యలు అడిగింది, యీ ప్రభుత్వమే. కాటకం, ఘోరకాటకం, అని యీ ప్రభుత్వం చేసిన ఆందోళనను కేంద్ర ప్రభుత్వం మన్నించి, కావలసిన సహాయాన్నంతనూ చేసింది.

తమిళనాడులో కాంగ్రెసు ప్రభుత్వం వున్నప్పుడు, తక్కిన రాష్ట్రాల కన్న ఎక్కువ సదుపాయాలనూ, సహాయాన్నీ యీ రాష్ట్రానికి ఇచ్చింది కేంద్ర ప్రభుత్వం. కాంగ్రెసు ప్రభుత్వం కూలిపోయి, ద్రవిడ మున్నేట్ర కళగం ప్రభుత్వం ఏర్పడిన తరువాత, యీ రాష్ట్రానికి మరీ ఎక్కువగా

సదుపాయాలు లభింపచేస్తున్నది, కేంద్ర ప్రభుత్వం. దీనికి కారణం, ద్రవిడ మున్నేట్ర కళగానికి చెందిన సభ్యులు పాతికమంది పార్లమెంటులో వుండటమే. ఈ సభ్యుల ఓట్లు, ప్రధాన మంత్రికి చాలా అవసరం. అందువల్ల, యీ పార్టీ ప్రభుత్వానికి అడిగినదల్లా చేకూరుతున్నది.

ఇరవై కోట్ల రూపాయలను తమిళనాడు ఒడిలోపోసినందుకు, ఇతర రాష్ట్రాలవారెవరూ బాధపడరు. పడనక్కరలేదు. కాని, తమిళనాడు కంటె ఎక్కువగా నష్టపడి, కష్టాలలోవున్న ఇతర రాష్ట్రాల విషయం కేంద్ర ప్రభుత్వం ఏ మాత్రం ఆలోచించకపోవడమే, ఆ రాష్ట్రాల ప్రజలకు బాధ కలిగిస్తున్నది.

నాలుగైదు నెలలనాడు అనావృష్టివల్ల అతిబాధపడుతున్నామన్న తమిళనాడు ప్రభుత్వం, యీనాడు ఆహారధాన్యాలపై కంట్రోళ్ళు తొలగించారంటే, నాలుగైదు నెలల నాటి కరువుపరిస్థితులు ఎంత నిజం? అనే సందేహం ఎవరికైనా కలుగుతుంది. కాని, అనావృష్టి పేరుతో ఇరవై కోట్ల రూపాయలను కేంద్ర ప్రభుత్వం నుంచి తమిళనాడు ప్రభుత్వం తీసుకోగలిగింది.

తమిళనాడులో అనావృష్టి అనే హాహాకారాలు బయలుదేరక ముందే, ఆంధ్ర ప్రదేశ్‌లో అతివృష్టివల్ల పంటలు విపరీతంగా దెబ్బతిన్నాయి. తుపాను దెబ్బకు కొన్ని గ్రామాలు తుడిచిపెట్టుకొనిపోయాయి. కొన్ని వందలమంది ప్రజలు వరదలలో కొట్టుకొనిపోయి మరణించగా, కొన్ని వేల మంది నిరాశ్రయులయారు. ఎన్నో వేల కుటుంబాలు, మళ్ళీ నాలుగైదేళ్ళదాకా తేరుకోలేని నష్టాన్ని పొందారు. ఒక తుపాను కాదు; రెండు తుపానులు ఆంధ్ర జిల్లాలలో ప్రళయ తాండవం చేసిపోయాయి. ఈ ప్రళయం వల్ల నష్టపడిన ప్రజల ఆర్తిని విన్నవారు, వీరికి సహాయం చెయ్యడానికి నేనున్నానని అన్నవారు కనపడడం లేదు.

ఎంత అనావృష్టి అని చెప్పినా, తిండికిలేక గాని, ఎండదెబ్బవల్ల గాని ఒక్కమనిషికూడా తమిళనాడులో చావలేదు. అతివృష్టివల్ల, ఆంధ్ర జిల్లాలలో కొన్నివందల మంది చచ్చిపోయారు. కొన్ని వేల కుటుంబాలు, ఇళ్ళు కూలిపోగా యీనాటికీ నిరాశ్రయులై వుండటమే కాక, తమ పంటలు ధ్వంసమైపోయినందునను, పొలాలలో ఇసుక మేటి వేసినందునను, నాలుగైదు సంవత్సరాలదాకా మళ్ళీ కోలుకునేటట్లు వీలులేని స్థితిలో వున్నారు. వీరికి కేంద్రప్రభుత్వం సహాయం చెయ్యదేమి? వీరిగోడు కేంద్ర ప్రభుత్వానికి చెప్పేవారు లేకనా?

ద్రవిడ మున్నేట్రకళగం వారి పాతిక ఓట్లను తన పక్షాన వుంచుకోవడానికి ప్రధాన మంత్రి శ్రద్ధవహించడంలో తప్పులేదు గాని, ఆంధ్ర ప్రదేశ్ నుంచి ఎన్నిక అయిన 35 మంది కాంగ్రెసు సభ్యుల ఓట్ల విషయం ఆమె శ్రద్ధ వహించనక్కరలేదా? ఆంధ్ర ప్రదేశ్ పట్ల ఎంత చిన్న చూపు చూసినా, యీ 35 ఓట్లు తనవేనని ఆమె అనుకుంటున్నారా?

ప్రతి రాష్ట్రపు పరిస్థితులను గమనించి, ఆయా రాష్ట్రాల కష్ట, నష్టాలను దీర్చడానికి కేంద్ర ప్రభుత్వం కృషి చెయ్యడం న్యాయం. అలా కాక, ఏ రాష్ట్రం నుంచి తమకు ఎక్కువ మద్దతువస్తున్నదో ఆ రాష్ట్రానికి ఎక్కువ సహాయం చెయ్యడాన్ని ఒక విధానంగా పెట్టుకున్నప్పటికీ, ఆంధ్రప్రదేశ్ ను కేంద్ర ప్రభుత్వం చిన్నచూపు చూడడానికి వీలులేదు.

అనావృష్టివల్ల ఎక్కువ నష్టాన్ని పొందని తమిళనాడుకు ఇన్ని వై కోట్ల రూపాయల సహాయం చేసినప్పుడు, అతివృష్టివల్ల విపరీత నష్టాన్ని పొందిన ఆంధ్రదేశానికి ఎక్కువగా సహాయం వెంటనే చెయ్యాలని, కేంద్ర ప్రభుత్వాన్ని ఆంధ్రప్రదేశ్ నుంచి ఎన్నిక అయిన పార్లమెంటు సభ్యులు పట్టుబట్టాలి. రాష్ట్ర ప్రభుత్వం కూడా యీ విషయంలో తీవ్రమైన కృషిచేసి, కష్టపడుతున్న కుటుంబాలకు వెంటనే సహాయం అందేటట్టు చూడాలి.

# సుందరం శివం సత్యం



నాకు మా బావంటే ఇష్టం ఎందుకు,

ఎంత ? అంటే నేనేం చెప్పలేను ఒకర్ని చూస్తే ఒకరికి ఎందుకో తెలియదు గాని – ఇష్టం అలాగే మా బావంటే నాకు విపరీతమైన లైకింగ్... ఇదే ఏమరదలు పిల్లో అంటే ఇంకేముంది, అమాంతం బావను ప్రేమించేసిందంటారు అదృష్ట వశాత్తు మగవాణ్ణిగనుక ఎవరూ చెప్ప కోరు. ఇదో రకమైన మగప్రేమేమో అని అనుకోవచ్చు మా బావమాటలు శిలల కన్నా కఠినంగా ఉంటాయి. మొహం కూడా కఠినంగానే కనిపిస్తుంది మనసులో బోలెడు మార్దవం ఉంది. అప్పు డప్పుడు చిన్న పిల్లాడిలా ప్రవర్తి స్తుంటాడు వస్తుతః ధనవంతుల బిడ్డ దానికితోడు వ్యాపారంలో రెండుచేతులా గణిస్తున్నాడు. ఓసారి బెజవాడ బంధువుల ఇంటికి పెళ్ళికి వెళ్ళాను మాబావకూడ వచ్చాడు ఆయనకు దగ్గరబంధువులు వాళ్ళు. పెళ్ళికివచ్చిన పెద్దల్లో ఈయన వి ఐ పి అందరూ ఆయన్ని వి ఐ పి. లాగానే చూస్తున్నారు పెళ్ళివారింటికి పక్కనున్న ఇల్లుగూడా – వాళ్ళెవరో మంచివాళ్ళు పాపం – ఖాళీచేసి పెళ్ళికి వచ్చిన బంధువులకిచ్చారు భోజనాలయిం తరువాత – రాత్రి పడుకోడానికి స్థలం కోసం వెతుక్కుంటున్నాను పక్క ఇంట్లో బోలెడంత ఆవరణఉంది దాంట్లో చాలా వేపచెట్లున్నాయి ఒకమూల నులక మంచం ఎవరికీ కనపడకుండా నిల్చుని

ఉంది. మరీఒదిగి కొంతమంది బెడ్డిం గులు, జంపకానాలు పరచి ఎక్కడి వాళ్ళక్కడ నడుం వాలుస్తున్నారు నేనా నులకమంచం తీసుకువచ్చి దూరంగా ఓమూల వేపచెట్టుకిందవేసి దానిమీద పడుకున్నాను ఎండాకాలం చిటచిట లాడుతున్నది చొక్కా బనీను కూడా తీసి పడుకున్నాను నులకమంచంలో నులక గరుగ్గా పదునుగాఉంది వీపు నులకకేసి రుద్దుతూ అటూ ఇటూ కదు ల్తుంటే చాలా హాయిగా ఉంది. నులక బిగింపు సరిగాలేదు ఉయ్యాల్లో పడు కున్నట్టుగా ఉంది ఓ సిగరెట్టు ముట్టించి నులకమంచం సుఖాన్ని అనుభవిస్తూ ఆకాశంలోకి చూస్తున్నాను వేపచెట్టు మీంచి వచ్చే గాలికూడా వేడిగా ఉంది ఇంతలో మా బావ సన్నాసికట్టి ఎక్కడ నుండి వచ్చాడో అమాంతం ప్రత్యక్షం అయి 'ఏంరా నీకోసం వెదుకుతుంటే ఇక్కడపడుకున్నావా ?' అన్నాడు చాలా కఠినంగా ... ఇక్కడ హాయిగా ఉంది బావా అన్నాను అయితే జరుగు, అంటూ నాపక్కనచేరాడు ఆమంచం చిన్నది ఇద్దరికిసరిపోదు మరీ అంత దగ్గరకు రాకు బావా అన్నాను అనేకొద్దీ పక్కకు జరుగుతున్నాడు ఓ రేయ్. . పూర్వ జన్మలో నీవు నాపెళ్ళానివిరా అన్నాడు నాకు నిజానికి సిగ్గేసింది

ఎప్పుడన్నా బీడీ కాల్చేవురా ? అన్నాడు ఛ...అదేమిటి బావా ! నువ్వూ నేనూ బీడీలుకాలుస్తామా ! రైల్వేపోర్టర్లూ రిక్షావాళ్ళూ కాలుస్తారుగాని అని అన్నాను దాంట్లో ఏమన్నా మజావుందేమో చూడాలి అంటూ రెండు బీడీలుతీసి నాకొకటి ఇచ్చాడు నాకాశ్చర్యం వేసింది గోల్డ్ ఫ్లేక్, స్పెన్సర్ సిగార్సూ తప్ప ఎప్పుడూ మరోటి కాల్చని బావ బీడీ ఎందుకు ముట్టిం చాడో తెలియదు బీడీ ముట్టించి – దట్టంగా నామీదికి పొగవదిలాడు గుర్రబ్బండీ వాసనవచ్చింది. రెండు దమ్ములు లాగి భలేఘాటురా...అన్నాడు కంపెనీకోసం నేనూ ముట్టించాను ఆఘాటుకు తట్టుకో లేక ఉక్కిరి బిక్కిరి అయాను. అవతల పారేశాను ఆయన నవ్వాడు నేనూ నవ్వాను ఇద్దరం నవ్వుకున్నాం ఈవేళ భోజనం చాలా హెవీగా ఉందిరా. గోంగూరపచ్చడి బ్రహ్మాండంగా ఉందిరా అన్నాడు ఆయనకు ప్రతి దాంట్లోనూ ఆనందం కన్పిస్తుంది మాట్లాడుతూ మాట్లాడుతూ నిద్ర కుపక్రమించాడు ఆయనకు కళ్ళు మూసుకుంటే – వెంటనే నిద్రపడుతుంది గురకలుగూడా పెడ్తు న్నాడు నిద్రలో నామీద చేయివేశాడు మాబావనుగురించి ఆలోచిస్తూ పడు కున్నాను ఇలాంటిబావ నాకు లభించడం నా అదృష్టమే అనుకున్నాను

వ్యాపారనిమిత్తం హైదరాబాదు అప్పు డప్పుడు వస్తుంటాడు బావ వచ్చేటపుడు ఏదో మునిగిపోయినట్టుగా టెలిగ్రాం ఇస్తాడు నాకసలు ఎక్కడనుండయినా




చెలిగ్రాంవస్తే విపరీతమైన భయం ఎక్కడఁ ఎవరికి ఏం కొంప మునిగిందేమోనని ఆయన నాతో చాలాసార్లు అన్నాడు హైదరాబాదులో అడుగుపెట్టానే నీవే ముందు కన్పించాలిరా ... అని ఒకసారి ఏదో అర్జంటు పనిఉండి స్టేషనుకు వెళ్ళలేదు టాక్సీ దిగుతూనే ఏంరా...కళ్ళు నెత్తిమీదికి వచ్చాయా... అవ్వేలే పెద్ద ఆఫీసరువిగదూ నీకంటికి మేం కన్పిస్తామా? అన్నాడు ఆమాటలు కఠినంగానూ ఓ విధమయిన విసురుగా ఉన్నాయి అలాంటప్పుడు నేనేం' సమాధానం చెప్పకుండా నవ్వుతాను. అంతకన్న పెద్దగా ఆయన నవ్వుతాడు భుజంమీద గట్టిగా చరుస్తాడు పెద్దగా. ఆయనవి బలమైనచేతులు పొడవైనవేళ్ళు వీపుమీద అయిదువేళ్ళు అచ్చు పడవలసిందే కొంచెం బాధ కలిగినా ఎందుకో హాయిగా 'ఉంటుంది భోజనానికి లే బావా అంటే కందిపచ్చడి చేశారా లేదా? అంటాడు బావగారువస్తే అది లేకుండానా... అంటాను ఆయనకప్పుడు ఎంత సంతోషమో చెప్పలేం. ప్రతి చిన్నవిషయానికి ఆనందిస్తాడు. అది నాకెంతో తృప్తినిస్తుంది ఇతరులను కూడా అలాగే ఆనందపరుస్తాడు మాబావ వస్తే నాకు పండగలాగే ఉంటుంది మా బావను తల్చుకున్నపుడల్లా మాఅక్క ఎంత అదృష్టవంతురాలో అనుకుంటూ ఉంటాను మా అక్కపేరు సుందరి

ఆమెను సురీ అని, దరీ అని చిలిపిగా పిలుస్తుంటాడు ఆయన నోటికి ఏదొస్తే ఆపేరుతో పిలుస్తుంటాడు నన్నోసారి ఒరేయ్ చతుర్భుజం... అన్నాడు. ఏవిటి బావా, ఈ పేర్లు. నీకొచ్చిన జామెట్రీఅంతా చూపించేస్తున్నావ్... అన్నాను.

నీపేరు శివరామారావు కాదుటోయ్... అన్నాడు. అవును నాపేరు అదే. నన్ను శివం అంటాడు బావ. ఆపేరుతో పిలిస్తే నాకెంతో బావుంటుంది. మాబావను గురించిన సంఘటనలు చెప్పుకుపోతే ఎంతైనా ఉన్నాయి నాకోచెల్లెలుంది.ఆమె పేరు సత్యవతి యమ్మే ప్యాసయి కాలేజీలో ఉద్యోగం చేస్తున్నది ఆమెను సత్యం అని పిలుస్తాడు బావ చిన్నప్పుడు మహా ఏడ్పించేవాడు ఆమెను ఆమె పియుసి చదువుతున్నప్పుడు ఓసారి బావతో అన్నది – "నీకంత పలుకుబడి ఉన్నదిగదా నాకో చిన్న ఉద్యోగం ఇప్పించగూడదూ" అని మా బావ నవ్వుతూ 'అక్కడా ఆక్కడా ఉద్యోగం ఎందుకూ... నాదగ్గరే నాకు పి.ఏ గా ఉండు. 'పే' మాత్రం ఏమీవుండదు' అన్నాడు సత్యవతి నవ్వింది నేనూ నవ్వేను అందరం నవ్వేం... అందరి నవ్వూ అయింతరువాత 'పిచ్చిపిల్లా... నీకు ఉద్యోగం ఎందుకమ్మా. నీకో మంచి సంబంధంచూసి వైభవంగా పెళ్ళిచేస్తాం అందరంకలిసి' అని అన్నాడు ఫో... బావా... అంటూ సత్యవతి పరుగెత్తింది ఆడామగా విచక్షణలేకుండా అందర్నీ నవ్విస్తుంటాడు బావ జీవితంలో ఆనందం తప్ప మరోటి ఎరగనివ్యక్తి మా లలిత (నా శ్రీమతి) కూడా అన్నయ్యగారు వచ్చారని అంటూ నోరంతా తెరచుకుని కళ్ళు పెద్దవిచేస్తూ గెంతినంత పని చేస్తుంది – మాబావ ఎప్పుడైనా మాఇంటికి వచ్చినపుడు సత్యవతి ఇప్పుడు గుంటూరులో పని చేస్తున్నది.

నాకు మరో చెల్లెలుంది మాపింతల్లిగా రమ్మాయి పుత్తడిబొమ్మ... పేరు అన్నపూర్ణ. ఆమె పెళ్ళికి వెళ్ళినపుడు నేనూ, బావా, ఎంత అల్లరోచేశాం ఎంతో సరదాగా గడిపేం అన్నపూర్ణకు బోలెడు ప్రజంట్సు తీసుకొచ్చాడు బావ. ఆరోజురాత్రి ఊళ్ళో ఎక్కడో హరికథ చెప్తున్నారని తెలిసి నన్ను లాక్కెళ్ళాడు. హరికథ వింటూ బ్రహ్మానందంగా ఉందన్నాడు ఇంటికివచ్చి హరిదాసు ఎగిరినట్టే తనూ ఎగిరేడు. ఏవిటి బావా మరీ చిన్నపిల్లాడి వయిపోతున్నావ్ అంటే నామీద ఇంతెత్తున ఎగిరేడు నేను కాలికి గజ్జెగట్టి చేతికి చిరుతలు తీసుకుంటే ఎలాఉంటుందో తెలుసా... అంటూ ఒక పద్యం ఎత్తుకున్నాడు బావంటే ఆయనే బావ. అన్నపూర్ణపెళ్ళి అలా జరిగి పోయింది. పెళ్ళి మొన్న మొన్న అయి నట్టుగా ఉంది, మూడేళ్ళయినా. మాబావ వాళ్ళను ఆశీర్వదిస్తూ చిలకాగోరింకల్లాగ– అన్యోన్య దాంపత్య సుఖంతో కలకాలం



పండంటి పిల్లల్నికని హాయిగా వర్ధిల్లండి అని దీవించాడు. నేనూ దీవించాను, అందరూ దీవించారు. పదే పదే పేర్లు చెప్పించారు. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ భోజనాల దగ్గర కూర్చున్నపుడు–మాబావ నానా హడావుడి చేశాడు. వాళ్ళచేత ఒకరిఎంగిలి ఒకరికి తినిపించాడు. అన్నపూర్ణ మొగుణ్ణి అమాంతం కావలించుకున్నాడు బావ. కావలించుకుని అతణ్ణి ఊపేస్తూ నీవు చాలా లకీఫెలోవోయ్... నీకు బంగారుబొమ్మ దొరికింది అన్నాడు. మా బావ ఆప్యాయతను చూస్తుంటే నాకు కళ్ళు చెమర్చినయి.

ఆ దృశ్యం ఇంకా నా కళ్ళల్లో మెదుల్తూనే ఉంది. పుత్తడిబొమ్మ .. అన్నపూర్ణకు ఇంతలో ఇంత అవాంతరం వస్తుందనుకోలేదు.

పెళ్ళయిన సంవత్సరానికే అన్నపూర్ణ మొగుడు జీప్ యాక్సిడెంటులో ... అన్నపూర్ణ గాజులు పగలగొట్టి–స్టీరింగ్ బలంగా గుండెలకు అదుముకుని–పోతూ పోతూ ఆమె నుదుటి కుంకుమ బలంగా

చెరిపేసి - ఆమెను పేలవంచేసి మరీ వెళ్ళిపోయాడు నిర్దాక్షిణ్యంగా.

అన్నపూర్ణకు ఇపుడు ఇరవై ఏళ్ళు. ఈ విషాదవార్త విన్నపుడు మా బావ ఎంతగానో ఏడ్చాడు అందరికన్నా ఎక్కువగా ఎప్పుడు ఆ విషయం తలపు వచ్చినా దుఃఖం కట్టలుత్రెంచుకుని వచ్చేది. చిన్నపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చేవాడు. సంవత్సరం దాటింది. గాయం క్రమంగా మానుతున్నది అన్నపూర్ణ ఇపుడు అత్తవారింట్లోనే అత్తమామలకు సపర్యలు చేస్తూ ఉన్నది వాళ్ళది గోదావరి జిల్లాలో ఓ పల్లెటూరు లలిత ఎప్పుడూ అంటుంది ఆమెను తీసుకురమ్మనమని ఆ పల్లెటూర్లో బొట్టన్నా పెట్టుకోనివ్వరు. అందరూ కాకులు పొడిచినట్లు పొడుస్తారు. అదీ ఆమె బాధ ఇక్కడకు తీసుకువస్తే ఏదో చిన్న ఉద్యోగంలో చేర్పించవచ్చు నని - లలిత అనుకుంటూ ఉంటుంది. లలితకు ఎన్నో కోరికలున్నాయి అన్న పూర్ణను మనిషిని చెయ్యాలని. ఇంటికి రాగానే ముందు చేసేపని లలిత ఆమెకు బొట్టు పెడుతుందట. లలిత ఎంత అమాయకురాలూ అనుకున్నాను.

* * *

ఎప్పుడూ అన్నపూర్ణే నా కళ్ళల్లో ఉంటుంది అన్నపూర్ణను గురించి ఆలో చిస్తున్నాను. ఇంతలో లలిత టెలిగ్రాం వచ్చిందండీ...అన్నది టెలిగ్రాం మా బావ దగ్గరనుండి. ఎప్పుడూ తను వస్తున్నానని ఇచ్చేవాడు. ఇప్పుడు నన్ను రమ్మన్నాడు పైగా అర్జంటట... నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు

'ఏవండీ నేనూవస్తాను పదండి ... అన్నయ్యగారు టెలిగ్రాం ఎందుకిచ్చారో అని నాకూ ఆదుర్దాగా ఉంది మీరు ఒక్కరూ వెళ్తే నేనిక్కడ ఒక్కతెనీ బిక్కుబిక్కు మంటూ కూచుంటే మరీ ఆందోళనగా ఉంటుంది...' అన్నది లలిత అన్నయ్యగారికి ఏ ఆపదా రాకూడ దని వేయి దేవుళ్ళకు మొక్కుకున్నది, లలిత

అన్నపూర్ణకు అన్యాయం జరిగినప్పటి నుండీ మాఇద్దరికీ మనసు ఎప్పుడూ ఆందోళనకరంగా ఉంటోంది - ఎప్పుడు ఏది వినవలసి వస్తుందో అని. అయినా మాబావకు బోలెడు బలగంఉంది కోఅంటే కోటిమంది వచ్చివాలతారు. ఆదుకుంటారు ఎంత వద్దనుకున్నా ఎప్పుడూ మనసు కీడే ఊహిస్తుంది అందుకేనేమో కీడెంచి మేలెంచమన్నారు అయినా మాబావను చూసి చాలారోజులయింది. ఆయనో గమ్మత్తుమనిషి. నన్ను ఊరికేచూద్దామని- అలా అంటేగాని రానని టెలిగ్రాం ఇచ్చా డేమో. ఇన్ని ఆలోచనలెందుకు ఒకసారి వెళ్తే సరిపోదూ అనుకున్నాను మాబాస్‌కు ఫోనుచేసి చెప్పి - నేనూ లలితా బయలుదేరాం. రైలులో కూచున్నంత సేపూ లలిత మౌనంగా, కిటికీదగ్గర కూర్చుని - కిటికీలోంచి ఆకాశాన్ని



భూమిని, కూడా పరుగెత్తుకొస్తున్న చెట్లనీ తదేకదీక్షతో చూస్తున్నది. నేను సిగరెట్లు ఊదేస్తున్నాను

మాబావ ఇల్లు చాలా పెద్దది దగ్గరఉండీ మరీ మోడరన్‌గా కట్టించుకున్నాడు. ఇంటిముందు రకరకాల క్రోటన్స్... పూలమొక్కలు ఆయనకు బోగిన్‌విలా అంటే చాలా ఇష్టం రంగు రంగుల బోగిన్‌విలా నాలుగువైపులా ఇంటిని అంటిపెట్టుకుని ఉంటాయి ఇంట్లో నౌకర్లకేం కొదవలేదు. రెండు జాతికుక్కలున్నాయి. హైదరాబాద్ వచ్చినపుడల్లా వాటికోసం ఖరీదైన బిస్కెట్లు తీసికెళ్తుంటాడు ముగ్గురు పిల్లలు బావకు పెద్దది ఉమ పన్నెండేళ్ళుంటాయి తరువాత రమ మూడోవాడు రవి అయిదేళ్ళుంటాయి. బడికి వెళ్తున్నాడు. మామూలుగా పెద్దవాళ్ళ ఇళ్ళల్లో ఉండే ఆధునిక పరికరాలన్నీ ఉన్నాయి–రేడియోగ్రామ్ మొదలుకుని రిఫ్రెజిరేటర్ దాకా రిఫ్రెజిరేటర్‌లో దోసావకాయ పెట్టించాడు సుందరక్కతో పోట్లాడి దాంట్లో వచ్చుళ్ళా, ఊరగాయలూ పెట్టుకుంటారటండీ అని నవ్వింది ఓసారి మా సుందరక్క.

రైలుదిగి భయపడుతూ భయపడుతూ, నేనూ లలితా ఇంట్లో అడుగుపెట్టాం వెంటనే మాబావ కన్పడలేదు ఇల్లంతా బంధువులతో సందడిగా ఉంది

ఒకగదిలో సుందరక్క పడుకుని ఉంది. పక్కనే బావ కూచుని ఉన్నాడు నన్నుచూస్తూనే, ఒరేయ్ ... మీ అక్క దగ్గరకూచో అన్నాడు నేను అటువైపుగా వెళ్ళి అక్కపక్కన కూచున్నాను సుందరక్క రెండు రోజులనుండి కోమాలో ఉందిట. డాక్టరు అది డయబెటిక్ కోమా అన్నాడు మందులూ ఇంజక్షన్లు ఇస్తున్నారు మరో ఇరవై నాలుగు గంటల్లో తెలివి రావచ్చు అంటున్నారట డాక్టరు. ఎంతకీ తెలివిరాదేం అని డాక్టరు హోరా హోరీగా పోట్లాడుతున్నాడు బెజవాడ పెళ్ళిలో గోంగూర పచ్చడితిని బీడీకాల్చిన బావ నాకెదురుగా కూర్చుని ఉన్నాడు. ఈబావే అన్నపూర్ణ పెళ్ళిలో హరికథ వినివచ్చి ఇల్లంతా గంతులువేశాడు ఇప్పుడు చలనరహితంగా భయంకర నిశ్శబ్దంలో కూచుని ఉన్నాడు. ఇల్లంతా బంధువులతో సందడిగా ఉన్నా భావురుమంటోంది సుందరక్క ఆఇంటికి దీపం ఆమె అటూ ఇటూ కదుల్తుంటేనే ఆ ఇంటికి వెలుతురు. ఆవెలుతురుముందు ఏ ట్యూబ్ లైట్లూ పనికిరావు

సాయంత్రం మళ్లీ డాక్టరు వచ్చాడు. కోమాలో కొన్ని కాంప్లికేషన్స్ కూడా వచ్చాయి అన్నాడు కిడ్నీస్ ఎఫెక్ట్ అయినయి. బ్లడ్ సర్క్యులేషన్ మామూలుగాలేదు ఇంజక్షన్స్ ఇస్తూనే ఉన్నాడు. సుందరక్క కళ్ళు మూసుకునే మా అందరివైపు చూస్తున్నది సత్యవతి కూడా వచ్చినట్లుంది పిల్లల్ని సముదాయిస్తున్నది. మరోగదిలో కూర్చుని వాళ్ళతో ఏదోకబుర్లు చెప్తున్నది రవిని ఆపడం కష్టం. వచ్చి అమ్మదగ్గర పడుకుంటా నంటున్నాడు.

గదిగుమ్మంలో నిల్చుని – 'అన్నాయ్. ఓసారి రారా.. ' అని నన్నుపిల్చింది. 'బావగారు మరీజావైపోతున్నారు. అలా వసారాలోకి తీసికెళ్ళి ఆయనతో ఏదైనా మాట్లాడుతూ ధైర్యంచెప్పు'–అని అన్నది. నాకాసమయంలో బావతో మాట్లాడాలంటే భయంగానూ దిగులుగానూ ఉన్నది

సత్య కాఫీ తెచ్చి ముందుగదిలో ఉంచింది

బావను నెమ్మదిగా చేయిపుచ్చుకుని లేవదీశాను. యాంత్రికంగా నాతోవచ్చి కాఫీ తీసుకుంటున్నాడు కాఫీ త్రాగుతూ బావే సంభాషణ కుపక్రమించాడు 'ఒరేయ్ ... ఆడవాళ్ళకు డయబిటిస్ వస్తుందిరా... నేనెప్పుడూ అనుకోలేదు. అది లోపల దాక్కుని ఇప్పుడు బయట పడ్డది సుందరి ఎప్పుడు నాతో అననేలేదు దీన్నిగురించి.. ' అంటూ.

'అవును బావా ... ఆజబ్బు లక్షణమే అంత. మొదట్లో ఏమీ తెలియదు ఆరోగ్యంగా మిసమిస లాడుతూనే కన్పిస్తారు. అయినా మూడు కాన్పులమీదట నెమ్మదిగా ఇప్పుడు బయట కొచ్చుంటుంది' అన్నాను

'ఈ కోమా చూస్తుంటే నాకుభయంగా ఉందిరా' అన్నాడు.

'ఈ రాత్రికి తెలివి వస్తుందిలే బావా... డాక్టరు ధైర్యం చెప్పేడుగా' అన్నాను.

ఇద్దరు డాక్టర్లు ఒకరిని ఒకరు సంప్రదించుకుని వైద్యం చేస్తున్నారు. సాయశక్తులా ప్రయత్నం చేస్తున్నారు. ఈ రాత్రి గడిస్తే ఫరవాలేదన్నాడు డాక్టరు.

ఆరాత్రి గడియారంవైపే చూస్తూ కూచున్నాను. బలవంతాన చేతులో పెట్టినా ఆ ముళ్ళు కదల్లంలేదు. మాబావ నాభుజంమీద చేయివేసి నన్నంటి పెట్టుకునే కూర్చున్నాడు.

సుందరక్క ఆ ఇంటికిదీపం. మిణుకు మిణుకుమంటూ ఉంటే, ఆజ్యోతి గాలికి అటూ ఇటూ పాము పడగలా కదులుతున్నది. మేంచూస్తుండగానే ఎవరోగట్టిగా ఊదేశారు దాన్ని. అటూ ఇటూవేగంగా కదుల్తూ ఒక్కసారి ఆరిపోయింది. మాబావ నన్ను కావలించుకుని ఘొల్లుమన్నాడు. గుండెలు బద్దలయ్యేట్టు ఏడ్చాడు. ఫెడీ ఫెడీ గుండెలు బాదుకున్నాడు. ఆ ఇంట్లో చీకటి చిందులు తొక్కింది. ఇంతకన్నా జరిగినఘోరాన్ని వర్ణించలేను. రాస్తుంటేనే నాకు ఏడుపువస్తున్నది. ఏ ప్రేమ సంఘటనో అయితే అందరికీ సంతోషాన్ని గలిగించేట్టుగా వర్ణిదును.

మర్నాడు జరగవలసిన కర్మకాండ లన్నీయథావిధిగా జరిగినై. ఏదీ ఆగదు.

రోజూ సుందరక్కకు పూలు ఇచ్చే మనిషి ఎంతగానో ఏడ్చింది సిరిగలతల్లీ సుందరమ్మా ... అపుడే నీకు నూరేళ్ళు నిండేయా... అంటూ భోరు – భోరున ఏడ్చింది. మహాదొడ్డఇల్లాలు... అన్నది. స్మశానానికి వచ్చి బుట్టెడుపూలు శవం మీద కుమ్మరించింది. సుందరక్కకు మల్లెపూలంటే ఇష్టం. ఆబజారువాళ్ళంతా సుందరక్కను తల్చుకుని కంటతడి పెడ్తూనేఉన్నారు.

ఎన్నాళ్ళుండగలను బావదగ్గర. బావను ఎవరు ఓదార్చగలరు. అక్కడ ఉన్నన్నాళ్ళూఉండి నేనూ లలితా బయలు దేరేం. మా సుందరక్క పోయిందన్న దుఃఖంకన్నా, మా బావకు ఇలాంటి ఆపత్తు వచ్చిందని రైల్లోకూడా నాకేడ్పు వచ్చింది. రైలుకూడా మాతోపాటు రొద పెడ్తూనే మమ్మల్ని తీసుకువచ్చి హైదరాబాద్‌లో పారేసింది.

* * *

రోజులు గడుస్తున్నాయి. కాలం పరుగెత్తుతూనే ఉంటుంది. అన్నపూర్ణ మొగుడుపోయి రెండేళ్లు దాటింది. ఇప్పుడు సుందరక్క. తగిలిన వేలుకే తగులుతుందిదెబ్బ. రెండోసారి తగిలిన దెబ్బ మరీ బాధగా ఉంటుంది. మొదటిది పూర్తిగా నయం కాదుగనుక – మాబావకు బోలెడు ఆస్తి ఉందిగనుక – బెల్లంచుట్టూ చీమలు మూగాయి. ఆయన బంధువు లెవరో ఒకళ్ళిద్దరు,ఇప్పుడు ఆయనదగ్గర ఉంటున్నారు. ఒకాయన వేలువిడిచిన

మేనమామ రెండో ఆయన ఆ మేన మామకు దగ్గర చుట్టం వ్యాపారంలో సహాయంచేద్దామని వచ్చారు బావకిప్పుడు నలభై ఏళ్ళు ఈ వయసులో – అలాంటి పరిస్థితుల్లో ఏ వ్యసనానికైనా బానిస కావడానికి అవకాశాలున్నాయి... కొన్ని దుఃఖం మరచిపోవడానికి, కొన్ని వయసు మరచిపోవడానికి ఎవరైనా వ్యసనాలను అలవాటు చేసుకుంటారు మా బావను గురించి నాకూ లలితకూ ఇదే భయం పట్టుకుంది ఒకభయం తరువాత మరో భయం

లలిత ఓరోజు బావనుగురించిన ప్రస్తావన తెచ్చింది – ఏవండీ చాలా రోజుల్నుండి మిమ్మల్నోమాట అడగాలనుకుంటున్నానని...

'అన్నపూర్ణకు పెళ్ళిచేస్తే బావుంటుందండీ .. అన్నయ్యగారు చేసుకోవచ్చు ఈపని మీరు పూనుకుంటే అవుతుంది' అన్నది 'ఆపని – మహానుభావుడు వీరేశలింగానికే చెల్లింది నేనేం చేయగలను' – అన్నాను

ఇలాంటి వివాహాల్నిగురించి చాలా సేపు మాట్లాడుకున్నాం నేనూ లలితా

'దీంట్లో తప్పేముంది? భర్తపోయిన అన్నపూర్ణ, భార్యపోయిన అన్నయ్యాగారూ . ఇద్దరూ ఒకే పరిస్థితిలో ఉన్నారుగదా ఆయన పెళ్ళిచేసుకోకుండా ఉండేవయసు కాదు మగవాడన్న తరువాత తప్పక చేసుకోని తీరుతాడు. ఏచిన్నపిల్లగొంతో కోయడంకన్నా అన్నపూర్ణలాంటి దాన్ని చేసుకుంటే ?' అన్నది లలిత

'బాగానేవుంది – కాని ... మా బావ ఒప్పుకోవద్దూ అయినా అందరూముక్కుమీద వేలువేసుకుంటారు ఇదిజరిగితే...' అన్నాను

'అన్నపూర్ణ కుంకుమకైనా నోచుకోలేదు ఎలాఉందోపాపం...ఓసారి చూసి రావాలి, అన్నది లలిత

అన్నపూర్ణ మామగారికి దాదాపు యాభై ఏళ్ళుంటాయి ఆయనతల్లి రాంబాయమ్మగారు వృద్ధాప్యంలో ఆయనదగ్గరే ఉంటున్నారు ఆయనకంత వయసువున్నా చిన్నవాడుగా కన్పిస్తాడు అన్నపూర్ణ అత్తగారు గూడా చలాకీ అయిన మనిషే ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉంటుంది వాళ్ళ ముగురి మధ్య అన్నపూర్ణ ఎలాఉందో ఏవిటో ? ఒకసారెచూసి రావాలి

నేనోసారి కాకినాడ క్యాంపుకు వెళ్ళాల్సివచ్చింది అన్నపూర్ణ అత్తవారి ఊరు అక్కడకు దగ్గరే. ఓ ఆదివారం వెళ్ళి రావచ్చు

లలితకూడా నాతో బయలుదేరింది.

రైల్లో పోతున్నామన్న మాటేగాని అన్నపూర్ణే కళ్ళల్లో మెదుల్తున్నది తెల్లచీరె నుదుటిమీద కుంకుమలేని చిన్న ఖాళీసున్నా. తైలసంస్కారంలేని జుట్టూ...పాలిపోయిన ముఖం...గాజులు




లేనిబోసిచేతులు ముసలివాళ్ళలా నిండుగా కప్పుకున్న పమిట పొద్దున్నే ఎవరన్నా నిద్రనుండి లేస్తే ఎవరికంటా పడకుండా పక్కకు పక్కకు తప్పుకు తిరుగుతున్న అన్నపూర్ణ

ఈకళ్ళతో అన్నపూర్ణను చూడలేనండీ అన్నది లలిత

ఆదివారంనాడు ఆ ఊరు చేరుకుని భయం భయంగా వాళ్ళఇంట్లో అడుగు పెట్టేం నేనూ లలిత

•మాఇద్దరి కళ్ళూ అన్నపూర్ణ కోసం వెతుక్కుంటున్నాయి ఆమెకన్పించలేదు పరంధామయ్యగారు నోటినిండా పలకరించాడు ఆయన భార్యకూడా చిరునవ్వుతో పలకరించింది నేనింకా అటూ ఇటూ చూస్తూనే ఉన్నాను అన్నపూర్ణ కోసం

'అమ్మాయి ఇంతకుముందే మాఅమ్మగారితో వెళ్ళింది వేణుగోపాలస్వామి ఆలయంలో పురాణం చెప్తున్నారు వచ్చేస్తుందిలెండి ' అన్నారు పరంధామయ్యగారు

ఇప్పటినుండీ పురాణాలకూ, హరికథలకూ వెళ్ళడం తర్ఫీదు చేస్తున్నారన్న మాట ! అని అనుకున్నాను

ముసి ముసినవ్వులునవ్వుకుంటూ పరంధామయ్యగారి భార్య మాకు కాఫీతెచ్చి ఇచ్చింది నేను కాఫీతాగుతూ అటూ ఇటూ చూస్తున్నాను అటువైపుగదిలో పాత కాలపు ఎత్తైన పందిరిమంచం, దానిమీద రంగు రంగుల దుప్పటి ఆగది అధునాతనంగా లేకపోయినా ఓ చక్కటి బెడ్ రూమ్ అని తెలియచేస్తున్నది గోడలకేవో పటాలున్నాయి ఆపటాల్లో

ఊదొత్తులుంచిన గుర్తులు తెలుస్తున్నాయి. నల్లగా విలువుగీతలు మరెక్కడా ఆ ఇంట్లో కనీసం నులక మంచమైనా కన్పించలేదు చిరిగిపోయిన చాపలు రెండు - మూలగా గోడకు ఆనించి ఉన్నాయి అందులో ఒకటి అన్నపూర్ణది అయిఉండాలి నా మనసు చివుక్కు మన్నది

పరంధామయ్యగారి భార్య మా మీద సానుభూతి చూపిస్తూ ఏదో మాట్లాడు తున్నది మా సుందరక్కను గురించి మాబావకు బోలెడంత కష్టం వచ్చిం దన్నది ఆమాటా ఈమాటా మాట్లాడి ఏదో సంబంధం సంగతి చెప్పింది అదీ మాబావకు ఎవరో వాళ్ళ బంధువుల అమ్మాయిట 'చిన్నవాడేగా మీ బావ పాపం ఇంతాజేస్తే నలభై ఏళ్లు ఈ అమ్మాయి అందచందాలకి లోటు లేదు' అంటూ చెప్పుకుపోయింది ఆవిడ

మధ్యలో పరంధామయ్యగారందుకుని- 'అదేవిటే . ఆ మెల్లకన్ను అమ్మాయి సంబంధమా నీవుచెప్పేదీ' అంటున్నారు

'అయితే ఏమండీ సలక్షణంగా ఉంటుంది పెళ్ళికొడుకు మాత్రం రెండో పెళ్ళివాడు కాదూ ? కళ్లు కొంచెం మెల్ల అయితే ఏం.. కళ్లు కొరుక్కు తింటామా ఏవిటి ?' అన్నది ఆవిడ

నాకూ లలితకూ నవ్వాలో ఏడవాలో తెలియలేదు ఇద్దరి మాటలకూ నేను సన్నగానవ్వి ఊరుకున్నాను

ఎవరూ అన్నపూర్ణ సంగతి అనుకోరు ప్రాణం ఉన్న మని షిగా ఎవరూ గుర్తించడంలేదు ఓ కుర్చీనిగురించి, ఓగోడను గురించి . ఇంకా ఇలాంటి ప్రాణంలేని వస్తువులు ఎవరిదృష్టిలోకిరావు ఎవరూ అనుకోరు అన్నపూర్ణ సంగతీ అంతేనేమో ఆమె ఊపిరిపీలుస్తున్న ప్రాణంలేని బొమ్మ ఓ వెలిసిపోయిన గోడ చిరిగిపోయిన చాప ఎండిపోయినచెట్టు కుంకుమ చెరిగి పోయి, మంగళసూత్రం తెగిపోయేసరికి అన్నపూర్ణ అందరిదృష్టిలో చైతన్యం లేని రాయి

నేను ఆలోచిస్తూనే ఉన్నాను లలిత నావైపే జాలిగా చూస్తున్నది వీళ్ళమీద కసితీర్చుకుని ఎప్పుడో అన్నపూర్ణకు తన చేతుల్తో కుంకుమ పెట్టాలని ఆమె కోరిక ఆమె కళ్ళల్లో ఆ కోరిక కన్పి స్తున్నది ఇంతలో రాంబాయమ్మగారూ - అన్నపూర్ణ వచ్చారు అన్నపూర్ణ తలవంచుకుని శూన్యాన్ని పులుముకుంటూ నెమ్మదిగా నడుస్తున్నది వెనకాలే రాం బాయమ్మగారు అన్నపూర్ణ మేం వచ్చి నట్లు వెంటనే గమనించలేదు అన్నపూర్ణ చిక్కి సగమైంది పెళ్ళయిన కొత్తల్లో మిసమిస లాడుతూ బంగారు బొమ్మలా ఉండేది భగవంతుడు ప్రత్యేకశ్రద్ధ తీసుకుని బంగారుమూసలో పోశాడేమో అనిపించేది కనుముక్కుతీరులో శిల్పం ఉట్టిపడుతుండేది - ఆ అన్నపూర్ణేనా



ఈమె...కాదు. ఈమె కళ్లు బాగా లోతుకు పోయి... ఎముకలేగాని కళ్ళు కన్పించ డంలేదు...

నేనే పలకరించాను: 'ఏంమ్మా... అన్నపూర్ణా కులాసాగా ఉన్నావా' అని. ఆమె ముఖంలో కాంతి చిమ్మినట్లే చిమ్మి ఆగిపోయింది. నవ్వువచ్చినట్టే వచ్చి ఆగిపోయింది.

అన్నయ్యా... అంది నెమ్మదిగా... ఎంత సేపయింది వచ్చి అన్నది. ఆరెండు మాటలకే దుఃఖం కట్టలు తెంచుకుని వస్తు న్నది ఆమెకు. మరో క్షణంలో బావురు మనేట్లుంది. లలిత అన్నపూర్ణ పరిస్థితి గ్రహించి చప్పునవచ్చి తనచేతు ల్లోకి తీసుకుంది. నెమ్మదిగా లోప లకు తీసుకువెళ్ళింది. నేనూ లలితా అన్నపూర్ణతో ఎంతో మాట్లాడుదా మనుకున్నాం. మాకు మాట రాలేదు. పరంధామయ్యగారు నన్ను పక్కకు పిలిచారు.

'అమ్మాయికి ఈమధ్య వంట్లో బాగుండ లేదు. ఉన్నట్టుండి పెద్దగా అరిచినట్టుగా-భయపడుతుంది. ఎక్కడ కారు, జీపు చప్పుడు విన్నా పెద్ద కేక పెడ్తుంది. ఒక్కొ క్కప్పుడు వళ్ళు తెలీకుండా పడిపోతుంది. మావూళ్ళో ఆచారిగారికి చూపిస్తే హిస్టీ రియా అన్నాడు. పూలచెట్లను చూసినా బెదిరిపోతుంది.' అన్నారు. నేనెక్కడో

ఆలోచిస్తున్నాను. నెమ్మదిగా తల ఊపు తున్నాను. కాస్సేపు అన్నపూర్ణ సంగతి చెప్పి – తనభార్య ఆరోగ్యాన్ని గురించిన వివరాలుచెప్పేరు. ఆమెకు కీళ్ళనొప్పులు. కూచుంటే లేవలేదు. లేస్తే కూచోలేదు. కొంచెంపనిచేస్తే ఆయాసం. పరంధామయ్యగారు చాలా తెలివైనమనిషి. నే నెక్కడ అన్నపూర్ణను హైదరాబాదు పంపించమని అడుగుతానేమోనని...వీలు పడదని చెప్పడానికి అనుకూలమైన వాతావరణం సృష్టించు కుంటున్నారు. మాట్లాడుతున్న వారల్లా మధ్యలో ఆపి – 'మా అమ్మగారిని చూశారుగా ... కళ్ళు సరిగా కన్పించవు. ఎప్పుడూ ఎవరో ఒకరు ఆమెను అంటిపెట్టుకునే ఉండాలి' అన్నారు.

ఇంక నేనేం మాట్లాడేది...

కాసేపు కూచుని అలా బయటకు వెళ్ళొస్తానని ఊళ్ళోకి వెళ్ళాను. ఓ అరగంట తిరిగి ఇంటికివచ్చాను. చీకటి పడుతున్నది. ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో అన్నపూర్ణ వంటచేస్తున్నది. పరంధామయ్యగారు నశ్యం తయారు చేసు కుంటున్నారు. కాల్చిన పొగాకును ఏదో ఆయుధంతో రుద్దుతూ దాన్ని పౌడరు చేస్తున్నారు. ఆయన భార్య కాళ్ళకు ఏదో తైలం పట్టిస్తున్నది. రాంబాయమ్మగారు కునికిపాట్లు పడుతున్నది. లలిత వంట ఇంట్లో అన్నపూర్ణదగ్గరే కూర్చున్నది.. ఆఇంట్లో ఎవరూ ఎవరితోనూ మాట్లాడు తున్నట్లు కన్పించలేదు. లలిత తాను కూడా సహాయం చేస్తానంటున్నది వంటలో. నీవువద్దులే వదినా...అంటున్నది అన్నపూర్ణ. ఈరెండు మాటలే విన్పించినయి నాకు. రాత్రి భోజనాలయినాయి. అన్నపూర్ణ మాఅందరికీ వరండాలో పక్కలువేసింది. గదిలో పందిరిమంచం మీద దుప్పటి విదిలించి వేసింది. వరండాలో ఓమూలగా రెండు చాపలు పరిచింది. రాంబాయమ్మగారు నడుంవాల్చారు.

పరంధామయ్యగారు మాతో కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుతూ – ఊళ్ళో రాజకీయాల్ని గురించి వివరిస్తూ ఆవలిస్తున్నారు. కాలుస్తున్నచుట్ట సగం అయిపోయింది. చిటికెలువేస్తూ లేచి రెండు అడుగులు వేశారు. ఆయన్ని పందిరి మంచం పిలుస్తోంది...

పరంధామయ్యగారూ ఇక పడుకుందామా అన్నాను ఆయన ఇబ్బందిని గుర్తించి.

'వేళకు నిద్రపోకపోతే ... తెల్లారే టప్పటికి కొంచెం చికాకుచేస్తుంది' అని తనసంగతి చెప్పుకున్నారు.

రాంబాయమ్మగారి పక్కనే అన్నపూర్ణ ఒదిగి పడుకున్నది.

* * *

తెల్లవారి నేనూ లలితా తిరుగు



యువ




ప్రయాణం అయినాం. అన్నపూర్ణ 'మా ఇద్దరివైపు జాలిగాచూసింది. కళ్ళతోనే మాట్లాడింది. బయలుదేరి వెళ్ళేటప్పుడు నాకళ్ళు చెమర్చినయి. రైల్లో అన్నపూర్ణ సంగతే మాట్లాడుకున్నాం. అన్నపూర్ణకు పెళ్ళిచేయాలని మాఇద్దరి సంకల్పం. మా ఆలోచనలు తెగడంలేదు. 'ముందు మీ బావగారి దగ్గరికివెళ్ళి మీరు ఒప్పించండి. ఆతరువాత అన్నపూర్ణ విషయం నేను చూస్తాను' అన్నది లలిత. లలితకు ఇంత ధైర్యం ఎక్కడినుండి వచ్చిందో తెలియదు. ఏదో ప్లానువేసింది. అనుకున్నంత సులభంగాదు లలితా అన్నాను.

రోజులు 'గడుస్తున్నాయి ... తగిలిన వేలికే మళ్లీ దెబ్బ... ఇది మూడోది ... పెద్దషాక్... తేరుకునే టప్పటికి నాకు చెమటలు పోసినయి...

అది – సత్యవతి దగ్గరనుండి వచ్చిన ఉత్తరం. సత్యవతి యమ్మే ప్యాసయింది. ఆమె వ్రాసిన ఉత్తరం – అది ఉత్తరమో కత్తిపోటో తెలియలేదు. ఇది త్యాగమో, సాహసమో, మొండితనమో నాకర్థం కాలేదు. ఉత్తరం చదివేను.

"ఈఉత్తరం మీకుఆశ్చర్యాన్ని కలుగజేయవచ్చు. ఎందుకంటే ఇలా జరుగుతుందని మీరు ఊహించి ఉండరు. బావను పెళ్ళిచేసుకోవటానికి నిశ్చయించుకున్నాను. బావకూడ అంగీకరించారు.

నాకూ బావకూ వయసులో పదిహేనేళ్ళ తేడా ఉంది. నేనూ చదువుకున్నదాన్ని. అన్ని విషయాలు ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. ఆయన ఆ స్త్రీకోసం ఇలా చేశానని ఎవరైనా అనుకోవచ్చు. ఒకరు అనుకోవడంతో నాకు నిమిత్తంలేదు. రమ, ఉమ, రవి... వీళ్ళు ముగ్గురే నాకళ్ళల్లో మెదిలేరు. బావను సుందరక్క సుఖపెట్టినట్లుగా నేను సుఖపెట్టలేకపోవచ్చు. సుందరక్క దేవత. అయినా బావ దుఃఖాన్ని మరిచిపోయేందుకే ప్రయత్నిస్తాను. ఒక మనిషిలేని లోటు మరొకరు తీరుస్తారంటే – అది జరిగేదికాదు. ఎప్పుడోప్పుడు పెళ్ళి చేసుకోవాలి గదా, ఎవరో తెలీనివాణ్ణి పెళ్ళిచేసుకునే కంటే బావనే చేసుకుంటే నాకోవిధమైన తృప్తి నిస్తుందని నాఆశ. నీకు బావంటే ఎంతో ఇష్టం. నాకూ అంతే. వచ్చేనెలలో ముహూర్త నిశ్చయం తరువాత మళ్ళీ వ్రాస్తాను. నీవూ, వదినా పెళ్ళికివచ్చి నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తూ...

ఉంటాను.

నీ చెల్లి సత్యం."

ఉత్తరం చదివి... ఎంతపని చేశావ్ సత్యా అనుకున్నాను. అన్నపూర్ణ జాలిగా మావైపుచూస్తూ కళ్ళల్లో మెదుల్తూనే ఉంది! ఇలా జరుగుతుందని నేను ఊహించలేదన్నది లలిత.






(గత సంచిక తరువాయి)

## 10

చలపతి ఆఫీసుకు వెళ్తూండగా సుభద్ర అతడి దగ్గరకు వచ్చింది.

"నన్ను అలా దారిలో రామారావుగారింటి దగ్గర దింపేసి వెళ్ళండి మీరు" అంటూన్న ఆమెవైపు ఆశ్చర్యంగా చూచాడు చలపతి. వివాహమైనదాదిగా ఆమె వదనంలో, స్వరంలో ఏనాడూ కన్పించనంత సరళసౌమ్యత లీనాడు గోచరమయ్యాయి అతడికి.

"ఏం, ఏమైనా విశేషమా? ఆవిడ కబురంపిందా?" అనడిగాడు.

"లేదు." అధోవదనురాలై కాలివ్రేలితో నేలను రాస్తూ అన్నది నెమ్మదిగా సుభద్ర. "మనస్సేం బాగోలేదు; కాస్సేపు అక్కడ గడిపి వద్దామని."

చలపతి క్షణకాలం పరీక్షగా చూచాడామెను. సమీపంగా వెళ్ళి చుబుకమెత్తి ఆదరంగా అడిగాడు: "అన్నం తిన్నావా మరి? వచ్చేసరికి ఆలస్యం కాదూ?"

"లేదు. ఆకలిగాలేదు." అలా తలవాల్చుకునే సమాధానమిచ్చింది సుభద్ర.

"ఆకలెందుకు వుండదు? రాత్రి తినలేదు, ఇప్పుడూ మానేస్తే నీరసం చేయదూ? పద, తినిరా."

సుభద్ర కదలలేదు. ఆమె అంతవరకూ ప్రయత్నపూర్వకంగా అదిమిపెట్టి వుంచిన కన్నీరు జలజలారాలడం ప్రారంభించింది.

చలపతి ఆమెను అక్కున జేర్చుకుంటూ కన్నీరు తుడిచాడు. "చ, ఏమిటి సుభద్రా యిది? నీ సుఖం కోరి చెప్పిన విషయానిక్కూడా యింతగా బాధపడితే యిక నే నేం చేసేది చెప్పు? ఏదైనా నీకు మనస్ఫూర్తిగా యిష్టమై అంగీకారమైతేనే. తెల్సిందా? ఇందులో బలవంతమనుకొని భయపడి బాధపడవలసిందీ, లేదా నైచ్యమనుకొని సిగ్గుపడి ఇంచపడవలసిందీ ఏమీలేదు. కాని, ఎప్పుడైనా నీ మనస్సులో ఏమైనా కోరికవుంటే మాత్రం చెప్పటానికి సంకోచించవద్దు ... సరేనా. పద, ఇద్దరం భోంచేసి వద్దాం."

కళ్ళు ఒత్తుకుంటూ అన్నది సుభద్ర: "మీకు ఆలస్యమై పోతుందేమో ఆఫీసుకు?"

"ఫర్వాలేదులే. ఈ ఒక్కరోజుకూ పోనీ ఓ పావుగంట ఆలస్యంగా వెళ్తాను."

సుభద్రా చలపతీ రామారావు యింటికి వెళ్ళేసరికి పిల్లలకు అన్నాలు పెడ్తూ బ్రతిమాలి బ్రతివాలి వెంటబడి తినిపిస్తోంది, రమ– ఆ గాలికబుర్లూ ఈ కట్టుకథా చెప్తూ.

"మా సుభద్ర కేం తోచడం లేదట. కాస్సేపు మీతో కబుర్లు చెప్పుకోవాలని వచ్చింది," అంటూ సుభద్రను రమదగ్గర వదిలేసి వెళ్ళిపోయాడు చలపతి.

"చాలా సంతోషం. రండి," అంటూ సాదరంగా ఆహ్వానించింది రమ సుభద్రను. "నేనూ రోజూ రావాలనే అనుకుంటున్నాను కాని, ఎక్కడైనా తీరితేనా?" అన్నది పిల్లలకు చేతులూ, మూతులూ కడుగుతూ.

అలాగే అవాక్కయి ఆశ్చర్యంగా చూడసాగింది రమను సుభద్ర. ఆనాడు పేరంటంలో ఎంతో ముస్తాబుతో అందంగా ఉన్న కళలాడుతున్న రమకూ ఇంటి పనితో సతమతమౌతూ ఇంకా స్నానమే చేయని ఈ రమకూ ఎక్కడా పోలిక లేదు.

సుభద్ర అంతర్యాన్ని గ్రహించినట్టు దానిలాగా నవ్వేస్తూ అన్నదిరమ: "ఇలా బొత్తిగా పనిమనిషిలాగుం దేమిటా అనా అలా చూస్తున్నారు? నేనింతే రెండి మధ్యాహ్నం పన్నెండు వరకూ!"

"అహాఁ లేదు, లేదు; అదేంలేదు," తొట్రుపడుతూ అన్నది సుభద్ర, రమ తన మనస్సును చదివేసినట్లుగా మాట్లాడ్డంతో.

"రండి పైకి వెళ్దాం" అంటూ మేడమీదికి తీసికెళ్ళింది రమ సుభద్రను.

సుభద్రతో ఈ కబురూ ఆ కబురూ చెపుతూనే పిల్లలకు దుస్తులు మార్చి మంచివి తొడిగింది. "కాస్సేపు ఆడించవే సీతా. నేను స్నానంచేసి వస్తాను. జాగ్రత్త సుమా. పడిపోతారు గంతులేసి. కాస్సేపు ఓపికగా చూడు! ఇప్పుడే వచ్చేస్తాను," అంటూ పదిసార్లు పనిపిల్లకు ఒప్పగించి, స్నానానంతరం తాను ధరించబోయే దుస్తులు తీసుకుని బీరువాతాళం వేసింది రమ. "కాస్సేపు ఈ పుస్తకాలు చూస్తూండండి. పదినిముషాల్లో వచ్చేస్తాను" అని సుభద్రకు ఏవో రెండు పత్రికలు యిచ్చి వెళ్తూంటే హడావుడిగా రమ పెద్దకొడుకు వచ్చాడు.

"ఆకలైపోతోంది. త్వరగా అన్నం పెట్టమ్మా." వస్తూనే పుస్తకాలు మంచంమీదకు విసిరేసి జబర్దస్తీ ప్రారంభించాడు.

"పెడతాను బాబూ, దానికంత అల్లరెందుకు?" అని నవ్వుతూ, కొడుకు గిరవాటేసిన పుస్తకాలుతీసి సర్ది వాడిని దగ్గరకు తీసుకుంది. "చూడు ముఖం ఎలావుందో! ఎండలో ఆడావుకదూ?" అని వాడి ముఖం చీరకొంగుతో ఒత్తుతూ, "కూర్చోండి, తొందరగానే వచ్చేస్తాను," అని సుభద్రకు మళ్ళీ చెప్పి సురేష్‌తో క్రిందకు వెళ్ళిపోయింది రమ.

ఒంటరిగా గదిలో మిగిలిన సుభద్రకు అనేక ఆలోచనలు రాసాగాయి. పాపం, రమకు కాస్త తల దువ్వుకోవటానికీ, స్నానం చేయటానికికూడా తీరికలేదు. పిల్లలు పిల్లలంటూ తపించిపోతారు కాని, "ఛీ – పిల్లలంత చీకాకు వాళ్ళేకాని మరోటిలేదు ఈ ప్రపంచంలో!"

పుస్తకాలు తిరగేస్తూంటే మరో ఆలోచన. 'ఇంతకూ వీళ్లు రమ పిల్లలేనా?' మనసున ఒకనాడు తలెత్తిన అనుమానం అలాగే వుండిపోయింది. 'అఁ కాకపోతే తనకేం పట్టిందీ అంత యిదిగా చూడటానికి?' అనుకుంది మళ్ళీ.

పత్రికలపై అంతగా మనసు నిలవక, లేచి గదిలో పచార్లు సాగించింది గదిని పరికిస్తూ. ఆ గదిగోడలపైనున్న ఫోటోలు చూస్తూంటే సుభద్ర కాస్సేపు కను రెప్పలు కదలించడం మరచిపోయింది. రామారావు పెళ్ళిఫోటో – కాని ఆ పెండ్లికూతురు మాత్రం రమకాదు! పిల్లలతో మురిపంగా తీయించుకున్న ఫోటోలుకూడా నాలుగైదు వున్నాయి. కాని ఎందులోనూ రమలేదు. ఆ వున్న స్త్రీ ఎవరో?

సుభద్రలో అంతవరకూ బీజరూపంగా వున్న అనుమానం అప్పటి కప్పుడే మొలకెత్తి, వేరూని, ఎదిగి మ్రానై మహావృక్షమై పోయింది. ఆ అనుమాన

నివృత్తి చేసుకుంటేనే కాని మనస్సు నిలువలేని పరిస్థితికి వచ్చేసి, మెల్లగా గది వెలుపలికివచ్చి క్రిందికి దారితీసింది. మేడమెట్ల వరండాలో పిల్లల్ని ఆడిస్తూన్న పనిపిల్లతో ఏమైనా మాట్లాడితే విషయం తెలుస్తుందేమో ననుకుంటూ అటు దారితీయబోయిన ఆమెకు స్నానంచేసి తడిశరీరం మీదనే చీరకట్టుకుంటూ వస్తూన్న రమ ఎదురుపడనే పడింది.

సుభద్రను చూచి కొంచం బిడియపడుతూ అన్నది: "ఏం చేసేది చెప్పండి. ఆయన భోజనాని కొచ్చే వైమైంది మరి." అని చీర ఆదరాబాదరా కట్టేసుకుంటూనే ప్రక్కగదిలోకి దారితీసింది. సుభద్ర మౌనంగానే ఆమె వెంట వెళ్ళింది.

ఓ పావుగంటసేపు శ్రద్ధగా, భక్తితో పూజచేసింది రమ. తర్వాత దైవపీఠం ప్రక్కనే వున్న ఒక సుమంగళి చిత్రపటానికి పూజచేసి అంజలి ఘటించి, ప్రసాదం నోట్లో వేసుకుని అప్పుడు తిరిగి ఈ ప్రపంచంలో పడింది. పూజచేసిన పువ్వులు రెండు తనుపెట్టుకుని, రెండు సుభద్ర కిచ్చి, "రండి" అంటూ మళ్ళీ మెట్లమీదికి దారితీసింది.

"పాపం, రాకరాక మీరువస్తే నేను నా పనుల్లో కొట్టుకుంటున్నాను కదూ? మీరు వస్తున్నట్లు కాస్త ముందుగా తెలిస్తే పనులు తొందరగా తెముల్చుకుని వుండేదాన్ని" అని నవ్వి, మళ్ళీ "అనుకుంటాం గాని పిల్లలతో తెమలడం కష్టం లెండి. మరి తెలిసీతెలియని పసివాళ్ళు – అడుగడుగునా ఏదో ఓ పేచీలు పెడుతూనే వుంటారు," అన్నది.

సుభద్ర వింటోందే కాని ఆ మాటలనంతగా పట్టించుకోవటంలేదు. ఆమె మనస్సులో ఇంకా ఆ సందేహమే కలభమై దొలుస్తూన్నది. ఇక ఆ సందేహ భారాన్ని మోయలేక అడిగేసింది: "ఆవి డెవరండీ? ఆ పటానికి మీరు పూజ చేస్తున్నారు?"

జవాబు చెప్పటానికి రమ తటపటాయించింది ఓ నిముషం. తర్వాత మెల్లగా అన్నది: "ఈ గృహదేవత!"

సుభద్రకు అర్థం కాకపోయినా అప్పటిమట్టుకు మరి రెట్టించకుండా వూరుకుంది. గదిలోకి వెళ్ళికూర్చున్నాక రమ తల దువ్వుకుంటూ ఆ కబురూ ఈ కబురూ చెప్తోంది; సుభద్రకూడా మధ్యమధ్య మాటలు కలుపుతోంది పరధ్యానంగా!

మధ్యలో ఒకసారి లేచివళ్ళ పిల్లలేం చేస్తున్నారో చూచి వచ్చింది రమ.




"పూర్తిగా పనివాళ్ళమీద వదలకండీ పిల్లల్ని. మనచాటున వాళ్ళు తిట్టి కొడుతూ వుంటారు పిల్లల్ని. మన పెట్టుపోతలు ఎంతబాగున్నా వాళ్ళకి విశ్వాసాలు వుండవు" అన్నది.

"అవును" అంది సుభద్ర ముక్తసరిగా.

"మీ నరసమ్మ చాలా మంచిది. అటువంటి వాళ్ళని అరుదుగా చూస్తాం" అన్నది తిరిగి రమ. "అన్నట్టు వంటమనిషిని మాన్పించేశారట, క్రొత్తగా ఎవరైనా కుదిరారా?"

"ఇంకా లేదండీ" చాలా మామూలుగా చెప్పింది సుభద్ర.

"పాపం. అయితే మీరే అవస్థపడుతున్నారన్నమాట! పిల్లలతో, వంటతో యింత త్వరగా తెమిలారంటే నాకెంత ఆశ్చర్యంగా వుందో! మీరు పనులు చకచకా చేసుకుంటూ పోతారనుకుంటాను. 'రేపు సినిమాకు వెళ్ళాలంటే నీకు యివ్వాళే చెప్పాలి; వచ్చే సంవత్సరం వూరెళ్ళాలంటే నీకు ఈ సంవత్సరారంభంలోనే చెప్పాలి' అని హాస్యం చేస్తుంటారు మావారు" అని తేలికగా నవ్వేసింది రమ.

మనసులోని ఉలికిపాటును పైకి ప్రదర్శితం కాకుండా అణచ ప్రయత్నిస్తూ తానూ ఆ నవ్వుతో శ్రుతి కలిపింది సుభద్ర.

బయట కారు హారన్ విన్పించింది.

"ఆయన వచ్చారు. భోజనం పెట్టి పంపించి వస్తాను," అంటూ క్రిందికి పరుగెత్తింది రమ.

సుభద్ర ఉత్సుకతతో కిటికీ దగ్గఱకు వెళ్ళి చూచింది క్రిందకు.

కారు దిగుతూన్న భర్తను ఏదో అన్నది రమ చిరునవ్వుతో. అతడు విరగబడి నవ్వాడు.

తిరిగి రామారావు ఏదో చమత్కరించాడు.

రమ మరింతగా పకపక నవ్వింది. అతడింకో ఛలోక్తి విసురుతూ యింకా యింకా నవ్వాడు. ఇద్దరూ లోపలికి వెళ్ళిపోతూంటే కూతురూ, చిన్నకొడుకూ వారి దగ్గఱగా వెళ్ళారు. ఇద్దర్నీ ఎత్తుకు ముద్దాడేడు రామారావు.

"మరి నాన్నగారు భోజనం చెయ్యాలికదమ్మా. సాయంత్రం మీ కారు. ఊఁ?" లాలనగా అంటూ వాళ్ళను భర్తచేతుల్లోనుంచి తీసుకుని పనిపిల్లకు ఒప్పజెప్పింది. మళ్ళీ, "ఎండలో ఆడించకు, ఇద్దరూ పోట్లాడుకోకుండా చూడు!" అంటూ మరీ మరీ హెచ్చరించి భర్తవెంట లోపలికి వెళ్ళింది రమ.

'హాసహాస్యాలతో, చతుర ఛలోక్తులతో, బిడ్డాపాపలతో, సిరిసంపదలు వెల్లివిరిసిన గృహం; సుఖసంతోషాలు రాజ్యమేలుతూన్న సంసారం! అదృష్టవంతురాలు రమ!' అనుకుంటూ నిట్టూర్చింది సౌధోపరిభాగాన్నుంచి అంతా తిలకించుతూన్న సుభద్ర మనస్సు. 'రమ ధనవంతులయింట పుట్టి పెరిగినట్లుంది. ఇంతటి అదృష్టాన్నీ ఈడూ జోడూ అయిన భర్తతోపాటు వరించింది. కనీసావసరాలే తీర్చలేని బీద తలిదండ్రుల కడుపున బుట్టిన నాకు రెండోపెళ్ళి మొగుడూ, సవతి బిడ్డలూ తప్ప ఎలా ప్రాప్తమౌతారు?' అనికూడా రోదించిందామె అంతరంగం.

అరగంట తర్వాత పైకి వచ్చింది రమ. "రండి. ఆయన భోంచేసి ఆఫీసుకు వెళ్ళిపోయారు. మనం భోజనం చేద్దాం," అన్నది సుభద్ర.

పరధ్యానంగా గదినంతనూ పరికించుతూన్న సుభద్ర ఒక్కసారిగా వులికిపడింది, అప్పుడే రమ ఆగమనాన్ని గ్రహించి.

"ఆ ఫోటోలో రామారావుగారి ప్రక్కన... మీరు... మీరు కాదనుకుంటాను?" అనుమానం మరి దాచుకోలేక అడిగేసింది సుభద్ర సందేహిస్తూనే.

రమ కండ్లలో దైన్యం గోచరించింది. వదనంలో చిరునవ్వు అంతరించింది.

అసంఖ్యాకమైన భావవీచికలు ఆ వదనంపై కదులాడి అంతలో మాయ మయ్యాయి. తిరిగి ఆ ముఖబింబంలో ఎప్పటి ప్రశాంతత ప్రభవించింది.

"అవును. నేను కాదు. ఆమె వారి ముందు భార్య." అని చెప్పింది గాంభీర్య తను నింపుకొన్న సాధారణత్వంతో.

శ్రోత ఏమిటోగా అయిపోయింది. 'నేను సరిగానే విన్నానా? ఇదినిజమా?' అని ఆమె తననుతానే మౌనంగా ప్రశ్నించుకో సాగింది.

"రండి, భోజనం చేద్దాం." రమ మళ్ళీ ఆహ్వానించింది.

"నేను భోజనం చేసే వచ్చానండీ." సుభద్ర జవాబు.

"నిజమా?" నవ్వుతూ అడిగింది రమ. "వీరింట్లో అనవసరంగా భోజనం చెయ్యటం మేమిటని సిగ్గుపడ్తున్నారా ఏమిటి? మన కుటుంబాల మధ్య అటువంటి తేడాలులేవండీ. రండి." రమ మాటలలో ఎనలేని ఆప్యాయత తొణికిస లాడింది.

"లేదండీ. నిజంగానే చేసివచ్చాను." నచ్చచెప్పింది సుభద్ర.

"అయితే రండి, వంటింట్లోనే కూర్చుందురుగాని. నేను భోజనం చేస్తూంటే మీరు కబుర్లు చెప్దురుగాని. పాపం ఒక్కర్నీ కూర్చోబెట్టేశానుకదూ?" అంటూ సుభద్ర చేయిపట్టుకుని క్రిందికి నడిచింది రమ.

సరిగ్గా రమ పళ్ళెంలో అన్నీ వడ్డించుకుని భోజనం చేయటానికి కూర్చునే సరికి పిల్లలిద్దరూ వచ్చేశారు ఏడుస్తూ.

ఆ వెనుకనే పనిపిల్ల సీత వచ్చింది పిచ్చిముఖం పెట్టుకుని.

"అయ్యో! ఇద్దరూ ఏడుస్తున్నారేమిటి?" అంటూ ఆతురతతో భోజనం ముందునుంచి లేచిపోయింది రమ.

"ఏం ఇద్దరూ యింతగా ఏడుస్తున్నారు?" అంటూ గోపీని ఎత్తుకుని సీతను అడిగింది.

"అరుణమ్మగారే కొట్టారండి గోపీగార్ని. పైగా, బాబుగా రేడుస్తూంటే ఆరూ ఏడుస్తున్నారు" అన్నది సీత.

"తప్పు కాదమ్మా అరుణా? తమ్ముడిని కొట్టుకుంటారా? ఇంకెప్పుడూ కొట్ట కేం!" అరుణకు బుద్ధులుచెప్తూ, "వాళ్ళు కొట్టుకుంటూంటే నువ్వేం చేస్తున్నావే మరి? అస్తమానూ నేనే చూచుకుంటాను కదా? ఎప్పుడైనా ఓ పదినిముషాలు నీకు ఒప్పగిస్తే ఇదీ వరస," అంటూ సీతను మెత్త మెత్తగా మందలిస్తూ, "సరేలే నేను చూచుకుంటాలే వాళ్ళని. అదుగో ఆ గిన్నెలు తీసుకుని అన్నంపెట్టుకు తిను," అన్నది సీతను అది భోజనానికి కూర్చుంది. పాలుకలిపి, గోపీకి పట్టి నిద్రింపచేసి, తిరిగివచ్చి రమ భోజనంముందు కూర్చునేసరికి అరగంట దాటింది.

"నేను పోయి ఆడుకోను. నేనూ యిక్కడే కూర్చుంటాను," అంటూ పట్టు పట్టి అరుణ, రమ ఒళ్ళో ఎక్కి కూర్చుని, ప్లేటులు లాగుతూ గిన్నెలు సవరిస్తూ ఆఖరికి మంచినీళ్ళగ్లాసు టేబుల్ మీదా, అన్నం పళ్ళెంలోనూ, రమ చీరమీదా ఒంపేసి, ఇక తనపని అయిపోయినట్టుగా పారిపోయింది అక్కడినుంచి.

రమ నవ్వుకుంటూ చీర దులుపుకుని, నీళ్ళు వంచేసి ఆ అన్నమే గబగబా తిని లేచింది.

రమ సుభద్రతో కబుర్లు చెప్తూనే గిన్నెలు పళ్ళాలూ కడుక్కుని వంటిల్లు శుభ్రంచేసి ఎక్కడివక్కడ సర్దుకో సాగింది.

"వంటమనిషి లేడా?" అనడిగింది సుభద్ర.

"లేడండీ. వాళ్ళున్న సుఖమేమీ నాకు కన్పించదు ప్రొజనం వారికొకలాగ కావాలి, పెద్దబ్బాయి సురేష్‌కు మరోలాగ కావాలి. ఇక అరుణా గోపీ పసి వాళ్ళుకదా - ఎక్కువ కారం తినరు. వాళ్ళిద్దరికీ మరీ ప్రత్యేకంగా వండాలి. ఒక్కొక్కరి భోజనం టైము ఒక్కొక్కటి. వంటవాళ్ళు ఓపికగా అన్ని తరహాలుగా వండుతారా, వడ్డిస్తారా? ఏదో వాళ్ళ ఇష్టమైనట్టు, వాళ్ళకు చేతనైనట్టూ వండి పారేస్తారు. మనం వాళ్ళనేమీ అనకూడదు. పైగా విసుక్కుంటారుకూడ. ఈ అభం శుభం తెలియని పసిబిడ్డలను వాళ్ళ విసుగుదల కెందుకు గురిచెయ్యాలి చెప్పండి?... నేనే ఓర్పుగా వండి ప్రేమగా పెట్టుకుంటే నాకూ తృప్తి, వాళ్ళకీ ఆరోగ్యం."

"నిజమే." అనలేక అన్నది సుభద్ర.

వంటిల్లు, అలమారాలు సర్దుకున్నాక మళ్ళీ మధ్యాహ్నం టిఫిన్ ప్రయత్నంలో నిమగ్నమైంది రమ.

ఉప్మా చేయటానికి ఉల్లి, అల్లం, పచ్చిమెరపకాయలూ కోస్తూన్న రమను చూస్తూ "అసలు మీకు రెస్టే వుండదనుకుంటాను పాపం!" అన్నది సుభద్ర.

గంభీర హాసంతో అన్నది రమ: "రెస్టా? హుఁ. విశ్రాంతి ఒక్కసారేనండి మనలాంటివాళ్ళకి. 'నా ఇల్లూ నా వాళ్ళూ' అనే బాధ్యతలున్న స్త్రీకి శాశ్వత విశ్రాంతి ఒక్కటే విశ్రాంతి! చచ్చాకనే."

సుభద్ర నిరుత్తరురాలైంది.

మరలా తానే అన్నది రమ: "అయినా ఆ పనీ ఈపనీ అనుకుంటూ చేసుకుంటూ పోతే మనకీ టైము కన్పించకుండా గడచిపోతుంది. ప్రతిదానికీ ఓ పని మనిషిని పెట్టుకుని, ఆ పైన మనకి టైము గడవక ఆ వుద్యోగం చేద్దామా,

ఈ క్లబ్బులో చేరదామా, వీధులు తిరుగుదామా అనుకుంటూ కాలక్షేపం కావడం లేదని బాధపడ్డం నా కిష్టముండదండీ. అయినా మనుషులు తీరిగ్గా వుండకూడదట. ఎప్పుడూ ఏదో పనిలేక తీరిగ్గావుంటే వాళ్ళ బుఱ్ఱల్లోకి దయ్యాలు ప్రవేశించి, వెఱ్ఱి మొఱ్ఱి ఆలోచనలు తలెత్తుతాయట!"

సుభద్ర వింటూ వూరుకుంది.

ఉప్మా కలియబెట్టి కొంత ఒక ప్లేటులోకి తీసి, మిగిలినది మూతపెడుతూ, సుభద్ర వేపుచూచి అన్నది రమ: "మీరు వుండీ వుండీ ఒక్కోమాట మాత్రం మాట్లాడుతారు. నేనేమో అదేపనిగా మాట్లాడుతానుకదూ?"

"అహాఁ. కాదు. నేను ఏమిటో అంతగా మాట్లాడలేను," అంది కొంచం సిగ్గుపడుతూ సుభద్ర.

ఉప్మాప్లేటు సుభద్ర ముందు పెడ్తూ, "తీసుకోండి" అన్నది రమ.

తన ఆలోచనలలో తాను మునిగివున్న సుభద్ర ప్లేటు అందుకోలేదు. "వీళ్ళు ముగ్గురూ మీ పిల్లలేనా లేక రామారావుగారి ముందుభార్య..." అంటూ అసం పూర్ణంగా వదిలేసింది తన ప్రశ్నను.

క్షణకాలం చకితురాలైంది రమ. మాట్లాడకుండా ప్లేటు సుభద్రముందు వుంచేసి, అల్మైరాలోని పళ్ళుతీసి ముక్కలు కోస్తూ కూర్చుంది.

సుభద్ర విస్తుపోయింది. "నేను అలా అడిగితే మీకు కోపం వచ్చిందా?" అన్నది బెదురుగా, మందస్వరాన.

"లేదు." తల అడ్డంగా వూపింది రమ. పండ్లముక్కలుంచిన ప్లేటుకూడా తెచ్చి సుభద్రముందు వుంచింది. ఆమె ఏమో చెప్పేలోపుగా ఆటల్లో అలసిపోయిన అరుణ వచ్చి ఎత్తుకోమన్నట్లు చేతులు చూపింది.

అరుణను ఎత్తుకుని భుజంమీద పడుకోబెట్టుకుంది రమ. "కాస్సేపు నిద్రపో అమ్మా. మళ్ళీ ఎండ తగ్గాక సాయంత్రం ఆడుకొందువుగాని" అంటూ మెల్లగా అటు యిటు పచార్లుచేస్తూ జోకొట్టసాగింది అరుణను. పది నిముషాలకే నిద్రలో ఒరిగిపోయింది అరుణ. అరుణను పడుకోబెట్టి వచ్చి సుభద్రకు సమీపంగా మరో కుర్చీలో కూర్చుంది రమ.

"చూడండీ" సుభద్రను ఉద్దేశించి అన్నది. "మీ రడిగినందుకు నా కేం కోపం లేదు కాని...ఇంతగా శ్రమపడి నేను ప్రేమగా పెంచుతూన్న పిల్లలు నా పిల్లలు కాదనిచెప్పడానికి-కనీసం మనసులోనైనా ఈ భావన మెదలడం నాకు కష్టమనిపిస్తుంది, ఎంతో బాధగా వుంటుంది."

అదిరిపడింది సుభద్ర. "అయితే...అయితే ఈ..." అర్ధోక్తిలోనే ఆగిపోయింది.

"అవును. ఆయన ముందుభార్య పిల్లలే వాళ్ళు ముగ్గురుకూడ!"

సుభద్ర స్థాణువైపోయింది. చాలాసేపటికి తిరిగి మాట్లాడగలిగింది. "అయితే ఆ ఫోటో ఆవిడ న్నమాట!"

"ఏది?" పరధ్యానంగా వున్న రమ ప్రశ్న.

"పూజ గదిలో దేవుడిదగ్గర."

"అవును, ఆమెగారిదే."

సుభద్ర కనుపాపలు ఆశ్చర్యంతో విచిత్రంగా కదులాడాయి. భావకందని భావాలెన్నో ఆమె వదనం మీదుగా దూసుకుపోయాయి. విపరీత భావాను భూతిలో మనస్సు భారమైపోగా, తింటూన్న ఉప్మాప్లేటు వదిలేసి చెయ్యి కడిగేసుకుంది.

"అదేమిటది?" ఆశ్చర్యపోయింది రమ. "తినకుండా అలా వదిలేశారేమిటి? అలాగైపోయారేమిటి హఠాత్తుగా? ఒంట్లో బాగుండలేదా?" ఆత్రంగా అడిగింది.

"ఏం లేదండీ బాగానేవుంది," అంటూ రమకు చాలా దగ్గరగావచ్చి కూర్చుంది సుభద్ర. రమను ఎన్నెన్నో అడగాలనుకుంటూనే, అడగకూడదని సభ్యత హెచ్చరించగా మౌనం దాల్చింది సుభద్ర. కాని ఎంతోసేపు అలా మౌనంగా వుండలేకపోయింది. మనస్సులోని జిజ్ఞాసాతురత కడకు సభ్యతను గెలిచింది.

"అయితే, పైపైకి చాలా నెమ్మదస్తులుగా కన్పిస్తారు కాని, రామారావు గారు...అంత కర్కోటకులన్నమాట?" అని అడిగేసింది.

తన భర్తపై ఆమె చేసిన విపరీత వ్యాఖ్యానం వింటూనే విస్మయచకితురాలైంది రమ. "అదేమిటి? ఎందుకలా అనుకున్నారు మీరు? నిజంగా ఆయన చాలా ఉత్తములు; ఉదారహృదయులు," అన్నది రమ.

ఈసారి అచ్చెరువుపొందటం సుభద్ర వంతైంది. కొన్ని లిప్తలకాలం రమను ఒక వెఱ్ఱిదానినీ, అమాయకురాలినీ చూచినట్లు చూచింది. ఆ తర్వాత రమ మాటలను అతితేలికగా తీసి పారేస్తూన్నట్లుగా అన్నది. "ఆఁ, ఏదో అలాగే అంటారు లెండి, యధార్థం చెప్పి భర్తను దూషించలేక. ముగ్గురు పిల్లలతో రెండోపెళ్ళి చేసుకుని అన్యాయం చేసింది చాలక, యింకా ఆ చచ్చినవాళ్ళను దేవుణ్ణి పూజించినట్లు పూజించమనడం కంటే ఘోరపాపమేముంటుంది?"

దెబ్బతిన్నట్లు చూచాయి రమ కళ్ళు. సుభద్ర యొక్క వాచాలతలో అంతర్లీన మైవున్న ఉక్రోషమంతా ఆమె స్వీయజీవితంపట్ల గల అసంతృప్తి ఫలితమేగాని తనపై మాత్రం సానుభూతి ఎంత మాత్రం కాదని గ్రహించగలిగింది తెలివైన రమ. సుభద్ర అంతరంగ కల్లోలాన్నంతనూ తుణ్ణంగా పసిగట్టేసింది, రమ స్త్రీ హృదయం. 'విద్యా సంస్కారహీనయైన సుభద్ర నే నేమైనా హితవు చెప్తే మాత్రం అర్థం జేసుకోగలదా?' అని శంకించింది లోకజ్ఞానమెరిగిన ఆమె. అంత రంగాన చెలరేగుతూన్న భావకల్లోలాన్నీ, తీవ్ర సంఘర్షణనూ ప్రయత్నపూర్వ కంగా సంబాళించుకుంటూ కొంత తడవు మౌనంగా వుండిపోయింది.

"చూడండి సుభద్రా. నా వ్యక్తిగత జీవితంలోని విశేషాలూ, వివరాలూ ఎవరికీ తెలియనీయడం నాకు యిష్టముండదు. కాని, యింతగా గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతూన్న మీకు ఎందుకో అన్నీ చెప్పాలనీ, చెప్పటం మంచిదనీ నాకు అన్పిస్తూంది...రామారావుగారికి ధర్మపత్నిని కావడం నిజంగా నా పూర్వజన్మ సుకృతఫలమనే నే నెప్పుడూ సంతోషిస్తూంటాను. భవిష్యత్తులోకూడ నా యీ అభిప్రాయం వమ్ముకాదనే నా నమ్మిక. రామారావుగారు నన్ను రెండోపెళ్ళి చేసుకోలేదు; నేనే ఆయనను మనసారా కోరి వరించి నా జన్మకొక అర్థం, నా జీవితానికొక సార్థకతా, నా మనుగడకు ఒక అండా ఏర్పరచుకున్నాను!"

"నిజంగా?" సుభద్ర ఆశ్చర్యపూర్వక ప్రశ్న.

"హుఁ. నిజమే!" నిర్లిప్తంగా నవ్వింది రమ. "వివాహానికి ముందూ, తర్వాతా నా జీవితానుభవాలను క్లుప్తంగా తెల్సుకోండి..."

*　　*　　*

తొమ్మిది మంది సంతానం గలిగిన మధ్యతరగతి కుటుంబీకుడైన రమ తండ్రికి పిల్లలకు మంచి చదువులు చెప్పించగల తాహతూలేదు; వాళ్ళ భవిష్యత్తును గురించిన యోచనాలేదు. రోజూ భుక్తిగడపడం కోసమే సరిపోయేది తాపత్రయ మంతా. కుటుంబనియంత్రణా పద్ధతు లంతగా అమలులోనికి రాని ఆ రోజులలో ఎదుగూ బొదుగూలేని రాబడితో నిమిత్తం లేకుండా ఆ ఏటి కా ఏడు ఎదిగిన సంసారం అది.

పెద్ద కూతురిని తనకంటె బీదవాడికి రోజు గడవటానికే కనా కష్టంగా వున్న వాడికిచ్చి చేతులు దులుపుకున్నాడు పురుషోత్తం. రెండోదాన్ని ఒక రోగిష్టి ముసలివాడు వెయ్యి రూపాయలకు కొనుక్కుని వివాహం చేసుకున్నాడు-దాసీలు నర్సులకంటే కట్టుకున్నదైతే కాళ్ళదగ్గర కుక్కలా పడివుండి సేవ జేస్తుందనే ఆశతో. మగవాళ్ళు ఏవో వానాకాలపు చదువులు చదువుతున్నారు.

తల తాకట్టుపెట్టి అయినా వంశోద్ధారకులకు చదువు చెప్పించుకోవాలి; తల మాసిన వాడికైనా సరే కట్టబెట్టి ఆడదాన్ని వదిలించేసుకోవాలనే సిద్ధాంతాన్ని జీర్ణించుకున్న వాళ్ళు పురుషోత్తం సంపతులు. అందుకే మూడో ఆడపిల్ల అయిన రమనుకూడా ఏ మూడుకాళ్ళ ముసలివాడో ఉద్ధరించి తమ కింత ముట్టజెప్ప గలడనే ఆశతో ఎదురుచూడసాగారు

ప్రభుత్వ ప్రణాళికల ధర్మమా అని ఆడపిల్లలకు స్కూల్ ఫైనల్ వరకూ ఉచిత విద్య లభించడం ప్రారంభమైంది. ఆ విధంగా రమ కొంత అదృష్టవంతురాలైంది.

“చదువైతే వూరికే చెప్తున్నారు కాని పుస్తకాలు పెన్సిళ్ళు ఇస్తున్నారా? కూలిస్తున్నారా? ఆడదానికి కూడా చదువులెక్కడ చెప్పించడం? వెధవ రోజులు బొత్తిగా మారిపోయాయి. స్కూళ్ళూ కాలేజీలూ అని ఆడదికూడా ఎగిరెగిరి పడ్తోంది ఛీ,” అని విసిగించుకోని రోజు వుండేదికాదు రమ తల్లి.

“ఓ రమా ఎక్కడ చచ్చావే? కాస్త ఈ పని సాయం చేయవే. అక్కడ పసిపిల్లా డేడుస్తూంటే నీ చెవులు విప్పించడం లేదటే పాటిమొద్దూ, నీ చదువు తగలెయ్యా! నీ బాబేమైనా లక్షాధికారి కటే నిన్ను కుర్చీలో కూచోబెట్టి మేపటానికి?” అంటూ రోజు కొక్కసారైనా శివసత్తిలా తాండవమాడ్తూ పురాణం చదివేది.

అయినా చదువుమీద శ్రద్ధా, భవిష్యత్తుపై ఆశాగల రమ అన్నిటినీ సహించి, ఇంటి పనంతా చేసి ఆ తర్వాతనే చదువుకొనేది, ఏ అర్ధరాత్రో.

“అర్ధరాత్రిళ్ళూ అపరాత్రిళ్ళూ దీపం వేసి వెలగబెట్టక్కర్లేదులే యింతోటి చదువూ. ఆ ఏడ్చేదేదో పగలే ఏడువు,” అంటూ తండ్రి కోప్పడేవాడు రమను.

ఇటువంటి యమకూపంలో బ్రతికి అన్నింటికీ ఓర్చి ఎలాగో స్కూలు చదువు గట్టెక్కిన రమకు ఆ పైన చదువు వేరెత్తగల అర్హతలేదు. ఇంటి పనంతా అయిన తర్వాత తీరికగావున్న ఏ మధ్యాహ్నపు వేళల్లోనో దయనీయురాలైన ఒక స్నేహితురాలి యింటికి వెళ్ళి, ఆమె దగ్గర ఉచితంగా టైపు నేర్చుకుంది. ఎవరెన్ని అన్నా ఆమె ధ్యేయం ఒక్కటే – తన భవిష్యత్తు బాగుండాలి; అర్థవంతంగా సంతృప్తిమయంగా వుండాలి. అంతేకాని చాలీచాలని బ్రతుకుతో రాక్షసిలా తయారైన తల్లిలాగా, ముసలి రోగిష్టి భర్తతో చావలేక బ్రతుకుతూన్న అక్కలలాగా తాను బ్రతకలేదు, బ్రతకదు.

టైపు నేర్పిన స్నేహితురాలి దయవల్లనే ఒక ఆఫీసులో టైపిస్టు ఉద్యోగం సంపాదించుకున్న రమ ఉద్యోగంలో ప్రవేశించడానికి వెళ్తూన్న మొదటి రోజున యింటికేదో ఘోరమైన కళంకమో, విపత్తో సంభవించినట్లుగా తిట్లతో శోకాలు సాగించింది తల్లి. రమకంటే పెద్దవాడై యుండీ యింకా స్కూల్ ఫైనల్‌తో




కు స్త్రీపడ్తూన్న అన్న ధుమధుమలు ప్రారంభించాడు. "ఇక ఈ యింట్లో మగ వాడు వీధిలో తలెత్తుకు తిరగక్కర్లేదు. ఆడది సంపాదనకు బయలుదేరే రోజు దాపరించింది," అని బాధపడ్తూ.

రమ జంకలేదు. "ఈ యింటి ఆడపిల్లలను ముసలివాడికి కట్టబెట్టిననాడూ, రోగిష్టివాడికి అమ్ముకున్ననాడే ఈ యింటి మగదతుత పరిహాసపాత్రమై పోయింది పదుగురిలో. అటువంటి యింట్లో ఆడపిల్ల లక్షణంగా ఉద్యోగం చేసుకుని తన బ్రతుకు తాను బ్రతికి ఒకరికి బరువుకాకుండావుంటే యింటిగౌరవం పెరగవచ్చు కాని తరుగుతుందనే భయమక్కరలేదు!" అన్నది నిర్భయంగా.

"చదువుకున్న ఆడదానితోటీ, మాటలు నేర్చిన కుక్కతోటీ మాట్లాడగలమా?" అన్నది తల్లి ముక్కుచీదుతూ.

తండ్రి ఎటూ మాట్లాడలేదు.

రమ వుద్యోగంలో ప్రవేశించింది. క్రమంగా వుద్యోగం ఖాయమై, జీతం ఎక్కువవ్వడంకూడా జరిగింది. అయితే విశేషమేమంటే— ఏ నెలాకూడా ఆమె సంపాదన రెండు వందలలోనూ ఒక్కరూపాయైనా మిగిలేదికాదు.

"రమా, స్కూలు జీతం కట్టాలి యియ్యి," అంటూ అన్నదమ్ములూ, "ఇంట్లో బియ్యం నిండుకున్నాయి, ఆఫీసునుంచి వచ్చేటప్పుడు తీసుకురా. పప్పులూ వగైరా నిండుకున్నాయి; ఓ పాతిక రూపాయలియ్యి," అంటూ తల్లీ,

"అమ్మాయ్ పిల్లలకీ నాకూకూడ బట్టలు చినిగిపోయాయి. కొత్తవి కుట్టించుకోవాలి. నువ్వు సొంత ఖర్చు లేంచేయకుండా ఈ నెలజీతం పూర్తిగా నాకిచ్చెయ్" అంటూ పురుషోత్తం – అందరూకూడా ఏదో ఓ కారణంతో ప్రతినెల రాబడీ 'మిగులు' అంటూ లేకుండా ఊదేసేవారు.

'ఆడదాని సంపాదన, ఆడదాని చదువు' అంటూ ఒకనాడు చేసిన నిందలూ, ప్రదర్శించిన అభిజాత్యమూ రానురాను ఆ యింట మచ్చుకయినా విన్పించకుండా, కన్పించకుండా పోయాయి. అందరూ హాయిగా కడుపునిండా తింటున్నారు; వంటినిండా కడుతున్నారు. అందుకే పురుషోత్తం దంపతులు రమకు పెళ్ళిచేయాలనే మాట మరచిపోయారు.

ప్రతిరోజూ బయటకుపోయి, నలుగురిమధ్య ఉద్యోగంచేసి బ్రతికే స్త్రీకికూడా కొన్ని అవసరా లుంటాయి. సరయిన దుస్తులుండాలి. ఇంటికీ, ఆఫీసుకూ దారి ఖర్చులుండాలి. ఇష్టమైనా, కష్టమైనా అప్పుడప్పుడు స్నేహితులకు కొంచం ఖర్చు పెడ్తూండాలి. కాని అదే ఆ యింటిలో అందరికీ కంటగింపుగా వుండేది.

"అవును. అది సంపాదించుకొంటోంది. మహారాణి! దాని యిష్టంవచ్చినట్టు ఖర్చు పెట్టుకుంటుంది. అడగటానికి మన మెవరం?" "సిల్కు చీరలూ కడుతుంది, హోటళ్ళకూ వెళ్తుంది. మగరాయుడిలా ఉద్యోగం చేస్తోందికదూ ఉద్యోగం!" తల్లీ, వదినా, అన్నదమ్ములూ అందరినుండీ తరచు వినవచ్చే ఇటువంటి వాక్బాణాలతో రమ మనస్సు కొంతకాలం అవ్యక్తబాధ ననుభవించింది. అటుపైన కర్తవ్యంకోసం యోచించసాగింది

అటువంటి స్థితిలో ఒకనాడు ఆఫీసులో...

మానేజర్ రామారావు పిలుస్తున్నాడని ప్యూన్ చెప్పగా వెంటనే వెళ్ళింది రమ.

"చూడు రమా. ఈ కాగితాలు రేపు మెయిల్‌కే తప్పకుండా పంపేయాల్సి వుంది. అంచేత యివాళ వీటి కాపీలు నువు పూర్తిగా టైప్‌చేసి నా కివ్వాలి."

"అలాగేనండి" అని అన్నదేకాని రమకు గుండె ఆగినంత పనయింది. ఎంత వేగంగా టైప్ చేసినా ఆనాడు పూర్తవ్వగలిగేటట్లు కన్పించలేదు అతడిచ్చిన ఫైలు పరిమాణం. మధ్యాహ్నం అందరితోబాటు భోజనానికి తాను లేవకుండా, అలాగే సీటుకు అంటుకుపోయి తలెత్తకుండా వేగంగా టైపుచేయసాగింది రమ. సాయంత్రం నాలుగయ్యేసరికి ఆమె గుండెలో రైళ్ళు పరుగెత్తసాగాయి. మామూలుగా అయిపవ్వగానే రోజులాగే పని కట్టిపెట్టి లేచిపోయి మానేజర్ గదిలోకి వెళ్ళింది.

"ఎవరూ రమా? అయిపోయిందా ఆ ఫైలు పని?" తలెత్తకుండానే అడిగాడు కాగితాలు చూచుకుంటున్న రామారావు.

భయపడ్తూన్న రమ ఏమీ చెప్పలేకపోయింది.

తలెత్తి చూచి విస్మయంగా అడిగాడు రామారావు: "పూర్తి కాలేదా? ఎంతవరకూ అయ్యింది?"

అతడి కంఠంలో ప్రశాంతతను గమనించిన రమ కాస్త ధైర్యం చిక్కబట్టుకుని సమాధానం చెప్పింది. "లేదండి. ఎంత వేగంగా చేసినా పూర్తి కాలేదండి."

"ఎంత మిగిలిపోయింది?"

"ఇంకా కనీసం రెండుమూడు గంటల పని మిగిలిపోయిందండి."

"కావలిస్తే కాఫీ టిఫిన్ తెప్పించుకుని, ఆ పనికూడా చేసేసి వెళ్ళు రమా. రేపే వెళ్ళిపోవాలని చెప్పానుకదా ఆ కాగితాలు?" అభ్యర్థనగానే చెప్పినట్లుంది కాని అతడి స్వరంలో ఆజ్ఞ విన్పించలేదు.

అయినా రమ అంగీకరించలేకపోయింది. తల వాల్చుకు నిల్చున్న రమను అయోమయంగా చూచాడు రామారావు. రెండు నిముషాలకు తలెత్తి అన్నది రమ భయపడ్తూ. "రేపు వుదయం ఏడుగంటలకే వచ్చి చేసేస్తే... మెయిల్‌కు అందించవచ్చు కదాండి?"

"అదెలాగ? నువ్వు టైపుచేసిన తర్వాత ఆ పైన యింకా నేను చూడవలసింది, సంతకాలూ వగయిరాలు వుంటాయికదా? అయినా ఆఫీసు తొమ్మిదిన్నరకుకాని తెరువరుకదా?"

"కాని...కాని... నేను సాయంత్రం ఆరయ్యేసరికి యింటికి వెళ్ళిపోవాలండీ, లేకుంటే..." ఆ పైన పూరించలేకపోయింది.

"ఊఁ, లేకుంటే?" తిరిగి ప్రశ్నించిన రామారావు మరి తన మాటలను పొడిగించలేకపోయాడు. నిస్సహాయతను వ్యక్తీకరిస్తూ దీనంగా ప్రార్థిస్తూన్నట్లున్న ఆమె నేత్రద్వయంనిండా బలవంతంగా అదిమి పెట్టబడుతూన్న కన్నీరు!

"సరేలే, వెళ్ళిపో," అన్నాడు.

రమ వెంటనే వెళ్ళలేదు. కొన్ని క్షణాలు ఆగి, తనను తాను సంబాళించుకుని అన్నది: "క్షమించండి. రేపు తప్పకుండా పూర్తిచేస్తాను." స్వరంలో ఆందోళననూ, దుఃఖపు జీరనూ మరుగుపరచలేకపోయింది.

రామారావు నేత్రాలు సానుభూతిని వర్షించాయి. అనునయస్వరంతో అన్నాడు: "ఫర్వాలేదులే బాధపడకు రమా. ఉద్యోగం చేసే ఆడపిల్లల కష్టాలు నాకు తెలుసు!"

రమ కనులనిండా కృతజ్ఞత పొంగిపొర్లింది.

ఆ రాత్రి ప్రొద్దుపోయేవరకూ రామారావు ఆఫీసులో తానే కూర్చుని

ఆ కాగితాల పని పూర్తి చేసేశాడని మర్నాడు తెల్సుకున్న రమకు అతడిపట్ల గౌరవం మరింత పెరిగింది.

ఆ విధంగా అయిన పరిచయం కొంత దృఢపడి స్నేహంగా పరిణతిపొంది ఒకరి విషయాలు ఒకరు తెల్సుకొనేవరకూ వచ్చారు

ఒకనాడు బీచ్‌లో పిల్లల్ని ఆడించుతూ కూర్చున్న రామారావు చెంతకు వచ్చి కూర్చున్నది రమ

"ఓ రమా ! రా" అంటూ సంతోషంగా పలుకరించాడు రామారావు.

"నమస్తే ఆంటీజీ," అంటూ పిల్లలుకూడా గౌరవించారు, అంతకుముందు రెండుమూడుసార్లు చూచివున్నందున

"ఎప్పుడూ వీళ్ళ అమ్మగారు రారేమండీ బయటికి ? పాపం ఇంటిపనులు తీరవనుకుంటాను ?" అన్నది రమ

రామారావు వదనం విషాద మేఘాచ్ఛన్నమైంది నిట్టూర్చుతూ చెప్పలేక చెప్పాడు "వీళ్ళ అమ్మ మమ్మల్ని ఈ లోకాన్నీ వదలి ఏడాది కావస్తున్నది దురదృష్టవంతులం"

తెలియక అడిగిన రమ చాలా బాధపడింది.

ఆ తర్వాత స్నేహం మరింత పటిష్ఠమైంది ఇరువురి మధ్యనా. ఒకరి కష్ట సుఖాలు ఒకరు ఆప్తమిత్రులవలె తెల్సుకొని సలహా సహాయ సానుభూతుల నంద జేసుకొనేవారు.

ఆఫీసులో గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఇంటిదగ్గర రమకు చీవాట్లూ, హెచ్చరింపులూ, ఎత్తిపొడుపులూ ఆనాటికానాడు అధికం కాసాగాయి. ఐనా దృఢచిత్తురాలైన రమ చలించలేదు

తదుపరి ఒకనాడు ఆఫీసులో ఏవో కాగితాలపై సంతకం పెట్టమని అడగ టానికి వెళ్ళిన రమ, రామారావు స్థితిని చూచి నిర్విణ్ణురాలై వెనుకకు తిరిగింది వెళ్ళిపోయే ఉద్దేశ్యంతో పరిసరాలుకూడ మరచి కన్నీరు కార్చుతున్నాడు రామారావు ఏకాంతంగా కూర్చుని. అంతలో అలికిడి విన్న అతడు చటుక్కున కన్నీళ్ళు తుడుచుకుని మామూలుగా అయిపోయాడు "రమా, ఏం కావాలి. వెళ్ళిపోతున్నావేం ?" అంటూ అతి సాధారణంగా పలుకరించాడు

రమకూడా తానేమీ గమనించనట్లుగానే కాగితాలపై సంతకం పెట్టించుకుని అవసరమైన ఆఫీసు సంగతులు మాట్లాడి వెళ్ళిపోతూ, "సాయంత్రం బీచికి వస్తారు కదూ ?" అనడిగింది

అడగటమైతే అడిగింది కాని, 'తప్పక రమ్మ'ని చెప్పినట్లు వున్నది ఆ అడిగిన తీరు. "వస్తాను" అన్నాడు రామారావు (సశేషం)




బారయియీ నదీతీరంలోని చండీఘడ గ్రామంలోగల చండీ దేవాలయం అతి పురాతనమైనది. ఆ ప్రాంతాన్ని పూర్వం పాలించిన రాజా వీరబాహు వంశంలోని ఒకరు యుద్ధంలో గొప్పవిజయాన్ని సాధించి, కృతజ్ఞతా సూచకంగా చండీదేవికి ఒక దేవాలయం కట్టించాడు. తరవాత క్రమక్రమంగా ఆ దేవాలయంచుట్టూ ఒక గ్రామం ఏర్పడి, చండీఘడం అని పిలువబడ సాగింది.

ప్రథమంలో దేవాలయానికి సుదూర ప్రాంతాల్లోవున్న భూములన్నీ చండీదేవి

4

ఆస్తి పాస్తులుగా వుండేవి. కాని, కాలం గడుస్తున్నకొద్దీ అభూముల్లో ఎక్కువభాగాన్ని చిన్నా పెద్ద బలవంతులు, వాళ్ళ శక్త్యనుసారం ఆక్రమించుకుని, సొంతంచేసుకున్నారు ఇందువల్ల చండీదేవికి అపకారంగాని, ఉపకారంగాని జరిగిన సూచనలు లేకపోయినా, ఆవిడ నిజమైన భక్తులకు మాత్రం మనోక్షోభ కలిగింది

చండీఘడం ఒక తీర్థంగా కాకుండా, గ్రామంగా స్థిరపడిన తరవాత, ఆ గ్రామం బీజపుర జమీందారుల చేతుల్లోకి పోయింది. ఆ జమీందారీ వంశం రైతుపీడనకూ, క్రూరత్వానికీ పేరుమోసినది ప్రస్తుతం జమీందారుగావున్నతను, సంతులేకుండా చనిపోయాడు కొత్త జమీందారుగా ఆయన చెల్లెలి కొడుకైన జీవానందచౌధురి అధికారం స్వీకరించాడు ఇతని అధ్వర్యంలో చిన్నా పెద్ద రైతుల బతుకులు మరింత కంటకప్రాయమై పోయాయి

జీవానందచౌధురి తన ఎస్టేటు పరిస్థితులెలా వున్నయ్యో చూసేందుకు బయలుదేరి చండీఘడ గ్రామం వచ్చాడు ఊరుమధ్య ఆయనకొక తహసీల్ కచేరీ భవనం వున్నా, చౌధురి అందులో దిగక, పూర్వ జమీందారు నదికి సమీపంలో కట్టించిన 'శాంతికుంజ'మనే బంగళాలో దిగాడు

ఆ శాంతికుంజం ఒకప్పుడు చాలా అందమైన బంగళా దానిచుట్టూ చక్కని పూలతోటలూ, పండ్లచెట్లూ వుండేవి. కాని, గత పదీ పన్నెండేళ్ళుగా దానికి సంరక్షకుడు లేక, పాడుబడిపోయి దాపులనున్న అడవిలో ఒకభాగమై పోయింది.

జీవానందచౌధురి సాయంసమయమప్పుడు పల్లకీలో ఊరుమధ్యగా పోతూ కచేరీ చావడిముందు దాన్ని ఆపించి, కచేరీలోవున్న గుమస్తా నందిబాబును పిలిపించి, "మే మిక్కడ శాంతికుంజంలో కొన్నాళ్ళపాటు వుండదలిచాం," అని చెప్పి వెళ్ళిపోయాడు

జమీందా రటు వెళ్ళగానే నందిబాబు ముఖం భయంతో నల్లబడిపోయింది. అతణ్ణి చాలాప్రశ్నలు బాధించాయి ఈ సంధ్యాసమయాన నౌకర్లెక్కడ దొరికేట్టు? దీపాలమాటేమిటి? జమీందారుగారికి అన్నపానాదుల సదుపాయం ఎలాకలిగించాలి?– ఈ చిక్కుప్రశ్నలతో నందిబాబు తల తిరిగిపోయింది కొత్త జమీందారును ఇంతవరకూ అతడేనాడూ చూడలేదుగాని, జనం చెప్పుకునే కథలు అనేకం విన్నాడు. వాటిల్లో జమీందారు దాతృత్వాన్ని గురించిన కథ ఒక్కటీలేదు అన్నీ అతడి ధనదాహాన్ని గురించీ, క్రౌర్యాన్ని గురించినవే!

నందిబాబు యిప్పుడేం చేయటమా అని కచ్చేరీ చావడి వసారాలో నిలబడి బుర్ర వేడెక్కేలా ఆలోచిస్తూండగా, కచేరీ బంట్రోతు వగర్చుతూ వచ్చి, "అయ్యగారు యిక్కడికి వచ్చిపోయారా ఏం?" అని అడిగాడు

"అవును," అన్నాడు నందిబాబు బంట్రోతు ముఖంకేసి చూస్తూ.

బంట్రోతు విశ్వంభరుడు వెలవెలపోతున్న నందిబాబు ముఖంకేసి పరీక్షగాచూసి, "అవును అని ఏమీ పట్టనట్టు నిలబడ్డారేం, బాబూ?" అని అడిగాడు.

నందిబాబు లోపల మండిపోతూ, "మరేం చేయమంటావ్? ముందు కబురులేదు, ఆయన ఆకాశంలోంచి జారిపడ్డట్టు హఠాత్తుగా వచ్చి పడ్డాడు ఆయన జమీందారైతే మాత్రం యేం, నా తల తీసేస్తాడా?" అన్నాడు

విశ్వంభరుడు తెలివైనఘటం. నందిబాబు మధ్యవయస్కుడైతే, అతడు వృద్ధాప్యంలో పడబోతున్నవాడు. అతడు తన సర్వీసులో చాలామంది జమీందార్లను చూశాడు వాళ్ళనెలా బుజ్జగించి, సంతృప్తిపరచి పంపాలో అతడికి బాగా తెలుసు

దిగాలుపడి చూస్తున్న నందిబాబును చేయి పట్టుకుని కచేరీ లోపలికి తీసుకుపోయి విశ్వంభరుడు కాస్త ధైర్యంచెప్పి, లోపలిగదిలో ఒకమూలనున్న బల్లమీది సారా సీసానూ, మాంసాన్నీ అతడికి చూపించి, వాటిని జమీందారు బసచేయబోయిన శాంతికుంజానికి పంపమన్నాడు.

కొంత సేపటికి నందిబాబు వంటసామగ్రినీ, సారాసీసానూ కొందరు మనుషులచేత పట్టించుకుని, విశ్వంభరుణ్ణి వెంటబెట్టుకుని శాంతికుంజాన్ని సమీపించేసరికి బాగా చీకటి పడిపోతున్నది బంగళాలో ఎక్కడా దీపపుకాంతి లేదు. కాని బంగళాముందు పల్లకీ మోసేవాళ్ళు చుట్టలు కాల్చుకునేందుకు వెలిగించిన ఎండుకర్రలు మాత్రం కణకణలాడుతున్నవి.

నౌకరుచేత కబురుచేసి నందిబాబు జమీందారున్న గదిలో ప్రవేశించాడు గదిలో ఒకమూల మైనపువత్తి ఒకటి వెలుగుతున్నది గది మధ్యగా బీజపుర జమీందారు జీవానందచౌధురి ఒక విరిగిన మంచంమీద కూర్చుని వున్నాడు మనిషి బలహీనంగా, అనారోగ్యంగా కనిపిస్తున్నాడు. ఆయన ముందున్న టేబిల్‌మీద సారాతో నిండివున్న గాజుగ్లాసూ, సారాసీసా వున్నవి నందిబాబు జమీందారుకు నమస్కరించి, చేతులు కట్టుకు నిలబడ్డాడు

"ఐతే, నంది అంటే నువ్వేనా? ఇక్కడి కచేరీ గుమాస్తావా?" అని అడిగాడు జమీందారు

నందిబాబు తడబడుతూ, "అవును, ప్రభూ!" అన్నాడు

"శిస్తు వసూలు పుస్తకాల్లో నిలవ డబ్బెంత వుంది?" అన్నాడు జమీందారు

"షుమారు అయిదువేలుంటుంది, ప్రభూ!" అన్నాడు నందిబాబు భయపడుతూ

"అయిదువేలేనా? సరే – ఏడెనిమిది రోజులపాటు నే నిక్కడే వుంటాను ఈ లోపల నాకు పదివేలు కావాలి," అన్నాడు జమీందారు తాపీగా

"చిత్తం, తమ ఆజ్ఞ."

"రేపు ఉదయం నేను కచేరీకి వస్తాను. ముందుగా నువ్వు రైతులందరికీ కబురు చేసి పిలిపించు," అన్నాడు జమీందారు.

నందిబాబు సంతోషంగా తలూపుతూ, "చిత్తం—ఈ రాత్రే నాలుగువైపులకూ మనుషుల్ని పంపి రైతులందర్నీ ఉదయానే హాజరు పరుస్తాను. ఈ రాత్రే కబురుచేయకపోతే, 'సమయానికి కబురందలేదు, అందువల్ల రాలేకపోయాం' అంటారు, వాళ్ళు," అన్నాడు.

జమీందారు జీవానందుడు తలూపి, సారాతో నిండివున్న గ్లాసు ఎత్తి ఒక్క గుటకలో తాగి, గ్లాసును టేబిలుమీద పెడుతూ, "నందీ! ఈ ఊళ్ళో విదేశీసారా అమ్మే దుకాణం లేదనుకుంటాను. అయినా ఫర్వాలేదులే, నా దగ్గరున్నది నేనిక్కడున్నంతకాలం సరిపోతుంది. కాని, మాంసం మటుకు ప్రతిరోజూ యిక్కడికి రావాలి, తెలిసిందా?" అన్నాడు.

"అదేమంత పెద్దసంగతి, ప్రభూ! చండీదేవి మహాప్రసాదం తమ ఆజ్ఞ ప్రకారం రోజూ యిక్కడికి వస్తుంది," అన్నాడు నందిబాబు.

జమీందార్లు ఆ జవాబుకు తృప్తిపడ్డట్టు తలూపి, నౌకరు తెచ్చియిచ్చిన కొత్త సారాబుడ్డిలోంచి సారాను గ్లాసులోకి స్వయంగా పోసుకుని తాగి, మూతి తుడుచుకుంటూ, "ఇంకోసంగతి, నందీ!" అన్నాడు.

"సెలవివ్వండి."

"నేను ఇంతవరకూ పెళ్ళి చేసుకోలేదు, ఇక చేసుకోనుకూడా," అంటూ జమీందారు నందిబాబు ముఖంలోకి గుచ్చి గుచ్చి చూశాడు.

నందికి ఆ మాటలేమీ అర్థంకాక మెదలకుండా వూరుకున్నాడు.

జమీందారు ఓ క్షణం ఆగి వికవికమంటూ నవ్వి, "పెళ్ళి చేసుకోకపోయినా, నేనేం భీష్మణ్ణికాను. నే చెప్పేది మీ కర్థ మవుతున్నదా?" అన్నాడు.

నందిబాబుకు అర్థమై, తలవంచుకున్నాడు.

"వాళ్ళూ వీళ్ళలా యిలాంటి విషయాలు నేను నౌకర్లతో చెప్పను," అని కాసేపాగి, "ఈ చుట్టుపక్కల పల్లెల్లోని రైతుల్లో పెద్ద దుర్మార్గు లెవరూ లేరుకదా?" అన్నాడు.

జీవానందచౌధురి ప్రశ్న నందిబాబు హృదయంలోని ఓ పాతగాయాన్ని కెలికింది. అతడు కోపాన్ని అణుచుకుని, ఎంతో ఉదాసీనంగా, "అలాంటివా ళ్ళెవరూ లేరనుకోండి... కాని, తారాదాస్ చక్రవర్తి అనే అతనొక డున్నాడు. అయినా అతగాడు ప్రభువుల రైతు కాడు," అన్నాడు.



"నాయనా జేబులో
ఇంకా పైసలున్నాయా?"
"లేవు!"
"ఇంటి దగ్గర పనేమయినా
వున్నదా?"
"లేదు!"
"అయితే ఆ పత్రిక చదువు
కష్టాలు కడుగుదువు."

"ఏం చేస్తూంటాడు?"

"చండీ దేవాలయపు మహంతి," అన్నాడు నందిబాబు.

జీవానందుడు ఏదో ఆలోచిస్తూ వూరుకున్నాడు. నందిబాబుకు కోపం తలకెక్కుతున్నది. తారాదాస్ చక్రవర్తికీ అతడికీ పనస కొయ్యపలకల దగ్గర మనస్పర్థలు వచ్చినై. తన ఇంటి కమ్మీలకు వాటి నడిగితే, తారాదాసు యివ్వననేశాడు. తరవాత కాళ్లావేళ్లాపడి, తన చేయి కిందుచేసుకుని నందిబాబు ఆ పలకలను తారాదాసునుంచి ధర్మం పుచ్చుకున్నట్టు తీసుకోవలసి వచ్చింది.

"ఏం చేయను, ప్రభూ! ఇక్కడ కొందరి దుశ్చర్యల గురించి ప్రభువులవారికి విన్నపాలు పంపితే, సరయిన ఆజ్ఞలు రావు. దివానుగా రసలు మా మొరే ఆలకించరు. అలా కాకపోతే, ఈ తారాదాస చక్రవర్తిని సరైన మార్గాన పెట్టేందుకు నాకెంతోకాలం పట్టేదా? అతడు మన రైతుల్నికూడా మనమీదికి ఏదో రోజున ఎదురు తిరిగేలా చేస్తాడు," అన్నాడు నందిబాబు.

జీవానందుడి కాసరికి కొంచెంగా మత్తెక్కుతున్నది. ఆ కారణంవల్ల ఎంతో తాపీగా, "అసలీ తారాదాసు ఎక్కణ్నించి వచ్చాడు?" అని అడిగాడు.

"ఈ తారాదాసుకు భైరవి అనే ఒక కూతురుంది. తండ్రిని చెడుమార్గాన పెడుతున్న దావిడే. ఆ పిల్లకు ఎక్కడెక్కడి దుర్మార్గులూ, వస్తాదులూ బానిస లనుకోండి," అన్నాడు నందిబాబు

తన ప్రశ్నకు నందిబాబు మరేదో సంబంధంలేని విషయాలు చెపుతున్నా డనేది జమీందారు బుర్రకు ఎక్కలేదు. మత్తు ముంచుకొస్తున్నది. అయినా వూరుకోక, "ఈ భైరవి వయసెంతో చెప్పావుకావు," అన్నాడు.

"షుమారు ఇరవై రెండు ఇరవై మూడేళ్ళ వయసుంటుంది. కోపంవస్తే కత్తులు తీసుకుని పోట్లాడేందుకు వస్తుంది. అంతా ఆమెను సాక్షాత్తూ చండీరూప మంటారు," అన్నాడు నందిబాబు.

జీవానందుడు ఉలిక్కిపడి సర్దుకు కూచుని, "ఏమన్నావ్? ఈ భైరవి పల్లెటూరి బ్రాహ్మణపిల్లేగా? మరి అంతమంది దుర్మార్గులూ, వస్తాదులూ ఆవిడకు బానిసలెలా అయారు?" అని అడిగాడు.

"ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీలేదు, ప్రభూ! భైరవనేది ఆ పిల్ల అసలుపేరు కాదు. చండీదేవి ప్రధాన సేవకురాలిని భైరవి అని పిలుస్తారు. ఈ భైరవి అసలు పేరు, షోడశి. ఈవిడకన్న ముందున్న భైరవి అసలుపేరు, మాతంగి. మగవాళ్ళు తనకు ప్రధాన సేవకులుగా వుండకూడదనేది చండీదేవి ఆజ్ఞ. పదిహేను పదహారు సంవత్సరాల క్రితం, ఈ మాతంగి భర్త చనిపోయాడనే కబురు తెలిసింది; వెంటనే మాతంగి భైరవీ పదవిని త్యజించి కాశీ వెళ్ళిపోయింది, తరవాత..."

"విధవ అయితే భైరవీపదవి వదులుకో వలసిందేనా?" అన్నాడు జీవానందుడు.

"అంతే, ప్రభూ! భైరవి అయిన పిల్ల పెళ్ళయిన మూడోరాత్రినుంచీ భర్తను అంటకూడదు. అందుకని ఎక్కణ్ణుంచో ఒక బీద పిల్లవాణ్ని పట్టుకొచ్చి, భైరవితో పెళ్ళిచేసి, మూడవనాడు యింత డబ్బూ అదీ యిచ్చి, ఏ దూరప్రాంతానికో పంపించేస్తారు. ఆ తరవాత భైరవీ పదవిలోవున్న పిల్ల భర్త నీడకూడా చూడకూడదు," అన్నాడు నందిబాబు.

"ఇది చాలా ఆశ్చర్యంగా వుందే!" అన్నాడు జీవానందుడు.

"అది తరతరాలుగా వస్తున్న ఆచారం, ప్రభూ: భైరవి భర్తను కన్నెత్తి చూడకూడదన్న నియమంవున్నా – గ్రామంలో భర్తలాంటి మగవాళ్ళకు కొరత వుండదనుకోండి. ఆ మాతంగి భైరవిని చూశాను, యిప్పుడు షోడశి భైరవిని చూస్తున్నాను. ఈ భైరవివుందే, ప్రభూ – తమమీద ఎదురు తిరగటానికీ, కోర్టుల్లో వ్యాజ్యం ఆడటానికీ జనాన్ని మహబాగా కూడగట్టుకోగలదు," అన్నాడు నందిబాబు.

"ఈ భైరవి తండ్రి తారాదాసు పొట్టిగా, ఎర్రగా వుంటాడుకదూ?" అని ప్రశ్నించాడు జీవానందుడు.

"కాదు, ప్రభూ. ఎర్రగావున్నా, చాలా పొడవాటి మనిషి!"

"ఒక రైతుమీద చనిపోయిన మా మామగారు వేసిన వ్యాజ్యంలో అబద్ధపు సాక్ష్యం చెప్పింది, యీ తారాదాసే కదూ?" అని అడిగాడు జీవానందుడు.

"ప్రభువుల దృష్టినుంచి ఎవరూ తప్పించుకోలేరు! ఆ తారాదాసే యీ తారాదాసు," అన్నాడు నందిబాబు.

"ఆ వ్యాజ్యంలో మాకు చాలాడబ్బు ఖర్చయింది. అతడికెంత పొలం వుంటుంది?"

"యాభై అరవై ఎకరాలకు తక్కువ వుండదు. ప్రభూ!"

"రేపు నువ్వే స్వయంగా వెళ్ళి ఎకరాకు పదిరూపాయలచొప్పున పన్ను చెల్లించాలని చెప్పు. నే నిక్కడ ఎనిమిది రోజులుంటాను," అన్నాడు జీవానందుడు.

"ఆ పొలమంతా చండీదేవి మాన్యం ప్రభూ!"

"ఈ పల్లెలో ఒక్క జానెడు భూమికూడా దేవతగ్గాని, దయ్యానిగ్గాని మాన్యంగా యిచ్చిందిలేదు. పన్ను చెల్లించకపోతే ఆస్తంతా జప్తు చేయిస్తాను," అన్నాడు జీవానందుడు కోపంగా.

నందిబాబుకు తారాదాసంటే భయంలేదుగాని, షోడశి అంటేమాత్రం మహాచెడ్డ బెదురు. అందువల్ల కాసేపు తటపటాయించి, "కాని, ప్రభువులు..."

అతడిమాట పూర్తి కాకుండానే, "కానీ గీనీ మాటలు నేనేమీ వినదలుచుకోలేదు. నాకు డబ్బు కావాలి. అయిదారువందల రూపాయలు వూరికే వదిలిపెట్టేవాణ్నికాదు నేను ఆ డబ్బు అతనిచ్చే తీరాలి. దస్తావేజు లేమైనావుంటే అవి తీసుకుని ఆఫీసులో హాజరుకమ్మని చెప్పు. సరే, చాలా పొద్దుపోయింది. నా మనుషుల తిండీ తిప్పల సంగతి చూడు. వాళ్లు తాటికల్లు తాగుతారేమో, ఎక్కడైనా సంపాదించి యివ్వు. ఇంటికి వెళ్లాక నీ విషయం ఆలోచిస్తాను," అన్నాడు జీవానందుడు.

"ప్రభువులే నాకు • తల్లీ తండ్రీకూడా! తమరే యీ దీనుణ్ని కాపాడాలి" అంటూ నందిబాబు, జమీందారుకు నమస్కరించి మెల్లిగా బయిటికి వెళ్ళిపోయాడు.

## 2

జమీందారు జీవానందచౌధురి చండీఘడంవచ్చి అయిదురోజులైంది. ఈ స్వల్ప కాలంలోనే అతడి అనాచారాలకూ, దుర్మార్గ వ్యసనులకూ పల్లె అంతా భీభత్సం కాసాగింది. అతడు బలవంతంగా రైతులవద్దనుంచి పన్నులు వసూలు చేయిస్తున్నాడు. చండీ ప్రసాదం రోజూ అతడికి చేరుతూనేవుంది. అతడివెంట వచ్చిన నౌకర్లు చెరువులోని చేపలనూ, తోటల్లోని పళ్ళనూ కొల్లగొడు తున్నారు.

జమీందారు పిలవనంపగా తారాదాసచక్రవర్తి శాంతికుంజానికి వెళ్లాడు. అక్కడ జమీందా రతణ్ని పన్నుకట్టవలసిందని బలవంతం చేశాడు. తారాదాసు అందుకు నిరాకరించాడు. జమీందారు ఎక్కడలేని కోపంతో తారాదాసును నాలుగ్గంటలసేపు ఎర్రని ఎండలో నిలబెట్టించాడు. అయినా అతడు పన్ను కట్టడానికి నిరాకరించి జమీందారును అతడి వంశమంతా నాశన మయ్యేట్టు శపించి మరీ ఇంటికి వెళ్లాడు.

తండ్రికి చేసిన యీ అవమానాన్ని గురించి షోడశి యితర్లచేత జమీందారును అడిగిద్దామనుకుందిగాని తారాదాసు యీ విషయాల్లో కూతురును ఎలాంటి జోక్యం కలిగించుకోవద్దని గట్టిగా మందలించాడు.

ఒకనాటి సంధ్యాసమయంవేళ షోడశి వంటపని చేస్తూండగా, మందిరపు పరిచారిక హడావిడిగా వచ్చి, "తాగుబోతు జమీందారు దేవికి పెట్టిన నైవేద్యం తినడట! ఎక్కణ్ణించో మేకను తెచ్చి, దాన్ని కోసి పూజారిని వండిపెట్టమంటున్నాడు," అని చెప్పింది.

పరిచారిక చెప్పింది వినగానే షోడశి వేగంగా మందిరంవైపుకు వెళ్ళింది. మందిర ద్వారానికి అడ్డంగా జమీందారు నౌకర్లు నలుగురైదుగురు నిలబడి వున్నారు. వాళ్ళు పల్లకీ మోసే బోయీలు. తాటికల్లు పూటుగా తాగివున్నారేమో కొంచెంగా తూలుతూ వున్నారు. వాళ్ళు షోడశిని చూస్తూనే, "ఆ వెధవ పండితుడు కొంపలో వున్నాడా? జమీందారుగారికి పన్ను చెల్లించకుండా దొంగలా ఎక్కడో తిరుగుతున్నాడు," అన్నారు.

ఈ తాగుబోతులు తన్నవమానిస్తారేమో అని భయపడిపోతూ షోడశి, చిన్న గొంతుతో, "నాన్నగారు ఇంట్లోలేరు," అన్నది.

"అలా అయితే జమీందారుగారి దగ్గరకు నువ్వే రా. మర్యాదగా రాకపోయావో, మెళ్లో పైపంచవేసి కట్టి మేమే లాక్కుపోతాం," అంటూ ఒక తాగుబోతు ఆమెను సమీపించాడు.

షోడశికి మనసులో భయం కలిగినా, దాన్నేమీ బయటికి కనబరచకుండా, "అనవసరంగా మాట్టాడకండి, నేనే వస్తాను. మీ జమీందారేంచేస్తాడో చూస్తాను," అంటూ బయలుదేరింది.

జమీందారు నౌకర్ల వెంట షోడశి శాంతికుంజం చేరేసరికి బాగా చీకటిపడిపోయింది. ఆమె లోపలికి వెళ్ళగానే, ఆ అలికిడికి తాగిన మైకంలోవున్న జీవానందచౌధురి మంచంమీద లేచికూచుంటూ, "ఎవరది?" అన్నాడు.

నౌకర్లలో ఒకడు బయిటినుంచే, "ప్రభూ! అతని కూతుర్ని పట్టుకొచ్చాం!" అన్నాడు.

"ఎవరిని? భైరవినా?" అంటూ షోడశి కేసిచూస్తూ, "నువ్వీనాడు నాకు డబ్బు చెల్లించాల్సివుంది, తెచ్చావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకి షోడశి ఉక్కిరిబిక్కిరైపోతూ, "మా దగ్గర డబ్బులేదు," అన్నది.

"మీ దగ్గర డబ్బులేకపోతే, ఈ రాత్రికి నువ్వు మా నౌకర్ల ఇంట్లో వుండిపోవాలి. – అంటే ఏవిఁటో తెలుసు మెందా?" అని అడిగాడు జీవానంద చౌధురి,



దర్వాజా కమ్మీలను గట్టిగా పట్టుకుని షోడశి నిలబడివుంది. ఆమె ఏమీ జవాబు చెప్పలేదు. జీవానందుడు దూరంనుంచే, ఆమె పాలిపోయిన ముఖంకేసి ఓ క్షణకాలం చూసి, ఆమె మూర్ఛపోకుండా నిలబడివుండేందుకు ప్రయత్నిస్తున్నదని గ్రహించాడు. వెంటనే అతను లాంత రొకటి తీసుకొని షోడశి దగ్గరకువచ్చి, ఆమె ముఖంమీద కాంతిపడేలా ఎత్తిపట్టుకుని, మూసుకుపోతున్న కమలాల్లాంటి ఆమె కళ్ళనూ, కట్టుకున్న ఎర్రంచు ధోవతినీ, విరబోసుకుని వున్న తలవెంట్రుకలనూ, పాలిపోయిన పెదవులనూ పరీక్షగా చూడసాగాడు.

ఒకటిరెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచినై. జీవానందుడు తిరిగివచ్చి లాంతరు కిందబెట్టి, మంచంమీద కూర్చుని, తనలోని పశుప్రవృత్తిని కొరడాతో కొట్టి ఉత్తేజపరుచుకుంటూ, "నీ పేరు షోడశేనా?" అని అడిగాడు.

షోడశి జవాబు చెప్పలేదు.

"నీ వయసెంత?" అన్నాడు జీవానందుడు కర్కశంగా.

షోడశి బొంగురుపోయిన గొంతుతో, "ఇరవైఒకటి," అన్నది.

"నేను అనుకున్నదికూడా అంతే! ఈ ఇరవై ఏళ్ళనుంచి భైరవిపదవిలో చండీదేవికి పూజారిణిగా వుంటూ చాలా డబ్బు సంపాదించివుంటావు. అటువంటప్పుడు నా డబ్బెందు కివ్వలేవు?" అన్నాడు జీవానందుడు.

"నా దగ్గర డబ్బులేదని తమతో ముందే విన్నవించుకున్నాను," అన్నది షోడశి.

ఆ కంఠస్వరంలోని మార్దవమూ, లాలిత్యమూ చూసి షోడశి నిజమే చెబుతున్నదని జమీందారు గుర్తించాడు. అతడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "డబ్బులేదా? అలా అయితే పదిమందీ చేసేపనే నువ్వూ ఎందుకు చేయకూడదు? ఆ స్తిపాస్తులు తనఖా పెట్టో, తెగనమ్మో నా డబ్బెందు కివ్వకూడదు?" అని అడిగాడు.

"సొంత భూములు వున్నవాళ్ళయితే ఆలా చేస్తూంటారు. చండీదేవి ఆస్తిని తనఖా పెట్టేందుకు నా కధికారం లేదు." అన్నది షోడశి.

ఆ జవాబుకు జీవానందుడు నవ్వి, "ఆ మాటకొస్తే ఆ డబ్బుతీసుకునే అధికారం నాకూ లేదు. అయినా అవసరంకొద్దీ తీసుకుంటున్నాను నువ్వు కొంచెం చదువుకున్నదానివిలా కనిపిస్తున్నావు. కనక, జమీందార్లు వసూలుచేసే డబ్బు విషయమై అనవసరంగా వాదం పెట్టుకోకు. డబ్బు యిచ్చెయ్యి." అన్నాడు.

"ఈ వసూలు చేయటం మీ జమీందార్ల హక్కంటారా?" అన్నది షోడశి.

"హక్కని నేనటంలేదు. పూర్వ జమీందార్లు ఎలాంటి దావాలూ, తగాదాలూ చేయకుండానే, గ్రామంతాలూకు పొలాలన్నిటినీ క్రమక్రమంగా ఆక్రమించుకున్నారు. నేను వాళ్ళలాంటివాణ్ణి కాను, హృదయంగలవాణ్ణి సరే, నువ్వింత రాత్రిపూట ఒంటరిగా ఇంటికి తిరిగిపోలేవు. ఎలాంటి మనుషులు నిన్నిక్కడికి తీసుకువచ్చారో, నీకు బాగా తెలిసినట్టులేదు." అన్నాడు జీవానందుడు

షోడశికి యీ సంభాషణతో కాస్త భయం తగ్గింది. ఆమె వినయంగా, "తమరు అనుజ్ఞ యిస్తే ఇంటికి వెళ్ళిపోతాను." అన్నది.

"ఇంత కటిక చీకట్లో ఒంటరిగానా?" అంటూ జీవానందుడు నవ్వి, "డబ్బు లేకపోతే యివ్వొద్దులే, షోడశీ బాకీ తీర్చటానికి అనేక రకాలైన వీళ్లూ అవీ..."

అతడు మాట పూర్తిచేయకుండానే షోడశి, "ఆ వీళ్ళూ అవీ మీ దగ్గరే వుంచుకోండి. నన్నుమాత్రం వెళ్ళనీయండి." అంటూ కదలబోయి ఎందుకో ఆగింది.

జీవానందుడికి మత్తుతో కళ్ళు మూసుకుపోతున్నవి. అతడు కొంచెంగా తడబడుతూ, "నువ్వు సారాయి తాగుతావా?" అన్నాడు.

"తాగను."

"ఒకళ్ళిద్దరు రౌడీలు నీ చెప్పుచేతల్లో వుంటారని విన్నాను నీకన్నముందు భైరవీ పదవిలోకి వచ్చిన పూజారిణులందరూ తాగేవారట. చండీమఠంలో యితర భైరవీ పూజారిణులు జీవితం నడుపుకున్న ధోరణిలోనే, నువ్వూ నడవటం మంచిది. ఈ రాత్రికి నువ్విక్కడుండితీరాలి!" అని గర్జించాడు జీవానందుడు.

ఆ మాట విని షోడశి భయకంపితురాలయింది. జీవానందుడు గొంతు సవరించుకుని, "నిన్నుగనక యింత సేపు సహించానుగాని, మరొకళ్ళనయితే ఎప్పుడో నా నౌకర్లకు ఉంపుడుగత్తెగా పంపివుండేవాణ్ని. నా మాట వినని వాళ్ళను చాలా మందిని లోగడ అలా పంపాను," అన్నాడు.

షోడశి ఏడుస్తూ, మెడకు పైటచెంగు చుట్టుకుని, చేతులు జోడించి, "చండీదేవి మందిరానికి సంబంధించిన నా హక్కులన్నీ తీసుకుని, నన్నిప్పుడే వదిలిపెట్టండి," అన్నది.

జీవానందుడు ఓ క్షణకాలం షోడశి ముఖంలోకి పరీక్షగా చూసి, "ఇలాంటి సమయాల్లో భర్తా, పిల్లలూ వున్న ఆడవాళ్ళు ఏడవటంలో అర్థంవుంది. కాని, నీ కటువంటి బాదరబందీ ఏంలేదుగదా! పైగా పదిహేనూ పదహారేళ్ళనుంచి నువ్వు నీ భర్తను చూడనైనా లేదు," అన్నాడు.

షోడశి మళ్ళీ చేతులు జోడించి ఏడుస్తూ, "భర్తగారు ఎటువంటివారో నాకు జ్ఞాపకంలేనిమాట నిజమే. ఇప్పటివరకూ నేను ఎటువంటి చెడ్డపనీ చేయలేదు. దయవుంచి నన్నొదిలిపెట్టండి," అని వేడుకున్నది.

జీవానందుడు పెద్దగొంతుతో, "మహావీర్!" అని నౌకరును పిలిచాడు.

షోడశి నిలువెల్లా కంపించిపోతూ, "మీరు నా ప్రాణమైనా తీయండిగాని..."

ఆమె మాట పూర్తికాకుండానే జీవానందుడు, "సరే, వాళ్ళింటిదగ్గరే యిటువంటి చేష్టలన్నీ చేసిచూడు. ఏమో, మహావీర్!" అని మళ్ళీ పిలిచాడు.

షోడశి వివశురాలై నేలమీద పడిపోయి పొర్లుతూ, "బతికుండగా నన్నిక్కణ్నుంచి ఎవరూ తీసుకుపోలేరు. నా కెంత అవమానం, అత్యాచారం జరగాల్సివుందో, అదంతా మీ ముందే జరగనీయండి. మీ రిప్పటివరకూ బ్రాహ్మణులే, పెద్దమనుషులే," అన్నది.

మహావీర్ ద్వారం దగ్గరకువచ్చి, "ప్రభూ!" అన్నాడు.

"దీన్ని యీ రాత్రంతా పక్కగదిలో బంధించు," అన్నాడు జీవానందుడు.

షోడశి తలబాదుకుంటూ, "నన్ను సర్వనాశనం చేయండి, ప్రభూ! ఉరితీయించండి. రేపే ముఖం ప్రజలకెలా చూపించను?" అన్నది.

"ఒకటిరెండు రోజులే కాస్త కొత్తగా వుంటుంది. తరవాత అంతా అలవాటైపోతుంది...ఇవాళ నాకు మామూలుకన్న కొంచెం జాస్తిగా గుండెనొప్పి వస్తున్నది. అట్టే గొడవ పెట్టకు," అన్నాడు జీవానందుడు.

మహావీర్, షోడశిని సమీపించేంతలో ఆమె లేచి నిలబడింది. జీవానందుడు

ఆమెను పేరుపెట్టి పిలిచి, "కొంచెం ఆగు. నువ్వు చదువుకున్నావా ?" అని అడిగాడు.

"ఆఁ, చదువుకున్నాను."

"అయితే ఒక పనిచేసివెళ్లు. ఆ మూలవున్న పెట్టెలో కొన్ని మందుసీసాలున్నై. ఆ సీసాలో ఒకదానిమీద మత్తు అని రాసివుంటుంది. అది భయంకరమైన విషం. అది నాకు కొంచెం యిచ్చివెళ్లు," అన్నాడు జీవానందుడు.

షోడశి పెట్టెలోంచి ఆ సీసాతీసి, "ఎంత పోసివ్వమంటారు ?" అన్నది.

జీవానందుడు గుండెలు పట్టుకుని బాధతో మూలుగుతూ, "కొంచెం అని చెప్పానుగా. పెట్టెలో ఒక ఆలిచిప్ప వున్నది. ఆ మందు దాన్లో సగంపోసి యివ్వు. ఏ మాత్రమైనా ఎక్కువ పోశావో, నీ చండీదేవి తండ్రికూడా నన్ను నిద్రనుంచి లేపలేడు," అన్నాడు.

షోడశి ఆలిచిప్పను పెట్టెలోంచి వెతికితీసి, జమీందారుచెప్పిన మోతాదులో మందు పోసి, అతడికిచ్చింది. జీవానందుడు ఆలిచిప్పలో ఎంత మందున్నదో చూడకుండానే, దాన్నందుకుని నోట్లో పోసుకున్నాడు. మహావీర్ ముందుకువచ్చి, షోడశికి సౌంజ్ఞ చేస్తూ వసారాలోవున్న చీకటి గదిదగ్గరకుపోయి, ఆమె అందులో ప్రవేశించగానే, తలుపుకు బయట గొళ్ళెంపెట్టాడు.

## 3

ఏ క్షణాన ఏ అవాంతరం వచ్చిపడుతుందో అన్న భయంతో షోడశికి ఆరాత్రి కునుకుపట్టలేదు. తూర్పున తెలతెలవారుతూండగా ఎవరో బయటినుంచి తలుపు తోసినచప్పుడై, ఆమె లేచి నిలబడింది. నందిబాబు లోపలికివస్తూ, "ఇక మీరు బయటికి రండి," అన్నాడు

షోడశి, నందిబాబువెంట జీవానందుడున్న గదిలోకి వెళ్ళింది. జీవానందుడు మంచంమీద పడుకునివున్నాడు. రాత్రి చీకట్లో ఆమె అతడిముఖాన్ని స్పష్టంగా చూడలేకపోయింది. ఇప్పుడు వెలుగులో అతణ్ణిచూస్తుంటే మనిషి బాగా వ్యాధిగ్రస్తుడిలా కనిపిస్తున్నాడు. వయసు నలభై నలభైరెండేళ్ళుండవచ్చు. చెవులపక్క వెంట్రుకలు తెల్లబడి పోతున్నవి. వెడల్పయిన నుదుటిమీద కొన్ని ముడతలూ, అక్కడక్కడా చిన్న నల్లని మచ్చలూ కనిపిస్తున్నవి. క్షయరోగి దృష్టిలాగా అతడిదృష్టి తీక్షణంగావుంది పొడవాటి ముక్కు కొన కిందికివంగివుంది.

జీవానందుడు చేయిఎత్తి షోడశిని దగ్గరకురమ్మని, "నువ్వేమీ భయపడకు. పోలీసులు ఇంటిని ముట్టడివేశారు. రాత్రి నీతండ్రి యిక్కడికి మైలుదూరంలో



గుడారం వేసుకునివున్న జిల్లా మేజిస్ట్రేటుకు నామీద ఫిర్యాదు చేశాడట. ఆమేజిస్ట్రేటు యీప్రాంతాలకు ఏదో తనిఖీమీదవచ్చాడు. అతడికి నేనంటే చాలాద్వేషం. పోయిన సంవత్సరం నన్ను ఉరి తీయించాలనికూడా చూశాడు; కాని సాధ్యంకాలేదు ఇప్పుడు నీతండ్రిచేసిన అభియోగం సాకుగా తీసుకుని పోలీసులచేత యిల్లు ముట్టడింప జేశాడు. బహుశా, ఆయనా యిక్కడికి వస్తుండాలి," అన్నాడు.

నందిబాబు అటూ యిటూ భయంగాచూసి, "ప్రభూ! యీసారి నేనుకూడా తప్పించుకోలేనేమో!" అన్నాడు.

జీవానందుడు తలూపి, "షోడశీ! నామీద పగతీర్చుకోవాలంటే నీకిదే మంచి సమయం. నన్ను ఖైదుకు పంపేశక్తి నీకుంది," అన్నాడు.

షోడశి జవాబు చెప్పేందుకు తలెత్తి, జమీందారు తన ముఖంకేసి చూస్తున్నట్టు గమనించి సిగ్గుతో తలవంచుకుని, "మిమ్మల్నెందుకు ఖైదుచేయ్యించాలి?" అని అడిగింది.

"ఎందుకేవిఁటి? నీకుచేసిన అన్యాయానికి... నేనన్నివిధాలా యిప్పుడీ మేజిస్ట్రేటు చేతిలో చిక్కిపోయాను. పూర్వం బాదూడ్‌బాగాన్ మెస్‌లో వుండగా, యితడికోమారు ఖైదీగా చిక్కాను. జామీనిచ్చేవాళ్ళెవరూలేక, జైలునుంచి పారిపోయాను," అన్నాడు జీవానందుడు.

"అయితే ... మీరు లోగడ బాదూడ్‌బాగాన్ మెస్‌లోకి వచ్చేవారా ?" అని అడిగింది షోడశి ఆశ్చర్యపోతూ.

"అవును, ఆ సమయంలో నేనొక ప్రేమగొడవలోపడున్నాను. పట్టవచ్చిన ఘోష్‌గారికి నామాటలేవీ చెవికెక్కలేదు. ఇప్పుడాయన మేజిస్ట్రీటయాడు. నన్నింకా మర్చిపోలేదు. పారిపోవాలని వుందిగాని...యీ గుండెనొప్పి నన్ను కదలనీయడం లేదు," అన్నాడు జీవానందుడు

"అయితే రాత్రివచ్చిననొప్పి మీకింకాతగ్గలేదా? మరి నన్నేం చేయమంటారు ?" అని అడిగింది షోడశి.

"నీయిష్టానుసారంగానే యిక్కడికి వచ్చినట్టు మేజిస్ట్రీటుతోచెప్పు. ప్రతిఫలంగా నీకు వెయ్యిరూపాయిలు రొక్కం యివ్వటమేకాదు, చండీదేవి హక్కుభుక్తంలోవున్న భూములమీద మరి జన్మలో పన్ను అడగను," అన్నాడు జీవానందుడు

ఇంతలో ఒక ఇనస్పెక్టరూ, కొందరు పోలీసులూ, కాస్తవెనగ్గా మేజిస్ట్రీటూ, తారాదాసచక్రవర్తీ లోపలికి వచ్చారు. తారాదాసు, షోడశిని మేజిస్ట్రీటుకు చూపిస్తూ, "అయ్యా ! ఆ అమ్మాయే నాకూతురు, చండీదేవి పూజారిణి. మీరు కరుణించి యిక్కడికి రాకపోతే వన్నుయివ్వమని అమ్మాయిని యీ జమీందారుగారు చంపి వుండేవాడే," అన్నాడు.

మేజిస్ట్రీటు షోడశిని నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షగాచూసి, "నిన్ను ఇంట్లోనుండి బలవంతంగా తీసుకువచ్చి యిక్కడ బంధించారా ?" అని ప్రశ్నించాడు.

షోడశి తల అడ్డంగాతిప్పుతూ, "లేదు... నేను నాయిష్టప్రకారమే యిక్కడికి వచ్చాను. ఎవరూ నన్ను తాకలేదు," అని చెప్పింది.

తారాదాసచక్రవర్తి లబోదిబోమంటూ,"అయ్యా, నాకూతురు చెప్పింది నిజంగాదు. అవిణ్ణి జమీందారుగారి మనుషులు ఇంట్లోంచి బలవంతంగా యిక్కడికి లాక్కురావటంచూసిన గ్రామప్రజ లున్నారు," అన్నాడు.

మేజిస్ట్రీటు, జీవానందుడికేసి కోపంగాచూసి, షోడశితో, "నువ్వు భయపడకమ్మాయ్ ! నిజంచెప్పు. నిన్ను ఇంట్లోంచి వీళ్ళు బలవంతంగా లాక్కొచ్చారా లేదా ?" అని అడిగాడు

"లేదు, నేనే స్వయంగా యిక్కడకొచ్చాను," అన్నది షోడశి.

"ఏంపనిమీద వచ్చావు ?"



"పనివుండే వచ్చాను. జమీందారుగారికి రాత్రి హఠాత్తుగా గుండెనొప్పి రావటంతో యిక్కడేవుండి సేవచేశాను. అందువల్ల యింటికి రాలేకపోయాను," అన్నది షోడశి.

తారాదాసు పెద్దగొంతుతో, "అయ్యా, ఆమాటలు నమ్మకండి. నిజంచెపితే చంపుతామని బెదిరించి, యీ జమీందారుగారు నాకూతురుచేత అబద్ధాలాడిస్తున్నాడు," అన్నాడు.

మేజిస్ట్రేటు తలూపుతూనవ్వి, జీవానందుడి తలగడమీదవున్న రివాల్వరునూ, మూల నిలబెట్టివున్న తుపాకినీ వేలితోచూపిస్తూ, జీవానందుడితో, "ఇవి నీదగ్గర వుంచుకోవటానికి లైసెన్సు వున్నదిగదా!" అని జమీందారు జవాబుకోసం ఆగకుండానే గదిలోంచి బయిటికి వెళ్ళిపోయాడు.

సబిన్స్పెక్టరుతోపాటు పోలీసులుకూడా గదినుంచి బయిటికి వచ్చారు. తారాదాసు ఏడ్పుముఖంపెట్టి, "మేజిస్ట్రేటుగారికి నామీద ఎందుకో కోపంవచ్చింది?" అన్నాడు.

"అలాంటి దేమీలేదు, చక్రవర్తిబాబూ! ఆయన యీనాటి సంగతేమీ మర్చిపోలేడు, జమీందారు నొకకంట కనిపెట్టేవుంటాడు. ఇక మీఅమ్మాయిని వెంటబెట్టుకుని ఇంటికివెళ్ళండి," అన్నాడు సబిన్స్పెక్టరు.

"అమ్మాయా! ఇక దానిముఖం చూసేదిలేదు. ఇంట్లో అడుగు పెట్టనీను!" అన్నాడు తారాదాసు ఉగ్రుడైపోయి.

"ఆవిడ భైరవిగదా! ఆవిడ వుంటున్న ఇల్లు దేవాలయం ఆస్తి. కనక ఆవిడ ఇంట్లోకి ఆవిణ్ణి రానీయననటం_మీరు కొత్తచిక్కులు కోరి తెచ్చుకోవటం అవుతుంది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

తారాదాసు పిచ్చివాడిలా తలపీక్కుంటూ, "ఆ ఇల్లు నాది! నేనే ఆనీచురాల్ని భైరవీపదవిలోకి తెచ్చాను దీని తల్లెవరో... అది ఎంతకులటో..."

ఇన్‌స్పెక్టర్ అతడి మాటలకు అడ్డొచ్చి, "ఆవేశంకొద్దీ పోలీసులముందు మీ మీ రహస్యాలు బైటపెట్టుకోకండి ఇక ఇంటికి నడవండి," అంటూ కదిలాడు.

అందరూ వెళ్ళిపోయింతరువాత జీవానందుడు షోడశిని, "వాళ్ళవెంట నువ్వెందుకు వెళ్ళలేదు?" అని అడిగాడు.

"నన్నింకా మీరు గుర్తుపట్టలేదా? ఒకసారి నాకేసి బాగాచూడండి!" అన్నది షోడశి.

జీవానందుడు కళ్ళు పెద్దవిచేసి ఆమెకేసి ఒకటి రెండు క్షణాలు పరీక్షగాచూసి ఆశ్చర్యపోతూ, "ఆఁ గుర్తుపట్టాను! నీ చిన్నప్పటిపేరు అలకగదూ?" అన్నాడు.

షోడశిముఖం ఆనందంతో విప్పారింది. ఆమె శాపీగా, "నాపేరు షోడశి, చండీ మందిరభైరవిని. అయినా... ఆ అలక మీకింకా జ్ఞాపకమున్నదా?" అని అడిగింది.

"జ్ఞాపకం లేకేం! నేను అప్పట్లో మీ అమ్మగారి హోటలుకు భోజనం చేయటానికి వస్తూండేవాణ్ణి. అప్పుడు నీకు ఆరేళ్ళ వయసుంటుంది. నువ్వు నన్ను ఎలా గుర్తుపట్టగలిగావు?" అని అడిగాడు జీవానందుడు.

"మీముఖం చాలాయిదిగా మారిపోయింది. అయినా, మీ కుడికంటి నొసటిమీద వున్న పుట్టుమచ్చవల్ల మిమ్మల్ని గుర్తించాను," అన్నది షోడశి.

"మీ అమ్మ యింకా సజీవురాలేనా?"

"లేదు. పది సంవత్సరాల క్రితం చనిపోయింది."

జీవానందుడు విచారంగా ముఖంపెట్టి, "ఒకసారి నేనెంతో ఆపదలో వున్నప్పుడు ఆమె నాకు వందరూపాయిలు అప్పుపెట్టింది. ఆ బాకీ ఇంతవరకూ నేను తీర్చలేదు," అన్నాడు.

షోడశి చిరునవ్వునవ్వి, "అలకతల్లి ఆ మొత్తం మీకు అప్పుగాయివ్వలేదు, వరకట్నంకింద యిచ్చింది," అన్నది.

"వరకట్నం మాట నిజమే." అన్నాడు జీవానందుడు



"ఆ వందరూపాయిలతో పాటు, తన కూతురు అలకను మీకు కన్యాదానం చేసింది, అలకతల్లి! కాని మీరారోజునే అంతర్థానమై, తిరిగి రాత్రి కనిపించారు," అన్నది షోడశి.

జీవానందుడు లజ్జితుడై పోయి, "అప్పుడు నువ్వు చిన్నపిల్లవు. ఏసంగతీ లోతుగా ఆలోచించే జ్ఞానం నీకులేదు. ఆ కన్యాదానం జరిగినరాత్రి నీతండ్రిపేరు మాత్రం విన్నాను. కాని, ఇంతకుముందు కనిపించిపోయిన తారాదాస చక్రవర్తి అతడే నని యిప్పుడు తెలిసింది," అన్నాడు.

షోడశి తలవంచుకు వూరుకున్నది. జీవానందుడు కొంచెంసేపు అటూ యిటూ చూసి, "నందీ!" అని కేక వేసి, అతడు లోపలికి రాగానే, "ఇక్కడెవరైనా డాక్టరున్నాడా? వుంటే కబురుచెయ్యి," అన్నాడు.

నందిబాబు బయిటికి వెళ్ళిపోయాడు. షోడశి గది మూలనున్న చీపురు తీసుకుని మౌనంగా గదంతా శుభ్రం చేయసాగింది. కొంతసేపటికి వాకిట్లో ఎవరో వస్తున్న చప్పుడు కాగానే, ఆమె చీపురును మూలపెట్టి, తలుపుకు ఒక పక్కగా నిలబడింది.

నందిబాబుతోపాటు డాక్టరు గదిలోకి వచ్చాడు. ఆయన జీవానందుణ్ణి పరీక్షించి, శ్రద్ధగా ఓ వారంపాటు మందు తీసుకోవలసి వుంటుందని చెప్పి, మందు పంపేందుకు నందిబాబును తనవెంట రమ్మన్నాడు.

"అలాగే నందితో మందు పంపండి. కాని, ఒకటి. ఈ స్థితిలో నేను కలకత్తా వెళ్ళవచ్చునేమో చెప్పండి, డాక్టర్!" అన్నాడు జీవానందుడు.

"వెళ్ళగలిగితే వెళ్లొచ్చు!" అని డాక్టర్ బయిటికి వెళ్ళిపోయాడు.

జీవానందుడు నందిబాబుకేసి తల తిప్పి, "బహుశా, యీ డాక్టరు ఏదో దిక్కుమాలిన మిక్చరు పంపుతాడు. లాభం లేదు. నేను యీ రోజే కలకత్తాకు ప్రయాణమవాలి. అవసరం అయిన ఏర్పాట్లు చేయించు...షోడశి ఎక్కడ?" అని అడిగాడు.

షోడశికోసం నందిబాబు బయిటికిపోయి ఎక్కడా కనిపించకపోయేసరికి తిరిగి వచ్చి, "ఆమె యిక్కడలేదు, ప్రభూ! ఇంటికి వెళ్ళి వుంటుంది," అన్నాడు.

"నాతో చెప్పకుండా వెళ్ళిందా?" అంటూ జీవానందుడు ఆశ్చర్యపోయాడు.

# 4

షోడశిని, జమీందారు జీవానందుడు రాత్రి బలవంతంగా తన శాంతికుంజానికి తీసుకుపోయాడనీ, ఆమె రాత్రంతా అక్కడే గడపటం కాకుండా, తండ్రిని ధిక్కరించి అతణ్ణి మేజిస్ట్రేటునుంచి కాపాడిందనీ గ్రామం గ్రామమంతా వింతగా చెప్పుకోసాగారు. దీనికి అనేకం చిలవలూ పలవలూ అల్లి చండీదేవి భైరవి కులట అయిపోయిందన్న నిర్ణయానికొచ్చారు, చాలా మంది గ్రామపెద్దలు.

షోడశి ఇంటికి వచ్చేసరికి ముఖద్వారానికి తాళం వేసి వుండటం ఆమె కంటబడింది. ఆమె దొడ్డివైపున వున్న తలుపుదగ్గరకుపోయి తోసి చూసేసరికి అది లోపల గడియవేసి వున్నది. దాన్ని తెరిచే కిటుకు ఆమెకు తెలుసు. ఒక చిన్న మేకుతో గొళ్లాన్ని పక్కకునెట్టి తలుపు తెరుచుకుని ఇంట్లోకి వెళ్లేసరికి, అన్ని గదులకూ తాళాలువేసి వుండటం కనబడింది.

ఇప్పుడేమి చేయటమా అని షోడశి ఆలోచించేంతలో మందిరపు దాసీది లోపలికి వచ్చి, "మీ తండ్రిగారు ఇంటికి తాళాలువేసుకుని వెళ్లారమ్మా. నే నంతా సిద్ధం చేసి వుంచుతాను. మీరు స్నానం చేసి వంటప్రయత్నం చెయ్యండి," అన్నది.

"నాన్నగా రెక్కడికి వెళ్లారు?" అని అడిగింది షోడశి.

"ఆయన చెల్లెలికూతురెవరో వుంటే, ఆమెను తీసుకురావటానికి వెళ్లారు. పెదబాబు జనార్దనరాయ్ మనవడికి మొక్కుబడి తీర్చాలిట!" అన్నది దాసీది.

పెదబాబు జనార్దన్‌రాయ్‌కూతురు హైమవతి యీనాడు గొప్పింటి కోడలైనా, ఆమె చిన్నప్పట్నించీ షోడశికి తెలుసు. షోడశికన్నా ఆమె రెండేళ్ళు చిన్నది. ఒకరిపై ఒకరికి ఎంతో ప్రేమా, ఆప్యాయతా వుండేది.

"అమ్మా! గుళ్ళోంచి పిలుపెప్పుడు వస్తుందో తెలియదు. మీరు స్నానం చేసి సిద్ధంగా వుండటం మంచిది," అని సలహాయిచ్చి దాసీది వెళ్ళిపోయింది.

అది వెళ్ళిపోయాక షోడశి త్వరత్వరగా పనులు ముగించుకోసాగింది. అంతలో మందిరపు వృద్ధపూజారి ఆమె దగ్గరకువచ్చి, "అమ్మా, అందరూ మందిరానికి వచ్చారు, నిన్ను పిలుస్తున్నారు," అని చెప్పాడు.

"సరే, పదండి," అంటూ షోడశి అతడి వెనగ్గా బయలుదేరింది.

షోడశి గుడిలోకి అడుగుపెడుతూనే, తలుపుపక్కగా రెండు నల్లమేకలు కట్టబడి వుండటం చూసింది. వసారాలో పూజాద్రవ్యాలు కుప్పలుగా పడివున్నై. పక్కగా భూస్వామి జనార్దనరాయ్‌గారి రత్నకంబళి పరచబడి వున్నది. దాని మీద గ్రామంలోని ముఖ్యులంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. షోడశిని చూస్తూనే వాళ్ళు మాట్లాడుకోవటం ఆపేశారు.

షోడశి గర్భగుడిలోకి వెళ్ళబోయేంతలో, స్తంభాల వెనకగా కూదున్న స్త్రీల లోంచి హైమవతిలేచి గబగబా ఆమె దగ్గరకు వచ్చింది. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకుంటూ ఒకటి రెండు క్షణాలు అలాగే నిలబడిపోయారు. ఇంతలో రత్నకంబళం మీద కూర్చున్న పెద్దల్లోంచి వృద్ధుడైన సర్వేశ్వరశిరోమణి లేచి నిలబడి, "ఇవాళ హైమవతి తన కొడుకు క్షేమంకోసం చండీదేవికి పూజచేయించ బోతున్నది. ఈ పూజా పునస్కారాల సందర్భంలో షోడశి భైరవికి ఎలాంటి అధికారమూ లేదు," అన్నాడు.

"మంచిది. ఇష్టమైన వారిచేతనే పూజ చేయించుకోవచ్చు," అన్నది షోడశి నిబ్బరంగా.

శిరోమణి మరింతగా గొంతెత్తి, "అంతేకాదు. ఈ ఊళ్లోని పెద్దలంతా ఇక దేవీ పూజకు నువ్వు పనికిరావంటున్నారు. ఎవర్రా అక్కడ? తారాదాస పండితుణ్ణి పిలువు," అన్నాడు.

తన తండ్రి తొమ్మిది పదేళ్ళ పిల్లను వెంటబెట్టుకుని జనంలోంచి ముందుకు రావటం షోడశి చూసింది. "భైరవి పదవికి నువ్వెందుకు పనికిరావో—అంతా మీ నాన్నగారే చెప్పారు," అన్నా రెవరో జనంలోంచి.

హైమవతి తన స్నేహితురాలికి పెద్ద అవమానం జరగబోతున్నదని గుర్తించి, "నాన్నగారూ!" అని తండ్రిని పిలిచింది.

జనార్దనరాయ్ కొంచెం ఆశ్చర్యపోతూ, "ఏమమ్మా?" అన్నాడు.

"వాళ్ళూ వీళ్ళూ చెప్పుకునే సంగతులు నేనూ విన్నాను, నాన్నా! అవన్నీ నిజమనే మనం నమ్మాలా?" అన్నది హైమవతి.

రాయ్‌బాబు, తారాదాసు పక్కనవున్న పిల్లను చూపుతూ, "ఆమె తండ్రే ఎంతో కష్టపడి భైరవీపదవికి ఎక్కణ్ణించో యీ పిల్లను వెదికి తెచ్చాడు దుష్టుడైన జమీందారు రక్షణకు షోడశి పడ్డ తాపత్రయం మనకు తెలిసిందే. నిప్పులేనిపొగ వుండదు గదా," అన్నాడు

"కూతురుమీద స్పర్ధవల్లో మరే కారణం చేతనో, భైరవీపదవికి పిల్లను వెతికి తెచ్చిన మనిషి అబద్ధం చెప్పటం అంత కష్టమైన పనా ?" అన్నది హైమవతి

ఆమె మాటలకు అందరూ నిశ్చేష్టులయ్యారు. ఓ క్షణం తర్వాత సర్వేశ్వర శిరోమణి నవ్వి, "అమ్మాయి బారిస్టరు భార్యకదూ, అందువల్ల క్రాస్తు వాదనలోకి దిగింది," అన్నాడు.

హైమవతి, షోడశికేసి మరో అడుగువేసి, "మీరు నన్ను గుర్తుపట్టారో లేదో ! నాకు మాత్రం మీరు బాగా జ్ఞాపకమే దేవిముందుకు పదండి సుముహూర్తం దాటిపోతున్నది," అన్నది

కూతురు యిలా అనగానే జనార్దనరాయ్ కోపంగా లేచి నిలబడి, "ఆమె పూజ జరపటానికి నే నొప్పను," అన్నాడు.

శిరోమణి కళ్ళెర్రజేస్తూ "రాత్రి జమీందారు కొంపలో ఆమె బుద్ధిపూర్వకంగా చేసిన అవినీతి వ్యాపారంసంగతి అలా వుంచుదాం ఆమె తల్లిసంగతి తారాదాస పండితుడు చెప్పనవసరంలేదు. చండీదేవి ముఖంచూసి షోడశినే చెప్పమనండి," అన్నాడు.

షోడశి పెదవులు ఏదో అనేందుకు కంపించినై కాని, అంతలో హైమవతి ఆమెచేయి పట్టుకుని, "మీరేమీ చెప్పకండి !" అని తన తండ్రికేసి తిరిగి, "మీరంతా యీమె తల్లిగార్ని గురించి యిష్టమొచ్చినవిధంగా చెప్పకోండి కాని, ఈమె తల్లినిగురించి యీమెచేతనే చెప్పించాలని చూడటంమాత్రం చాలా అన్యాయం, ఘోరం," అని షోడశితో, "ఇక మీరు దేవిదగ్గరకు రండి !" అంటూ చేయిపట్టుకుని తీసుకుపోయింది.

దేవీ విగ్రహంముందుకు వెళ్ళగానే షోడశి, "చెల్లీ, నేను పూజచేయను," అన్నది

"ఎందుకని ?" అంటూ హైమ, షోడశి ముఖంలోకి చూసింది

"కారణం యివాళమాత్రం నీకు చెప్పను నేనిక్కడ నిలుచుని నీ కొడుకును దీవిస్తాను," అన్నది షోడశి

హైమవతి కొడుకును తీసుకువచ్చి ఆమెముందు నిలబెట్టింది. షోడశి దీవించింది



హైమ ఎంతో వినయంతో, "భైరవితల్లి ఆశీర్వాదాన్ని తల్లికొడుకులం ఎంతో అమూల్యంగా భావిస్తాం కాని, మీ చేతిమీదుగా పూజ జరగాల్సిందే ఏనాడు ఆజ్ఞ అయితే, ఆనాడు అన్ని ఏర్పాట్లూ చేయిస్తాను," అన్నది

"పవిత్రకార్యాన్ని ఆపుచేయించకు," అన్నది షోడశి

హైమ విస్మయంగా, "మీరింత చండీదేవికి భైరవిగా వుండరా!" అని అడిగింది.

"ఇవాళ దాన్నిగురించేకదా ఆ వాదోపవాదాలన్నీ!" అన్నది షోడశి

శిరోమణి గబగబా అక్కడికి వచ్చి, "హైమా, నీకు తెలియదు యిది స్వల్ప విషయంకాదు ఆమె పూజ చేయనవిచెప్పటం...చాలా మంచిదైంది రాత్రి శాంతి కుంజంలో జరిగిపోయిన అవమానకర సంఘటనతో యీమెకు పూజచేయించే అర్హత పోయింది," అన్నాడు

ఆ మాటల్లోని అంతరార్థం గ్రహించి హైమవతి తల వంచుకున్నది షోడశి ఓ క్షణకాలం వూరుకుని, అక్కడికొచ్చిన వృద్ధపూజారితో, "మీరు వెళ్ళి, మీ మామూలుప్రకారం దేవీపూజను సమాప్తంచేసి, మీ భాగం మీరు తీసుకుని, మిగిలిన భాగాన్ని భండారపుగదిలో పెట్టి తాళంవేసి, ఆ తాళపుచెవులు నాకు పంపండి," అని హైమవతివైపు తిరిగి, "వెళ్ళమ్మా! అంతా సిద్ధంచేసివున్నదాయె ఈ పూజా

విధానం నీ కొడుక్కు చాలా మేలుకలిగిస్తుంది. నేనింకా పూజ చేసుకోలేదు. వెళ్తున్నాను. వీలుంటే మళ్లీ కలుసుకుందాం," అని అక్కడ్ణించి వెళ్ళిపోయింది.

* * *

చండీదేవి ఆలయానికి ఒక మైలుదూరంలో, బారుయీనది అవతలిగట్టున ఒక పెద్ద మర్రిచెట్టున్నది. దానికిందవున్న ఒక చిన్నకుటీరంలో ఒక ముసలి ఫకీరు నివసిస్తూండేవాడు అతడు అప్పుడప్పుడూ ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళి, ఆరునెల్లకో ఏడాదికో తిరిగి వస్తూండేవాడు

ఈ ఫకీరును షోడశి గురువుగా భావిస్తూండేది అతడు కుటీరంలో వున్నప్పుడు తరుచుగా అక్కడికిపోయి, ఆతడిద్వారా అనేక ధర్మసందేహాలు తీర్చుకుంటూండేది. ఆయన గత ఆరునెల్లుగా ఎక్కడో దేశాటన చేస్తున్నాడు. చండీదేవి మందిరంలో షోడశికి అవమానం జరిగిన మర్నాటి మధ్యాహ్నంవేళ హఠాత్తుగా అతడు షోడశి ఇంటికి వచ్చాడు

షోడశి అతడికి నమస్కరించి, చాప పరిచి, "మీరు కుటీరానికి ఎప్పుడు తిరిగి వచ్చారు? ఆ సంగతే నాకు తెలియదు," అన్నది.

"నిన్న ఉదయమే వచ్చాను. సాయంకాలంపూట జనార్దనరాయ్‌బాబూ, ఆయనగారి బారిస్టరు అల్లుడు నిర్మలుడూ, మరికొందరూ నా కుటీరానికి వచ్చారు ఆ నిర్మలుణ్ణి నేను బాగా ఎరుగుదును. అతడు చాలా సంగతులు చెప్పాడు వాటిని గురించి నిన్నడగా లనుకుంటున్నాను," అన్నాడు ఫకీరు

"అయితే, అడగండి," అన్నది షోడశి

"చూడమ్మా, నేను తురకవాణ్ణయినా నీ దేవీదేవతలమీద నా కెలాంటి ద్వేషమూ లేదు ఆ సంగతి నీకు బాగా తెలిసిందే. నీవు చండీదేవత పూజ చేయనని వాళ్ళకు చెప్పావా?" అని అడిగాడు

అవు నన్నట్టు షోడశి తలూపింది. "అలా అయితే అందుకు నందిబాబు చెప్పినట్టు బలమైన కారణమే వున్నదన్నమాట నందిబాబు చెప్పిందేమిటంటే-జమీందారు జీవానందుడు నువ్వతనితోపాటు కలకత్తాకు వస్తావని గట్టిగా నమ్మాడట నీకోసం ఒక మేనానుకూడా తెప్పించాడట," అన్నాడు ఫకీరు.

"ఆయన నమ్మకాలకు నేనేం చేయగలను?" అన్నది షోడశి

"నిజమే...కాని, ఆ సంగతి వినడానికే అసహ్యంగా వుంది ఆ జమీందారును ఎందుకు నీవు మేజిస్ట్రేటునుంచి రక్షించావు?" అని అడిగాడు ఫకీరు



"బాబా! జబ్బుతోవున్న మనిషిని జైలుకు పంపటం న్యాయం అనిపించు కుంటుందా?" అన్నది షోడశి.

"జరగవలసిందేదో జరిగిపోయింది. కాని అపవాదుమాత్రం నువ్వు భరించ వలసివస్తుంది!" అన్నాడు ఫకీరు.

"అదినిజమే. ఆయనకు శిక్షపడేలా చేయాలని అందరూ ప్రయత్నించారు. నేను మాత్రం ఆయనకు వ్యతిరేకంగా సాక్ష్యంమటుకు యివ్వలేను," అన్నది షోడశి

"అసలు సంగతేమిటి, షోడశీ?" అన్నాడు ఫకీరు.

షోడశి తలవంచుకుని జవాబివ్వకుండా వూరుకున్నది. ఒకటిరెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపై. అంతలో పనిమనిషి వాకిటిదగ్గరకు వచ్చింది. ఫకీరు లేచి, "ఇక నేను వెళ్తున్నానమ్మా!" అంటూ బయిటికి నడిచాడు. షోడశి కొంచెం వంగి అతడికి నమస్కరించింది.

ఆనాటి సాయంకాలం షోడశికి, ఫకీరును అతడి కుటీరంలో దర్శించాలన్న ఆలోచన వచ్చింది. తన ఆశ్రితులైన మందిర నౌకర్లు విపిన్నుణ్ణి; దిగంబరుణ్ణి తోడు తీసుకోకుండానే, ఆమె పొలాలకు అడ్డంపడి నదివైపుకు నడిచింది. నది ఆ ప్రాంతాల ఆట్టే లోతుండదు. ఆమె నదిదాటి కుటీరంముందుకు వెళ్ళేసరికి, అక్కడ రాయ్‌బాబు అల్లుడు నిర్మలుడు కనిపించాడు. అతడు అలవాటుప్రకారం షోడశికి నమస్కరించాడు షోడశి కుటీరంలోకి తొంగిచూసి ఫకీరు లేకపోవటంతో, "బాబా, ఎక్కడికివెళ్లారు?" అని నిర్మలుణ్ణి అడిగింది.

"అదే తెలియటంలేదు. నేను దాదాపు గంటసేపటినుంచి ఆయనకోసం ఎదురు చూస్తున్నాను," అన్నాడు నిర్మలుడు.

అరగంటకాలం గడిచినా ఫకీరు తిరిగి రాలేదు. చూస్తుండగానే పడమటివైపు ఆకాశం మేఘాలతో కప్పుకుపోయింది. అప్పటికి సూర్యాస్తమయమై ఓపావుగంట గడవటంతో, ఆ ప్రదేశాన్ని చీకటి ఆవరించసాగింది. గాలివేగాన్నిబట్టి తుఫాను వచ్చే సూచనలు గుర్తించి, షోడశి, "బాబా, ఎక్కడికో వెళ్ళింటారు. వాన రాక ముందే గ్రామం చేరటం మంచిది." అన్నది.

"మనం గ్రామం చేరేలోపల వాన ఎలానూ వస్తుంది. దానికితోడు చీకటికూడా కమ్ముకుంటున్నది. నాకు గ్రామానికి దారి బాగా తెలియదు," అన్నాడు నిర్మలుడు.

"మీరు నా వెనకేరండి," అంటూ షోడశి బయలుదేరింది.

ఇద్దరూ నదిదాటి కొద్దిదూరం నడిచేసరికి ఫెళఫెళమంటూ ఉరిమి, పెద్దపెద్ద చినుకులు ప్రారంభమయినై. నిర్మలుడు కళ్ళజోడు సవరించుకుంటూ, "ఈ వానలో తడిసి కళ్ళజోడు చూడటానికి ఎందుకూ పనికిరాకుండా పోతుంది. అది లేకపోతే యీ చీకటో నడవటమే కష్టం," అన్నాడు.

షోడశి ఒక అడుగు వెనక్కువేసి, "అలాఅయితే, మీరు నా చేయి పట్టుకుని జాగ్రత్తగా నడవండి," అంటూ చేయి చాపింది.

నిర్మలుడు, షోడశి చేయి పట్టుకుని, "మీరు మెల్లిగా నడవండి. నే నిప్పుడు రెండు కళ్లు మూసుకునయినా నడవగలను." అన్నాడు నవ్వుతూ.

షోడశి జవాబేమీ యివ్వలేదు. నిర్మలుడు ఓక్షణం ఆగి, "...మీ తండ్రిగారి ప్రవర్తన చాలా చిత్రంగావుంది. దుర్మార్గుడైన జమీందారును మీరు రక్షించటం గ్రామంలో ఎవరికీ అర్థంకాని సమస్యగా తయారైంది," అన్నాడు.

షోడశి దీనికీ జవాబివ్వలేదు. వానాగాలీ తీవ్రం కాసాగినై. దూరాన గ్రామంలో అక్కడక్కడా దీపాలు కనిపించినై. నిర్మలుడు మళ్లీ, "నిన్న దేవీమందిరంలో మిమ్మల్ని దూరానవుండి చూశాను. ఇప్పుడు మీ చేయి పట్టుకుని మీతో నడుస్తున్నాను. కాని, మీ ప్రవర్తన నాకు అగమ్యగోచరంగా వుంది. మీ మీద గ్రామపెద్దలందరూ కోర్టులో దావా వేసినా వేయవచ్చు," అన్నాడు.

"మీరేమీ విచారించకండి. దిక్కూమొక్కూలేని ఆడవాళ్ళ జీవితాలు ఎంత బాధాకరంగా గడుస్తవో, బహుశా నా జీవితంకూడా అలాగే గడుస్తుంది," అన్నది షోడశి.

షోడశి మాటలు నిర్మలుణ్ణి చలింపచేసినై. అతడు తనను తాను సమ్మాళించుకుని,

ఆమెచేయి వదలకుండా నెమ్మదిగా నడవసాగాడు గాలీవానా మరింత తీవ్రం కాసాగినై ఇద్దరూ గ్రామంలో అడుగుపెట్టారు ఒకవీధి మలుపు తిరగటంతోనే, సనాతనుడి ఇంట్లోని దీపపువెలుతురు వీధిలోకి పడుతున్నది ఇంకొంచెం ముందుకు వెళ్ళింతరవాత, షోడశి ఆగి, "మీరు యీ వీధివెంట మరికొంచెం దూరం వడిచి కుడివైపుకు తిరిగారంటే, మీ మామగారి ఇల్లు," అన్నది

"మరి మీ దారి ?" అన్నాడు నిర్మలుడు చేయి వదలకుండానే

"నేను ఇల్లుచేరటానికి, యీ ఎడమవైపునవున్న తోటలోంచి పోవాలి," అన్నది షోడశి

"మీరు బాగా చదువుకున్నవారని ఇతర్లు చెప్పగా విన్నాను, అది యిప్పుడు రుజువైంది...ఈనాటి సన్నివేశంమాత్రం జీవితంలో ఎన్నటికీ మరిచిపోలేను," అన్నాడు నిర్మలుడు

షోడశి నవ్వి, "మీరు నాతోపాటు వానలో బాగా తడిసిపోయారు ఇక వెళ్ళండి," అన్నది

"రేపు మేం వెళ్ళిపోతాం హైమకు ఏమయినా చెప్పమంటారా ?"

"పిల్లవాణ్ణి దీవిస్తున్నానని హైమకు చెప్పండి," అని షోడశి వీధిపక్కనున్న తోటకేసి నడిచింది

నిర్మలుడు వీధివెంట జాగ్రత్తగా నడుస్తూపోయి తన మామగారి ఇల్లు చేరాడు ఇల్లంతా హడావిడిగా వున్నది ఎక్కడెక్కడి తుప్పుపట్టిన లాంతర్లు తుడిచి, నౌకర్లు వెలిగిస్తున్నారు జనార్దనరావ్ ఎవరెవరు ఎట్లుగా వెళ్ళి అల్లుణ్ణి వెతకాలో చెపుతున్నాడు అంతలో అల్లుడు ఆయనకు గుమ్మంలో కనిపించాడు

నిర్మలుడి బంధువులూ, అత్తమామలూ, భార్యా అతణ్ణి చుట్టుముట్టి ప్రశ్నలపై ప్రశ్నలు కురిపించసాగారు నిర్మలుడు వాళ్ళతో, "నది అవతలున్న ఫకీరుబాబాను కలుసుకునేందుకు వెళ్ళాను ఆయన కుటీరంలోలేడు ఇంతలో చీకటిపడిపోయింది, గాలీవానా సాగింది," అన్నాడు

నిర్మలుడి అత్తగారు అల్లుడితో, "ఆ సంగతులన్నీ తరవాత చెప్పుకోవచ్చులే, నాయనా! ముందు లోపలికిపోయి పొడిధోవతి కట్టుకో," అన్నది.

అల్లుడన్న మాటలకు జనార్దనరావ్ ఆశ్చర్యపోతూ, "ఫకీరును చూడ్డానికి వెళ్ళావా? మరి ఇంతచీకట్లో తిరిగిరావటానికి దారెలా కనుక్కోగలిగావు ?" అని అడిగాడు

"అదే ఆశ్చర్యం ఎవరో నాచేయి పట్టుకుని ఇంటిగుమ్మందాకా తీసుకువచ్చి వదిలిపోయారు," అన్నాడు నిర్మలుడు

"ఎవరది ? పేరేమిటి ? అన్నాడు రామ్.

నిర్మలుడు కొంచెంసేపు ఆలోచించి, "పేరు చెపితే వాళ్ళకు ముందు ముందు ఆపద కలుగుతుందేమో," అన్నాడు.

జనార్దనరామ్ ఆశ్చర్యపోతూ, "ఏమిటీ ? మేలుచేసినవాళ్ళకు కీడా ? సర్లే పోనీమ్. వాళ్ళెవరైనాసరే తప్పక బహుమానం యివ్వాలి," అనినౌకరును పిలిచి, "పటర్జీని ఈ సహాయంచేసిన వాళ్ళెవరో ఆడాతీసి, ఒక రూపాయి బహుమానం యివ్వమన్నానని చెప్పు. రూపాయికి తగ్గకూడదు, తెలిసిందా ?" అన్నాడు.

ఆరాత్రి భోజనాలయాక పడకగదిలో హైమవతి భర్తతో, "బహుమతి యిస్తామని తెలిసినా, మీకు సహాయంచేసిన వ్యక్తి బయటపడదు, నాకు బాగాతెలుసు. మీరే ఏదయినా బహుమానం యిస్తే బావుండేది," అన్నది.

"బహుమానం యిచ్చే ఆలోచనే నాకు రాలేదు," అన్నాడు నిర్మలుడు.

"మీకు యీ చీకటీ, వానలో సహాయపడిన దయార్ద్రవ్యక్తిని నేను గుర్తించాను. కాని ..ఆమె మీచేయి పట్టుకునే మిమ్మల్ని ఇంటిసమీపానికి తీసుకొచ్చిందా ?" అని అడిగింది హైమవతి.

"అవును, అలాగే చేసింది. నువ్వయితే యితర్ల కోసం అలా చేయవనుకుంటాను," అన్నాడు నిర్మలుడు.

"ఊహుం, చేయలేను."

"నాకు తెలుసు! చండీదేవికి భిన్నం అయిన ఆమెను యివ్వాళ నను బాగా అర్థం చేసుకోగలిగాను. మీలాగా ఆమెకు గౌరవమూ, కీర్తి, కళంకమూ అనే వాటిని గురించి ఏమీ జిజ్ఞాసలేదు," అన్నాడు నిర్మలుడు.

"జమీందారు జీవానందుడిదగ్గర ఆమె ప్రవర్తించినతీరు గుర్తుంచుకునే మీ రీమాట చెబుతున్నారా ?" అని అడిగింది హైమ చిరుకోపంగా.

"ఆమె నీతివంతురాలో కాదో నాకు తెలియదు. ఆమె చేతి సాయంతో కటికచీకటిలో కొన్నివేల అడుగులు నడిచివచ్చాను. నే ననేక ప్రశ్న లడిగానుగాని ఒక్కదానికీ ఆమె సూటిగా జవాబివ్వలేదు," అన్నాడు నిర్మలుడు.

"అయితే మీ స్నేహాన్నికూడా ఆవిడ కోరలేదన్నమాట.

"లేదు."

"ఇలాంటి విషయాల వెనక గుంభనగా వుండే అభిప్రాయం తెలుసుకోవటానికి మీ మగవాళ్ళకు చాలాకాలం పడుతుందిగాని—మేం ఆడవాళ్ళం యిట్టే పసి




కట్టేస్తాం ! సరే మీరు నిద్రపొండి. నేనిప్పుడేవస్తాను," అని హైమవతి గదినుంచి బయిటికి వెళ్ళింది

అర్థంలేని భార్య అనుమానం నిర్మలుడికి కోపాన్ని తెప్పించింది

# 5

ఒక నెలరోజులు గడిచినై ఈ కాలంలో చండీఘడగ్రామం చిన్నచిన్న తగాదాలతో, కుట్రలతో అట్టుడికినట్టు ఉడికిపోయింది చిన్నరైతులూ, వ్యవసాయకూలీల్లో ఎక్కువభాగం షోడశిపక్షం వహించారు జనార్దనరాయ్ అతడి వత్తాసుదార్లూ లోగడ చండీదేవి మాన్యాలను ఎలా కొంచెంకొంచెంగా కబళించారో వాళ్ళకుతెలుసు షోడశి అలాంటి దుశ్చర్యలను చాలావరకు ఎదిరించి నిలబడింది ఇప్పు డామెను భైరవి పదవినుంచి తొలగించటం, జనార్దనరాయి మురా కేవలం మరికొంత ధనార్జనకు చేసే కుట్రగా కూలీనాలీజనం భావించారు వాళ్ళల్లో సాగరుడనేవాడు షోడశికి నమ్మిన బంటు

ఒకనాటి సూర్యోదయంవేళ షోడశి నిద్రలేచి వీధితలుపు తెరవగానే, ఓ చిన్న గుంపు ఇంటికెదురుగా వీధిలో నిలబడివుండటం ఆమెకంట బడింది ఆ గుంపులోంచి జమీందారు జీవానందుడి గుమస్తా నందిబాబు ఆమెదగ్గరకువచ్చి, "ప్రభువుగారు గ్రామానికి దయచేసినసంగతి తమరు వినేవుంటారు," అన్నాడు

నందిబాబు వినయమూ, మాటల్లోని వ్యంగ్యధోరణి షోడశికి కోపాన్ని తెచ్చినై ఆమె కోపంగా జవాబివ్వబోయేంతలో నందిబాబు, "ప్రభువుగారు తమనుగురించి అడిగారు వారు ఇక్కడే సూర్యోదయానికి పూర్వమే ఆఫీసుకువచ్చి రైతుల ఫిర్యాదులు వింటున్నారు తమ ఆజ్ఞ అయితే మేనా పంపిస్తారు," అన్నాడు

షోడశి కోపాన్ని అదుపులోపెట్టుకుని, "నందీ ! ఇవి నీమాటలా ? లేక జమీందారుగారిమాటలా ?" అని అడిగింది

"నేను వారి నౌకరును మాత్రమే; వారే స్వయంగా ఆజ్ఞాపించారు." అన్నాడు నందిబాబు

"ఇంతకూ నీ ప్రభువుగారి అదృష్టం బావుండబట్టే జైల్లో నూనెగానుగ తిప్పే అవస్థ తప్పి, పల్లకీ ఎక్కి తిరగగలుగుతున్నాడు నాకు మేనా ఎక్కి తిరిగే తీరికలేదని ఆయనతో చెప్పు." అన్నది షోడశి కోపంగా

నందిబాబు వెనుదిరిగాడు ఈలోపల కచేరీచావిట్లో చిన్న సభ తీరింది జమీందారు జీవానందచౌధురి దిండ్లకు ఆనుకుని కూర్చునివున్నాడు ఎదురుగావున్న తివాసీలమీద జనార్దనరాయ్, సర్వేశ్వర శిరోమణి, జోగేశ్‌బాబూ, మిత్తర్‌బాబూ, తారాదాస చక్రవర్తీ, ఇంకా గ్రామపెద్దలు చాలామంది కూర్చునివున్నారు

జీవానందుడు అందరిముఖాలకేసీ ఓసారి పరీక్షగాచూసి, "చెప్పండి, ఇంతమంది పెద్దలొచ్చారు, సంగతేమిటి?" అన్నాడు

జనార్దనరాయి, శిరోమణికేసిచూసి, అతడు మాట్లాడే ధోరణిలో లేకపోవటంతో తనే నంగిగా, "నందిబాబుకు అన్నీ తెలుసు ఆయన ప్రభువులకేమీ నివేదించనే లేదా?" అన్నాడు

"చెప్పాడేమోగాని నాకు జ్ఞాపకంలేదు పైగా అతడు నా గుమస్తా మీరో గ్రామ పెద్దలు మీరే ఆ సంగతేదో చెప్పండి" అన్నాడు జీవానందుడు

జనార్దనరాయ్, శిరోమణికి సౌంజ్ఞ చేశాడు శిరోమణి గొంతు సవరించుకుని, "తారాదాస చక్రవర్తి కూడా యిక్కడేవున్నాడు మేమంతా సంప్రతించుకుని ఆయన కుమార్తె షోడశిని భైరవిపదవినుంచి తొలగించాం కాని, ప్రభువుల ఆజ్ఞాపత్రం లేందే మామాటకు విలువవున్నట్టు కనబడట్లం లేదు." అన్నాడు

"ఆవిడచేసిన తప్పేమిటి?" అని అడిగాడు జీవానందుడు

"ఆమెజీవితం కళంకితమైపోయింది, ప్రభూ!" అన్నాడు శిరోమణి

జీవానందుడు ఆమాటలు వింటూనే కొంచెం ఉలిక్కిపడి, తలవంచుకుని ఓక్షణ కాలం వూరుకుని, తరవాత తలఎత్తి శిరోమణికేసి నిశితంగా చూస్తూ, "ఈ ఆరోపణ చాలా తీవ్రమైంది వాస్తవం తెలుసుకునే మాట్లాడుతున్నారా?" అన్నాడు

జనార్దనరాయ్ ముఖం పాలిపోయింది అతడు అటూఇటూ నేలచూపులుచూసి, "షోడశితండ్రి తారాదాస చక్రవర్తే ఆమెనుగురించి చెప్పగలడు చిత్తగించండి, ప్రభూ!" అన్నాడు

జీవానందుడు చేయివూపి, తారాదాసును మాట్లాడవద్దని వారించి, "ఆయన తన కూతురు కథను భగవంతుణ్ణి స్మరించి వున్నది వున్నట్టుగా చెపితే, నేను వినలేను వినను మీలో మరెవరైనా ఆపనిచేస్తే నా అభ్యంతరంలేదు." అన్నాడు

శిరోమణి భయపడుతూ, "భగవంతుడిమీద ప్రమాణంచేసి ధర్మంగా వాస్తవం నేను చెపుతాను ప్రభూ!" అన్నాడు.

"బహుశా మీరు చెప్పగలరు. కారణం, మీరు ధర్మశాస్త్రాలన్నీ పఠచదివిన బ్రాహ్మణులు. సరే...... అదంతా వదిలేద్దాం. అసలుసంగతి, చండీదేవికి భైరవిగా వున్న షోడశిని మీరు వెళ్ళగొట్టదలిచారు, అంతేనా?" అన్నాడు జీవానందుడు

"అవును, ప్రభూ!" అంటూ అందరూ తలలు వూపారు.

"చండీదేవి ఉపాసినులైన భైరవిణుల సతీత్వగాధలు లోకప్రసిద్ధమైనవే! వాళ్ళనుగురించి చర్చలు చేయటంవల్ల ప్రయోజనంలేదు. మాతంగి భైరవికి అయిదు గురు భైరవులుండేవారని నాచిన్నప్పుడు విన్నాను అందువల్ల చండీదేవి మహత్తు తరిగేంపోలేదు.....సరే, ప్రస్తుతవిషయం ఈ షోడశి భైరవిని నేను వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతుందా?" అన్నాడు

జనార్దనరాయ్ సంతోషంగా, "అదంతా మేం చూసుకుంటాం, ప్రభూ!" అన్నాడు

జీవానందుడు ఏదో అనబోయేంతలో నందిబాబు తలవంచుకుని అక్కడికివచ్చాడు జీవానందుడు అతణ్ణి, "వచ్చిందా?" అని అడిగాడు

"లేదు, ప్రభూ!" అన్నాడు నందిబాబు

"ఎందుకని రానన్నది?"

"ఆమె రాదట. ప్రభువులకు ప్రజలతగవులు తీర్చాలనే ధ్యాసవుంటే, అదేదో న్యాయంగా చేసివెళ్ళమన్నది." అన్నాడు నందిబాబు

జీవానందుడిముఖం మాడిపోయింది అతడు కాసేపు మౌనంగా వూరుకుని, "సరే నందీ నువ్వెళ్ళు! ప్రఫుల్లుడితో మాట్లాడి —అదేదో పంచదార కంపెనీవాళ్ల భూములు కావాలన్నారే—వాళ్ళకు అమ్ముతామని ఉత్తరం రాయించు." అన్నాడు

నందిబాబు వెళ్ళగానే, శిరోమణి లేచి జీవానందుణ్ణి ఆశీర్వదించి, "ఇవాల్టికి అంద రికీ సెలవిప్పించండి!" అన్నాడు.

"సరే, అలాగే వెళ్ళిరండి." అన్నాడు జీవానందుడు. గ్రామపెద్దలంతా అతడికి నమస్కరించి కచేరీచావడినుంచి బయిటికి వెళ్ళిపోయారు.

ఆనాటి సంధ్యాసమయంలో, గూడెంలోని కూలిజనానికి నాయకులైన సాగరుడూ, అతడి బాబాయి ముసలి హరిహరుడూ షోడశిని చూచేందుకు వచ్చారు. గ్రామ పెత్తందార్లు షోడశిని భైరవి పదవినుంచి తొలగించడమేగాక, లోగడ ఆమె సహాయంవల్ల సాగుచేసుకుంటున్న గుడి మాన్యపు భూముల్ని కూడా లాక్కోవాలని

చూస్తున్నట్టు వాళ్ళు పసికట్టారు ఈ ప్రయత్నంలో జమీందారు జీవానందచౌధురి మొగ్గుకూడా వాళ్ళవైపునే వున్నదని, గ్రామస్తులు అనుకునే మాటలద్వారా వాళ్ళకు అనుమానం కలిగింది

వాళ్ళిద్దరూ వచ్చేప్పటికి షోడశి, హైమవతికి యిక్కడి గ్రామ పరిస్థితులూ, తనను భైరవి పదవినుంచి తొలగించేందుకు జరుగుతున్న కుట్రలూ తెలుపుతూ, సహాయం చేయవలసిందిగా కోరుతూ రాసిన వుత్తరాన్ని దీపపు కాంతిలో మరోసారి చదువుకుంటున్నది. ఆ ఉత్తరం ఆమెకంత తృప్తికరంగా లేదు. దాన్ని చించి ఒక మూలకు విసిరి, మరో వుత్తరం రాసేందుకు ప్రయత్నించబోతున్నది.

ఆ సమయంలో సాగరుడూ, హరిహరుడూ వచ్చి, ఆమెకు నమస్కరించి గ్రామంలో చెలరేగిన వదంతుల్నిగురించి చెప్పారు. జమీందారు చండీదేవి మాన్య మైన కొంత భూమిని, ఏదో పంచదార కంపెనీకి అమ్మజూపుతున్న సంగతికూడా తెలియబరిచారు.

షోడశి వాళ్ళు చెప్పిందంతావిని, "మీ రీ గొడవల్లో తొందరపడి తలదూర్చకండి ఈ దుష్ట ప్రయత్నాలను కోర్టుద్వారా నిరోధించవలసిందే. అందుకు జనార్దనరాయ్ బాబు అల్లుడు బారిస్టరు నిర్మలబాబు మనకు కొంతసహాయం చేస్తాడు. ఆయన భార్యకు ఉత్తరం రాస్తున్నాను," అన్నది.

"మీరు చెప్పింది బాగానేవుంది, తల్లీ! ఎంతోకాలంగా మేం చేసుకుంటున్న భూమినికూడా వాళ్ళు ఆక్రమించుకోవాలనే ప్రయత్నంలో వున్నట్టు తెలిసింది మేం ఏంచేయాలి? కోర్టుకుపోతే-అది యెప్పట్లో తేలే వ్యవహారమా,'' అన్నాడు సాగరుడు

'అట్లని దెబ్బలాటకు దిగుతావా? ఇప్పటికే నీవు రెండుసార్లు జైలుకు వెళ్లొ చ్చావు నామాట విని ఒక పని చేయండి. మీ రిద్దరూ, అమ్మవారి తాలూకు పొలం యింకా నా స్వాధీనంలో పదిహేను ఎకరాలున్నది. మీ రిద్దరూ దాన్ని పంచుకోండి చండీదేవికి మీ ఇష్టమైనంత పన్ను చెల్లించండి.'' అన్నది షోడశి.

సాగరుడూ, హరిహరుడూ ఆమెకు వంగి నమస్కరించి, పాదధూళి తీసుకుని చేతిలోని లాఠీలు వూపుకుంటూ వెళ్ళిపోయారు. షోడశి మళ్లీ దీపం ముందు కూర్చుని హైమకు వుత్తరం రాసేందుకు ఆలోచించసాగింది. ఆ సమయంలో, బయట అడు గుల చప్పుడైంది. షోడశి తలఎత్తి చూసేంతలో జమీందారు జీవానందుడు వాకిట్లోకి వచ్చి, "లోపలికి రావచ్చా?" అన్నాడు

షోడశి ఓ క్షణకాలం నివ్వెరపోయి, అంతలోనే తనను తాను సంబాళించుకుని, "రావచ్చు, రాండి!'' అన్నది

జీవానందుడు నవ్వుతూ లోపలికి వచ్చాడు షోడశి అటదికి కూర్చునేందుకు చాప పరిచి, అతడు కూర్చోగానే, 'తమరు యిక్కడి కెందుకొచ్చారు?" అని అడిగింది

"నన్ను చూసి భయపడుతున్నట్టున్నావ్...కేకలు మాత్రం వేయకు. ఇంతకు ముందే లాఠీలు వూపుకుంటూ పోతున్న నీ ముఠారౌడీ లిద్దర్ని చూశాను. కాని, నా దగ్గర పిస్తోలుంది,'' అంటూ జీవానందుడు జేబులోంచి పిస్తోలు బయిటికితీసి, తిరిగీ జేబులో పెట్టుకున్నాడు.

"అయితే, దిక్కూదివాణం లేనిదాన్నని నన్ను చంపడానికొచ్చారా?'' అని ప్రశ్నించింది షోడశి.

"రామ రామ. అలాంటి ఆలోచన నా మనసులో ఏమీ లేదు. నాకే ఎందుకో భయంగా వుండి, నిన్నోసారి చూసిపోదామని వచ్చాను," అన్నాడు జీవానందుడు.

షోడశి మాట్లాడలేదు. జీవానందుడు తలుపు దగ్గరకువేసి, లోపల గడియపెట్టి, "నీ దగ్గర మంచిసువాసనవేసే పొగాకు దొరకదు—కాని, అలాంటిదే కడుపులోవేడిని చల్లార్చే దేదయినా వుందా?'' అన్నాడు.

"ఏదయినా అంటే, సారాయేనా?'' అన్నది షోడశి.

"అది నిన్నడిగేవస్తువుకాదు, అలకా! నిన్నడగదలిస్తే, ప్రాణాలు నిలుపుకునేందుకు పనికివచ్చే వస్తువుకోసం అడుగుతాను. ఇంత రొట్టె, పూరీ, మిఠాయిలాంటిదేమైనా వుంటే పెట్టు, చెడ్డ ఆకలివేస్తున్నది," అన్నాడు జీవానందుడు.

షోడశి ఓ నిమిషం వూరుకుని, "ఇంటికిపోయి, సుష్టుగా ఎందుకు భోజనం చేయకూడదు?'' అని అడిగింది.

"నా ఇంటిసంగతి నా కన్న నీ కెక్కువ బాగాతెలుసు,'' అన్నాడు జీవానందుడు

షోడశి వంటగదిలోకిపోయి, ఒక ఆకులో ప్రసాదం తెచ్చి అతడిముందు పెట్టింది

జీవానందుడు ప్రసాదం తింటూ, "నా భారాన్ని నువ్వు మోస్తావా, అలకా?" అని అడిగాడు.

అతడి కంఠస్వరం ఎంతో ఆర్ద్రంగా పలికింది. షోడశి చకితురాలై పోయి, ఓ క్షణం ఆగి, "ఇక్కడ అందరి దృష్టిలో నన్ను కళంకినిని చేశారు. లోగడ మా అమ్మను మోసగించారు. ఇప్పుడు మీ మోసంలో నేను పడను," అన్నది

"కావాలని నిన్నేనాడూ నేను మోసగించలేదు, అలకా!" అని జీవానందుడు కొంత ప్రసాదం వదిలి, షోడశి వెనకగా పెరట్లోకిపోయి చేతులు కడుక్కుని, "ఆనాటి రాత్రి జరిగిన సంఘటన నా మనసులో ఎప్పుడూ మెదులుతూనే వున్నది నౌకర్ల

దగ్గరికి పంపుతానన్నప్పుడు, నీవు చేతులు జోడించి ఏడ్చిన ఏడ్పూ, ప్రార్థనా - నేను బతికుండగా మరిచిపోలేను," అన్నాడు.

"ఇంతకూ వచ్చిన పని చెప్పారుకాదు," అన్నది షోడశి ఇంట్లోకి వచ్చి.

"పనా ? పనేం లేదు. సరేకాని, అలకా ! నీకు మళ్లీ రెండోసారి పెళ్ళయిందా?" అని అడిగాడు జీవానందుడు ఆమె వెనగ్గా లోపలికి వచ్చి.

"నాకు నిజమైన పెళ్ళి ఒక్కసారే జరిగింది. నాతోపాటు అమ్మ మీకు డబ్బు కూడా యిచ్చింది. మీరు డబ్బు తీసుకున్నారుగాని, నన్ను తిరస్కరించారు. ఎక్కడో దాక్కున్నారు," అన్నది షోడశి.

జీవానందుడు చాపమీద కూర్చుని, ఒకటిరెండు నిమిషాలు మౌనంగా వూరుకుని, "అలకా ! నే నంత దుర్మార్గుణ్నికాదు. అప్పట్లో నే నొక ఆడమనిషి గొలుసు దొంగిలించాను. నీతో వివాహానికి ఒప్పుకుంటే, మీ అమ్మ యిస్తానన్న వందరూపా యిలతో, ఆ ఆడమనిషిని తృప్తిపరచాలని చూశాను. కాని, అది సాధ్యంకాక ఆ రాత్రే జైలుకు పోవలసివచ్చింది. అక్కణ్నించి బయటపడ్డతరవాత, పాత దొంగతనానిగ్గాను మరోసారి రెండేళ్ళ జైలు. ఆ శిక్ష పూర్తయి బయిటికి వచ్చాక, మా మేనమామ చావుతో నాకు బీజపుర జమీందారీ సంక్రమించింది. ఆ తరవాత జరిగిందేమిటో నీకు తెలుసు," అన్నాడు.

షోడశి ఏమీ మాట్లాడలేదు. జీవానందుడు కొంచెంసేపు వూరుకుని, "ఎంత రాత్రయి వుంటుంది, అలకా ?" అని అడిగాడు.

"బాగా పొద్దుపోయినట్టుంది," అన్నది షోడశి.

"ఈ చీకటిలో ఇంటికి పోనవసరంలేదు," అన్నాడు జీవానందుడు.

"కంబళి పరుస్తాను, విశ్రమించండి."

"విశ్రమించటమా ? ఇక్కడా ?" అన్నాడు జీవానందుడు ఆశ్చర్యంగా.

"అవును, అందులో తప్పేముంది ?"

"జమీందారు ఇక్కడ కంబళీమీద పడుకోవటం అంటే - ఎంతకష్టం !" అన్నాడు జీవానందుడు.

"ఆ కష్టం అనుభవిస్తేనే, బీదవాళ్ళ కష్టాలేమిటో అర్థమవుతాయి," అన్నది షోడశి.

జీవానందుడు మాట్లాడలేదు. ఎందుకో అతడి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. షోడశి జీవానందుడు భోజనంచేసిన విస్తరి బయటపారేసి, వంటఇంటి పనులు ముగించి వచ్చేసరికి, జీవానందుడు, షోడశి చించిపారేసిన వుత్తరాన్ని రెండోసారి చదువు




తున్నాడు. షోడశి వస్తున్న అలికిడి వింటూనే అతడు తల ఎత్తి, "వుత్తరం పూర్తిగా రాసినట్టులేదు. ఇందులోని నరపిశాచం ఎవరో అర్థమవుతూనే వుంది ఆ పిశాచి సంహారానికి నీవు వేడుకుంటున్న దేవత ఎవరో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"ఆ పేరు విన్నంత మాత్రాన మీ కొచ్చే లాభమేమిటి?" అన్నది షోడశి

"ఆత్మరక్షణకు ఏదయినా ఉపాయం ఆలోచించవచ్చుగా!" అన్నాడు జీవానందుడు.

"నేనూ ఆత్మరక్షణ చేసుకోవలసిన అవసరం కలిగేలావుంది. అందువల్ల ఆయన పేరు మీకు చెప్పను," అన్నది షోడశి.

జీవానందుడు కొంచెంసేపు ఆలోచించి, "అలకా! నువు చెప్పకపోయినా, ఆ వీర పురుషు డెవరో నాకు తెలియకపోలేదు. సరాసరి వుత్తరం ఆయనకే రాయక, ఆయన భార్యపేర ఎందుకు రాశావు? రాసినా దానిని ఎందుకు చించేశావు?" అన్నాడు కోపంగా.

"మరో వుత్తరం రాసిపంపాను," అన్నది షోడశి.

"జనార్దన్ రాయ్ బాబుకు నీ మీద అంత అసహ్య మెందుకో యిప్పుడు నా కర్థమైంది!" అన్నాడు జీవానందుడు, షోడశి ముఖంకేసి తీవ్రంగా చూస్తూ.

తనమీద మరో కళంకాన్ని జీవానందుడు రుద్దబోతున్నాడని షోడశి గ్రహించి, "ఆ అర్థమైందేదో చెప్పండి." అన్నది.

"ఆరాత్రి గాలివానలో, రాయ్‌బాబు అల్లుణ్ణి చేయిపట్టుకుని నదిదగ్గరినుంచి

మామగారి ఇంటికి తీసుకుపోయి వదిలావు ఈసంగతి గ్రామమంతా తెలుసు," అన్నాడు జీవానందుడు

షోడశి ఓక్షణంసేపు తలవంచుకుని, "అంతా తెలుసుకున్నారు గనక, యిప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి," అని అడిగింది.

"నువ్వు యీ భైరవీ పదవిని వదులుకుని ఎక్కడికైనా వెళ్ళిపోవటమే మంచిది. అదే నాఅభిప్రాయం – తీర్పు." అన్నాడు జీవానందుడు.

"సరే, అలాగేపోతాను. ఇక చండీదేవి ఆలయపు బాగోగులభారం అంతా మీదే :" అన్నది షోడశి.

ఆమాటతో జీవానందుడు మరింతగా మండిపడుతూ, "మరి బారిస్టరు నిర్మలబాబు సంగతేమిటి ?" అన్నాడు.

"ఆయన పేరెత్తకండి :" అన్నది షోడశి కోపంగా.

జీవానందుడు కాస్త శాంతపడ్డాడు. షోడశి తలుపుతెరచి బయిటికి తొంగిచూసి, "తెల్లవారుఝాము కావస్తున్నది, తమరిక ఇంటికి దయచేయండి," అన్నది.

జీవానందుడు చిన్నపిల్లవాడు మారాంచేస్తున్నట్టుగా, "నాసంగతి కూడా చెప్పనిమ్... నేనేమైనా తప్పుచేస్తే అదికూడా తెలుసుకోవాలని వున్నది," అన్నాడు.

"మీకాళ్ళు పట్టుకుంటాను – మీరికవెళ్ళండి. నేను నదికి స్నానానికి పోవాలి," అంటూ షోడశి, జీవానందుడు ఎంతవారించినా ఆగకుండా, వీధితలుపు తెరిచి గబగబా బయిటికి వెళ్ళిపోయింది.

## 6

షోడశి తనభార్యపేర రాసిన ఉత్తరం అందగానే నిర్మలుడు బయలుదేరి చండీఘడ గ్రామం వచ్చాడు. ఆ ఉత్తరంలో షోడశి, తనను జమీందారూ మరికొందరూ కలిసి భైరవిపదవినుంచి తొలగించే ప్రయత్నాలు చేస్తూండడమేగాక, బీదాబిక్కీ చేసుకుంటున్న చండీదేవి మాన్యాలుకూడా ఆక్రమించ జూస్తున్నారని తెలియపరిచింది. అవసరం అయితే, ఈవిషయాల్లో కోర్టులో దావావేయవలసి వుంటుందనీ, అందుకు నిర్మలుడి సహాయం అవసరం అనీ – హైమవతికి రాసింది.

నిర్మలుడు హఠాత్తుగా మళ్ళీ రావటం, జనార్దనరాయినిగాని, యితర గ్రామ పెద్దల్నిగాని అంతగా ఆశ్చర్యపరచలేదు. షోడశి పట్టుదలా, ధైర్యంగల మనిషనీ, అవసరం అనుకుంటే హైకోర్టువరకూ వెళ్ళగలదనీ, వాళ్ళు లోగడే అనుమానించారు.

నిర్మలుడు ఓ మధ్యాహ్నంవేళ గ్రామంచేరి, మామగారి మాటలద్వారా పరిస్థితులు

తీవ్రదశను చేరుకుంటున్నవని గ్రహించటమేగాక, తను రావటం ఎవరికీ యిష్టం లేదనికూడా అర్థంచేసుకున్నాడు.

సంధ్యాసమయంలో చండీదేవికి హారతి జరుగుతున్నది. గదిలో కూర్చునివున్న నిర్మలుడికి, శంఖమూ, డమరుకా, నగారాచేసే ధ్వనులు వినిపించసాగినై. అతడు లేచి మందిరంకేసి వెళ్ళాడు. మందిర ప్రాంగణంలో చిన్న సభలాటి దొకటి జరుగుతున్నది. అక్కడ అంతగా వెలుగులేదు. ఒకవ్యక్తి నిలబడి హేళనాస్వరంతో, షోడశి తల్లినిగురించి మాట్లాడుతున్నాడు. కంఠస్వరాన్నిబట్టి, ఆమాట్లాడే మనిషి జీవానందచౌధురి అని నిర్మలుడు గ్రహించాడు. అతడికిక ఆసభలోకి వెళ్లాలని బుద్ధి కలగలేదు.

నిర్మలుడు ఒకటిరెండు నిమిషాలు సభకు అంతదూరంలో నిలబడి, యిక ఇంటికి తిరిగిపోదాం అనుకునేంతలో, ఆ చీకటిలో ఆపాదమస్తకం ముసుగువేసుకున్న ఓ స్త్రీ, అతడి వీపుతట్టి బయిటికి రమ్మన్నట్టు సౌంజ్ఞచేసింది. నిర్మలుడు ఆమె వెనకగా బయలుదేరాడు. ప్రాంగణందాటి వీధిలోకి రాగానే ఆ స్త్రీ ముఖంమీది ముసుగు తొలగించింది. ఆమె షోడశి.

"దిక్కులేని యిద్దరాడవాళ్ళనుగురించి వాళ్ళు మాట్లాడే నీచాన్ని ఏం వింటారు! అందులో ఒకావిడ బతికేలేదు. పదండి! ఫకీరుబాబా, యీ సాయంకాలమే వచ్చారు. వారిని ఇంట్లో కూర్చోబెట్టి వచ్చాను," అన్నది షోడశి.

షోడశి పక్కనే నడుస్తూ, నిర్మలుడు ఆమె ఇల్లు చేరాడు. తీరా ఇంట్లోకిపోయి చూస్తే ఫకీరు లేడు. "ఎక్కడికో వెళ్ళి వుంటారు. త్వరలోనే తిరిగి రావచ్చు, కూర్చోండి!" అంటూ షోడశి, నిర్మలుడు కూర్చునేందుకు చాప పరిచింది.

నిర్మలుడు కూర్చున్నాడు. షోడశి మినుకు మినుకుమనే దీపం వత్తిని కాస్త పెద్దదిగా చేసి, "నిర్మల్‌బాబూ, జమీందారుతోనూ, గ్రామ పెత్తందార్లతోనూ దావాల్లోకి దిగటం తప్పనిసరైతే, అందుకవసరం అయిన సాయమంతా మీరు చేస్తారనుకోండి. ఒక వేళ నేను ఓడిపోవటం జరిగితే-అప్పుడు యీ నిరాధారురాలికి మీరు తప్పక ఆశ్రయం కలిగిస్తారు గదూ?" అన్నది.

"ఓడిపోవటం అనేది జరగదు," అన్నాడు నిర్మలుడు.

షోడశి కొంచెం సేపు మాట్లాడకుండా వూరుకుని, "ఒక వేళ నేనే హైమనై వుంటే, యిటువంటి పరోపకారం చేయటానికి ఒప్పుకునేదాన్ని కాదు రాత్రింబవళ్ళు మిమ్మల్ని నా కళ్ళెదటే వుంచుకునేదాన్ని," అన్నది

నిర్మలుడికి యీ మాటలు ఎక్కడలేని ఆనందమూ, కొంచెం భయమూ కలిగిం

చాయి. అతడు షోడశికేసి కన్నార్పకుండా చూస్తూ, "కళ్ళముందు వుంచుకున్నంత మాత్రాన కలిగే ప్రయోజనం ఏముంది, షోడశీ! హఠాత్తుగా కలిసి ఏకమయే హృదయ బంధనాలు ఆ కళ్ళకు కనిపించవుగదా!" అన్నాడు.

షోడశి నవ్వుతూ, "అదీ నిజమే!" అని, వాకిట్లో చప్పుడవటంతో అటు కేసి చూసి, "మీరూ వచ్చారా?" అన్నది.

నిర్మలుడు వాకిలికేసి చూడకుండానే, "ఫకీరుబాబా వచ్చారా?" అన్నాడు.

"కాదు, జమీందారుబాబు!" అంటూ షోడశి వాకిలిదగ్గరకుపోయి, "రండి, రండి మీ రాకవల్ల యీ యిల్లు మరోసారి పవిత్రమైంది," అన్నది.

జీవానందుడు లోపలికివచ్చి నిర్మలుణ్ణి చూస్తూనే, "మీ మామగారు మీరుకూడా దేవీ మందిరం దగ్గరకు వస్తారని చెప్పారు. అక్కడే కలుసుకోగలనని ఆశించాను," అన్నాడు.

నిర్మలుడు జవాబివ్వబోయేంతలో షోడశి అందుకుని, "బారిస్టరుబాబు అక్కడికి వచ్చారు. కాని, మీవంటి ఉత్తమ పురుషుల ప్రసంగం వినకుండా నేనే వారిని ఇక్కడికి లాక్కొచ్చాను," అన్నది.

మనసులో ద్వేషం ఉబుకుతున్నా జీవానందుడు పైకి సహజంగా కనబడే కంఠ స్వరంతో, "అలా అయితే, నేనిక్కడికి అసమయంలోవచ్చి, మీ సంభాషణకు అంతరాయం కలిగించాననుకుంటాను!" అన్నాడు.

"అలాంటిదేమీ లేదులెండి!" అని షోడశి గదిలోకిపోయి ఒక బైండుపుస్తకమూ, తాళంచేతుల గుత్తితెచ్చి, జీవానందుడితో, "ఇవి తీసుకోండి. అమ్మవారి అలంకారపు బంగారువస్తువులూ, మాన్యాలకు సంబంధించిన దస్తావేజులూ—అన్నీ పెట్టెలోవున్నై. అందులోనే భైరవిగా నాకున్న బాధ్యతలూ, అధికారం వదులుకుంటున్నట్టు రాసిన పత్రంకూడా వున్నది," అన్నది.

నిర్మలుడు ఆశ్చర్యపోయి, "మీరు భైరవిపదవి వదిలిపెడుతున్న సంగతి నాకే మాత్రం తెలియదు! ఇదంతా పరిహాసం కాదుగదా?" అన్నాడు.

"కాదు. మా తల్లీకూతుళ్ళనుగురించిన అపవాదులు దేశమంతా ప్రచారం జరిగిపోతున్నవి—నేను నిజంగానే భైరవిపదవినుంచి తప్పుకున్నాను," అన్నది షోడశి.

"అయితే, యిక నేను వెళతాను," అన్నాడు నిర్మలుడు.

"ఇంటికెప్పుడు వెళతారు?" అని అడిగింది షోడశి.

"ఇక్కడ యిక పనేంలేదుగా—రేపే బయలుదేరి పోతాను," అన్నాడు నిర్మలుడు.

"హైమకూ, పిల్లవాడికీ నా ఆశీర్వచనాలు చెప్పండి!" అన్నది షోడశి.

నిర్మలుడు లేచి జీవానందుడికీ, షోడశికీ నమస్కరించి బయిటికి నడిచాడు. అవమానం పొందినట్టుగా అతడి మనసు బాధపడసాగింది. కాని, అతడి హృదయంలో ఒకరకం తృప్తికూడా వున్నది. స్వేచ్ఛాచారిణి అయిన భైరవి మోహబంధంలో పడకుండా తనను తాను కాపాడుకున్నాననీ, హైమకు జరగబోయే అన్యాయం ఏ దేవి కృపవల్లనో తప్పిపోయిందనీ అతడు భావించాడు.

నిర్మలుడు వెళ్ళిపోగానే షోడశి, జీవానందుడికేసి తలతిప్పి, "రాత్రి చాలా పొద్దుపోయింది. మీరిక ఇంటికి వెళ్ళండి," అన్నది.

జీవానందుడు బొంగురుపోయిన గొంతుతో, "నువ్వు నిజంగా చండీఘడం వదలదలిచావా? నా ముఖంచూసి చెప్పు!" అన్నాడు.

"ఎప్పుడు వెళ్ళటమో నేనింకా నిశ్చయించుకోలేదు. అన్నీ అనుకూలంగా ఉంటే రేపే వెళతానేమో," అన్నది షోడశి.

"అలకా! నాలాగే నువ్వూ పొరబడి వుండవచ్చు. నా మనసులోని సంగతి నువ్వు గ్రహించినట్టులేదు," అన్నాడు జీవానందుడు.

"అంతే అయుంటుంది. ఏది ఏమైనా నా నిర్ణయంమాత్రం మార్చుకోను," అన్నది షోడశి.

"నా జుట్టంతా తెల్లబడిపోతున్నది. వయసు ఉడిగి ముసలితనం మీదపడుతున్నది. ఈ స్థితిలో నేను చేతులుపట్టి నిన్ను ప్రార్థిస్తానని అనుకుంటున్నావా, అలకా?" అని అడిగాడు జీవానందుడు.

"చూడండీ! ఎంతో రాత్రయిపోయింది. నేనింతవరకూ పూజకూడా చేసుకోలేదు," అన్నది షోడశి.

బయట ముసలి పూజారి దగ్గూ, పాదాలచప్పుడూ వినిపించింది. షోడశి ద్వారంకేసి చూసింది. పూజారి బయట చీకట్లోనే నిలబడి, "అమ్మగారూ! అందరిముందూ గుడితలుపులు వేసి, తాళంచేతులు తారాదాస చక్రవర్తిగారి కిచ్చాను. జనార్దనరాయ్ బాబూ, శిరోమణిబాబూ అప్పుడక్కడే వున్నారు," అన్నాడు.

"మంచిపని చేశావు. మన భారం దిగిపోయింది. నేను సాగరుణ్ణీ, హరిహరుణ్ణీ కలుసుకోవాలి. నువ్వు నాకు తోడుగారావాలి" అని, షోడశి కదిలింది.

జీవానందుడు చాపమీంచి లేచి నిలబడి, "ఈ లెక్కల పుస్తకం, తాళంచేతులూ జనార్దనరాయ్‌బాబుకు పంపు," అన్నాడు.

"నేనలా చేయలేను. దేవి నగలున్న పెట్టె తాళంచేతులు, నా చేతుల్తో మరొకరి కిచ్చి, వారిని నమ్ముతూ కూర్చోలేను," అన్నది షోడశి

"అయితే, నేను నమ్మకం అన్నమాట!" అన్నాడు జీవానందుడు

షోడశి జవాబేమీ చెప్పకుండా ఇంటితాళం తీసుకుని బయిటికి వెళ్ళింది జీవానందుడు కూడా ఆమె వెనకగా బయిటికి వచ్చాడు షోడశి తలుపుకు తాళంవేసి వెనుదిరిగి చూడకుండా, పూజారితోకలిసి వెళ్ళిపోయింది. జీవానందుడు ఇంటిముందు చీకట్లో భూతంలా నిలుచుండిపోయాడు.

# 7

జమీందారు జీవానందుడుంటున్న శాంతికుంజానికి, ఒక సంధ్యాసమయపువేళ, అతడి వేలువిడిచిన తమ్ముడు ప్రఫుల్ల దొచ్చాడు. ఈ ప్రఫుల్లుడు జీవానందుడికి జమీందారీ మేనేజిమెంట్ వ్యవహారాల్లో సాయపడుతూంటాడు.

ప్రఫుల్లుడు బీజపుర వ్యవహారాలు ఎలావున్నదీ జీవానందుడికి చెప్పి, నౌకరును సారాయి తెమ్మని పురమాయించాడు. నౌకరు రెండు గ్లాసుల్లో సారా తెచ్చి వాళ్ళ ముందు పెట్టాడు. జీవానందుడు సారాగ్లాసును పక్కకు నెట్టుతూ, "టీ తీసుకురా," అని నౌకరును ఆజ్ఞాపించాడు.

ఈ వింతప్రవర్తనకు ప్రఫుల్ల డాశ్చర్యపోయి, "హఠాత్తుగా యీ అమృతంమీద యింత విరక్తి నీకెందు కు కలిగిందన్నయ్యా?" అన్నాడు.

"విరక్తో కాదో నాకు తెలియదు, ఇక నేను తాగను," అన్నాడు జీవానందుడు.

ప్రఫుల్లుడు నవ్వి వూరుకున్నాడు. తన అన్న యిలాంటి ప్రతిజ్ఞలు అప్పుడప్పుడూ చేస్తూండటం అతడికి తెలుసు. నౌకరు టీతెచ్చి టేబిల్‌మీద పెట్టగానే, జీవానంధుడు దా న్నందుకుని తాగి, తమ్ముడితో, "నేనటు దేవీమందిరంకేసి వెళ్ళొస్తాను," అంటూ లేచాడు.

"పిస్తలు జేబులో వేసుకున్నావా?" అని అడిగాడు ప్రఫుల్లుడు.

"దాని అవసరం యిక నాకు లేదు!" అంటూ జీవానందుడు గదినుంచి బయిటికి వచ్చి గ్రామంకేసి బయలుదేరాడు.

క్రమంగా చీకటి కమ్ముకుంటున్నది. అతడు నడుస్తున్న దారికి పక్కగా ఒక వైపున బారుయినది, రెండవవైపున బీడుపడ్డ పొలాలు. నదినుంచి చిన్న కాలవ త్వ్విస్తే పొలాలు మాగాణి వ్యవసాయానికి లాయకియై, బీదరైతుల ఆకలిబాధను తీర్చగలవు. 'ఇంతకాలంనుంచీ నేనీ విషయం ఎందుకని ఆలోచించలేదు?' అనుకున్నాడు జీవానందుడు. అతడి హృదయంలో పశ్చాత్తాపం మొలకెత్తింది.

జీవానందుడు దేవీమందిరం చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అతడు మందిర ప్రాంగణందాటి, మందిరం ముందున్న వసారాలోకి వచ్చేసరికి, అక్క



డున్న స్తంభాలచాటున ఎవరో గుసగుసలాడటం అతడి చెవినిపడింది. జీవానందుడు ఒక స్తంభంచాటున చీకట్లో నిలబడి వాళ్ళమాటలు వినసాగాడు.

"మన తల్లిని సర్వనాశనం చేసినవాణ్ణి—సర్వనాశనం చేయకుండా విడవ కూడదు!" అన్నా డొకడు.

"చండీదేవి గుమ్మం పట్టుకుని ప్రమాణంచేస్తున్నాను, బాబాయ్! ఈ ప్రయత్నంలో నేను ఉరికంబం ఎక్కవలసివచ్చినా భయపడను," అన్నా డింకొకడు

"ఆ భయం మనిద్దరికీ లేదు. ముందు అమ్మను ఈ గ్రామం వదిలిపోనీ ఆమె వెళ్ళిపోవాలని చాలా పట్టుదల్లోవుంది," అన్నాడు మొదటివాడు.

ఆ రెండు కంఠస్వరాల్నీ జీవానందుడు పోల్చుకున్నాడు. వాళ్ళు హరిహరుడూ, సాగరుడూ. వాళ్ళిద్దరికీ షోడశి అంటే తల్లితో సమానం. వాళ్ళవెనక గూడెంలోని బీదప్రజంతా వున్నది.

జీవానందుడు అక్కణ్ణించి కదలి కొంచెం ముందుకుపోయి, గర్భగుడికి ఎదురుగా వున్న హాల్లో ఒకపక్కగా కూర్చున్నాడు. ఓ పావుగంట గడిచింది. గర్భగుడిలోంచి షోడశి బయిటికిరావటం అతడి కంట బడింది. జీవానందుడు కూర్చునే, "అలకా!' అని పిలిచాడు.షోడశి అతడి కంఠస్వరాన్ని గుర్తించి, గబగబా అతడి దగ్గరకొచ్చి, "మీరిక్కడ ఎందుకూర్చున్నారు?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"ఏమో! ఊరికే కూర్చున్నాను. గ్రామం విడిచి పోయేముందు దేవికి పూజ చేయటానికి వచ్చావా? సరే, పద నేనూ ఇంటికివస్తాను," అంటూ ఆమెవెంట బయలు దేరాడు

ఇద్దరూ ఇంటిని సమీపించేసరికి, ఇంటిముందు విడిచివున్న ఎద్దుబండి ఒకటి జీవానందుడికి కనిపించింది. బండివాడు షోడశిని గుర్తించి, "అమ్మా, మనం త్వరగా బయలుదేరకపోతే, శైవాన్‌దీఘి చేరేసరికి రేపు మధ్యాహ్నంకూడా దాటిపోతుంది," అన్నాడు.

"త్వరగానే బయలుదేరదాం," అని షోడశి, జీవానందుడికేసి తలతిప్పి, "నేనెక్కడికివెళ్ళేదీ మీరు విన్నట్టున్నారు ?" అన్నది.

"ఆఁ, విన్నాను. నీమీద నాకేం కోపంలేదు," అన్నాడు జీవానందుడు

షోడశి తలుపు తెరిచి ఇంట్లోకి వెళ్ళి, దీపం వెలిగించి, చాప ఒకటి తెచ్చి పరిచింది. జీవానందుడు కూర్చున్నాడు. ఒకటిరెండు నిమిషాలు గడిచినా అతడేమీ మాట్లాడలేదు. షోడశి అతడి కెదురుగా నిలబడి,

"మీరిక చండీఘడం వదిలిపెట్టి వెళ్ళండి," అన్నది.

"ఎక్కడికి వెళ్ళమంటావో చెప్పు ?" అన్నాడు జీవానందుడు

"తమ ఇంటికి, బీజపురానికి."

"అలాగే వెళతాను. కాని, వెళ్ళేముందు చేయవలసిన కొన్ని పనులున్నాయి నదినుంచి నీరు చుట్టుపక్కల పొలాలకు సరఫరా అయ్యేట్టు చిన్న కాలవ ఒకటి తవ్వించవలసి వుంది. ఊరి పెత్తందార్లు లాక్కున్న భూముల్ని తిరిగి పేదరైతులకు ఇప్పించే పనొకటి పెట్టుకున్నాను. ఇవన్నీ పూర్తిచేసిగాని, బీజపురం పోను. నువ్వు ఎక్కడో దూరప్రాంతానవున్న కుష్ఠురోగుల శరణాలయానికి నర్స్ పని చేసేందుకు పోవటం ఏమిటి ?" అన్నాడు.

"నే నిక్కడ బాధ్యతలన్నీ వదులుకున్నాక, ఎక్కడికి పోతేనేం," అన్నది షోడశి.

జీవానందుడు మాట్లాడేలోపలే బయిటినుంచి బండివాడు, "అమ్మా, పొద్దు పోతున్నది, మనం త్వరగా బయలుదేరాలి," అని కేక పెట్టాడు.

షోడశి, "ఇదిగో, వస్తున్నా," అంటూ బయలుదేరింది. ఆమె వెనకగా జీవానందుడు నడిచాడు. షోడశి తలుపుకు బయిట గొళ్ళెంమాత్రం పెట్టి, బండిదగ్గరకు పోయి ఎక్కి కూర్చున్నది.

జీవానందుడు చిన్న గొంతుతో, "అలకా! మీ అమ్మ ఒకనాడు నిన్ను నాకు ఒప్పగించింది. కాని, నేను నిన్ను హృదయంలో భద్రపరచుకోలేకపోయాను," అన్నాడు.

ఈ మాటలకు ఏం జవాబు చెప్పాలో షోడశికి తోచలేదు. ఆ మాటల వెనక వున్న మానసిక వ్యాకులత ఆమెకు బాగా అర్థమై, హృదయాన్ని కదిలించివేసింది.

బండి కదిలింది. షోడశి ఏమీ మాట్లాడకుండా తలవంచుకున్నది. జీవానందుడు వున్నచోటనే స్థాణువులా అయిపోయి, చీకట్లో దూరమవుతున్న బండికేసి చూస్తూ వుండిపోయాడు

* * *



ఒకనెల గడిచింది. జీవానన్దుడు పట్టణంనుంచి ఒక ఇంజనీరును పిలిపించి బారుయీా నదినుంచి, దాపులవున్న పొలాలవైపుకు ఒక పంటకాలవ తవ్విస్తున్నాడు. కాని, అది వర్షాకాలం అవటంవల్ల పని అంత వేగంగా సాగటంలేదు. జీవానందుడు తన శాంతికుంజం వసారాలో మంచంమీద కూర్చుని, దూరంగా కూలివాళ్ళు చేసే తవ్వకపు పనులుచూస్తున్నాడు. దూరంగా వున్న కొండలమీద భారీగా వర్షాలు పడటంతో నది నిండుగా ప్రవహిస్తున్నది.

ఒక పడవ నది దిగువకు వేగంగా వస్తూండటం జీవానందుడి కంటబడింది. ఆ పడవలోవాళ్లు ఎవరైవుంటారా అని అతడు ఆలోచించేంతలో పడవ ఒడ్డు పట్టింది. కళాసొకడు పడవను ఒడ్డునున్న చెట్టు మొదలుకు తాడుతో కట్టివేశాడు.

పడవలోంచి ఇద్దరు మగవాళ్లూ, ముగ్గురు స్త్రీలూ దిగి ఒడ్డుమీదికి రావటం జీవానందుడు చూశాడు. వాళ్ళల్లో జనార్దనరాయ్‌ని అతడు గుర్తించాడు. బహుశా ఆ స్త్రీలు ఆయన భార్యా, కుమార్తె- మరెవరో బంధువురాలూ అయుంటుందనుకుని, కొంచెం నిద్రమత్తుగా వుండటంతో, మంచంమీద పడుకుని, దిండును బాగా తల కిందికి లాక్కుని కళ్ళు మూసుకున్నాడు.

ఓ పావుగంట గడిచీగడవకముందే అతడి తలదగ్గర చిన్న చప్పుడైంది. జీవానందుడు కళ్లు తెరవకుండానే, "ఎవరూ ?" అని ప్రశ్నించాడు.

ఆ వచ్చిన వ్యక్తి, "నేనే !" అంటూ తలవైపున నేలమీద కూర్చుని అతడి నుదుటిమీద చేయి వేసింది.

జీవానందుడు ఆ కంఠస్వరం గుర్తించి చేయి పట్టుకుని నువ్వా! నువ్వుకూడా ఆ పడవలోనే వచ్చావా? అన్నాడు ఆశ్చర్యంగా

అవును, అన్నది షోడశి.

"జనార్దన్‌రాయ్, నిన్ను వెతికి తీసుకువచ్చినట్టుంది. దేవాలయ భూముల విషయంలోగాని, బీదలు సాగుచేసుకుంటున్న భూముల విషయంలోగాని, నాతో ఏదైనా రాజీ కోరుతున్నాడా?" అన్నాడు జీవానందుడు మంచంమీద లేచి కూర్చుంటూ.

"మీరు బాగా గ్రహించారు. జనార్దనబాబూ, ఇతర గ్రామ పెత్తందార్లూ, తా మాక్రమించిన భూములు వదులుకోవటమేగాక, బీదరైతుల మీద వేసిన దావాలు కూడా ఎత్తివేసుకోవటానికి సిద్ధంగా వున్నారు. అందరూ మీ తీర్పును శిరసావహిస్తామంటున్నారు," అన్నది షోడశి.

"అయితే, యిక నేను చేసేదేమీలేదు. అంతా నువే చేసేశావు," అన్నాడు జీవానందుడు తృప్తిగా.

"ఇంకా నేను చేయవలసింది కొంత వున్నది. పడవ సిద్ధంగా వున్నది. మిమ్మల్ని యీ అనారోగ్య స్థితిలో ఒక మంచి ప్రదేశానికి తీసుకుపోయి వుంచగలిగానంటే మిగిలిన ఆ కాస్త పనికూడా పూర్తయినట్టే!" అన్నది షోడశి.

"బాగానేవుంది, అలకా! అయితే ఆలస్యం ఎందుకు, జమీందారీ భారంకూడా నువే వహించరాదా?" అంటూ జీవానందుడు సంతోషంగా లేచినిలబడి షోడశి చేయిపట్టుకున్నాడు.

ఆనందంతో షోడశి కళ్ళు నీళ్ళతో నిండిపోయినై. ఆమె కాళ్ళకింద భూమి కంపించింది. ఆమె జీవానందుడి చేతిని నొక్కుతూ నవ్వి, "పదండి. పడవమీద కూర్చున్నాక జమీందారీ వ్యవహారాల్లో ఏ ఏ అధికారాలు నా కివ్వాలో, ఏవేవి మీరుంచుకోవాలో ఆలోచిద్దాం," అన్నది.

"సరే, పద!" అంటూ జీవానందుడు, షోడశి చేయి పట్టుకుని నదికేసి నడిచాడు.





# అతకని బ్రతుకులు

డి.కామేశ్వరి

**అం**తవరకు కబుర్లతో, నవ్వులతో నిండిన మెస్ వరండా ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయింది. కెప్టెన్ మల్హోత్రా, మేజర్ రణధీర్‌సింగ్, లెఫ్టినెంట్ కల్నల్ జైటీ, లెఫ్టినెంట్ చుగాని అందరూ గుడ్‌నైట్ చెప్పి ఎవరి టెంట్లకి వారు వెళ్ళిపోయారు.

మేజర్ రావు, కెప్టెన్ మూర్తి మాత్రం మిగిలారు.

మెస్ వరండాలో పెట్రోమాక్స్ చుట్టూ దీపం పురుగులు చుట్టుముట్టి ఎగురుతున్నాయి. దూరంగా కీచురాళ్ళ రొద... లోపల ప్లేట్లు, గ్లాసులు కడిగే శబ్దం, కుర్చీలు, బల్లలు సర్దే చప్పుళ్ళు...దూరంగా వంటశాలల్లో పనివాళ్ళ మాటలు...

రావు మూడోగ్లాసు పూర్తి చేసి, నాలుగోసారి వెయిటర్ని పిలిచాడు. మూర్తి చదువుతున్న మేగజేన్‌లోంచి తలెత్తి చూశాడు. వాచి చూశాడు పన్నెండవుతూంది. వెయిటరు రావు గ్లాసునింపి వెళ్ళాడు.

"కమాన్ లెటజ్‌గో రావ్. ఇటీజ్ టూమచ్ ఫర్ టు డే" అన్నాడు మూర్తి రావు గ్లాసువంక చూస్తూ.

రావు జవాబీయలేదు. రావు ఇప్పట్లో లేచే లక్షణాలు కనపడలేదు మూర్తికి. రావ్‌ని బలవంతంగా లేపకపోతే అలా గ్లాసుమీదగ్లాసు వంటిమీద తెలివివున్నంత

వరకు తాగుతాడని మూర్తికి తెలుసు. అందుకే "రావ్...వెడదాం...పన్నెం డయింది" లేచి నుంచుని అన్నాడు మూర్తి.

"యూ కెన్ గో..." రావు గ్లాసు లోంది ఓ గుటక మింగి, సిగరెట్ దమ్ము లాగి, కుర్చీ కమ్మీమీద తల ఆన్చి, పైకి రింగురింగులుగా పొగ వదులుతున్నాడు.

"టైం చాలా అయింది రావ్!" మళ్లీ అన్నాడు మూర్తి. రావ్ వినడంలేదు.

రావుని అలా ఒక్కడినీ వదిలి వెళ్ళి పోడానికి మూర్తి మనసు వప్పలేదు. తను వెళ్ళిపోతే...అలా గ్లాసుమీదగ్లాసు తాగి అలా కుర్చీలో వాలిపోతే మెస్ వెయిటర్లు రావ్ జీపుడ్రైవర్ని పిలిచి సాయం పట్టి జీప్‌లో కూలేస్తారు ... డ్రైవరు టెంట్‌కి చేర్చి ఆర్డర్లీకి అప్పచెపుతాడు... ఆర్డర్లీ దొరగారి బూట్లువిప్పి పక్కమీదకి చేరేసి దగ్గు కప్పుతాడు...తెల్లారేవరకు రావు యీ లోకంలోకి రాడు.

అలా చాలాసార్లు జరిగింది.

లేకపోతే మరీ వంటిమీద తెలివి తప్పనినాడు – అంటే ఏ రెండు పెగ్‌లో మాత్రమే తాగిననాడు తనే డ్రైవ్ చేసు కుంటూ వెడతాడు జీప్. ఆ రోజు ఖర్మ కాలి జీప్‌లో ఎవరన్నా వుంటే ప్రాణా లరచేతిలో పెట్టుకుంటూరు గమ్యం చేరే వరకు.

ఓసారి...రావ్ సంగతి పూర్తిగా అనుభవంలోకి రాలేదు అప్పటి కింకా మూర్తికి.

ఆ రోజు తమ క్యాంప్‌కి పదిమైళ్ళ దూరంలోవున్న యూనిట్‌లో ఏదో పార్టీ జరిగింది. పార్టీ అయ్యేసరికి రాత్రి పన్నెండయింది. వచ్చేటప్పుడు రావ్ జీప్‌లో ఎక్కాడు తను. రావ్ ఆరోజు లిమిట్స్ దాటలేదు రావ్ జీప్ వదలడమే ఏభై మైళ్ళ స్పీడ్‌లో వదిలాడు. ఏభై... ఏభై ఐదు...మామూలు రోడ్డుమీద తను అంత గాభరాపడలేదు. కాని ఘాట్ రోడ్డు ఎక్కినాకూడా ఏభై ఐదు మైళ్ళ స్పీడుతో జీపు కీచుమని శబ్దంచేస్తూ, రొదచేస్తూ రావ్ చేతిలో మెలికలు తిరిగిపోతూంటే భయంవేసింది. రాత్రి...కన్నుపొడుచు కున్నా కనపడని కటిక చీకటి...ఒక పక్క ఆకాశాన్నంటే కొండలు ... ఇంకోపక్క అగాధంలాంటి లోయ! అందులో పడితే పడిన్ట్లు ఆచూకీ అయినా చిక్కదు ఎవరికి! కొండమీద సన్నని దారి..! ఎదురుగా ఏదన్నా వెహికల్ వస్తే ఎంతో జాగ్రత్తగా తప్పుకోవాలి! అలాంటి రోడ్డుమీద రావ్ స్పీడు చూస్తుంటే కళ్ళు తిరిగాయి. మలుపు తిప్పినప్పుడల్లా కింద పడతామేమో నని పించేది. "రావ్ ఏమిటిది, స్పీడుతగ్గించు, ఘాట్ రోడ్డు యిది..." రావు వినలేదు. పెదిమలు బిగబట్టి స్టీరింగ్ యిటూ అటూ తిప్పేస్తున్నాడు ఎదురుగా స్థిరంగా చూస్తూ! ఏమిటీ రావ్ యీ లోకంలో

లేదా? వంటిమీద తెలివిలేదా? ప్రాణాల మీద ఆశలేదా?...సగ్రుమని తిరిగింది జీపు...మలుపులో ఒక వెంట్రుక వాసిలో తప్పింది గాని లేకపోతే యీపాటికి లోయలో పడాల్సింది. "రావ్ స్టాపిట్!" కోపంగా అరిచాడు గట్టిగా తను. రావ్ వినిపించుకోలేదు. వళ్ళుమండి స్టీరింగ్ గట్టిగా పట్టుకుని, స్విచ్ ఆఫ్ చేసేశాడు తను. సడన్ బ్రేకుతో ఆగింది జీపు. అప్పటికి యీ లోకంలోకి వచ్చాడు రావు. ఉరిమి చూశాడు. ఆ చూపుచూస్తే జీప్ లోంచి తోసేస్తాడేమో ననిపించింది. ఎందుకావా వన్నట్టు తీక్షణంగా చూశాడు. "రావ్ ఇది ఘాట్ రోడ్డని మరచిపో యావా? ఒక్క సెకనులో తప్పింది గాని...లేకపోతే..." రావ్ కోపంగా చూశాడు. "ఇఫ్ యూ వాంట్ యు కెన్ గెట్ డౌన్!" అన్నాడు. నిర్మానుష్యమైన నడిరోడ్డుమీద అర్ధరాత్రి దిగి ఏం చేస్తాడు? భగవంతుడిమీద భారంవేసి కళ్ళుమూసుకు కూర్చున్నాడు. ఆ అనుభవంతో రావ్ జీప్‌లో వెళ్ళడం అంటే భయం తనకి. తనేకాదు రావ్ జీప్ ఎవరూ ఎక్కరు! అందరూ ఎన్నోవిధాల హెచ్చరించారు రావుని యీ విషయంలో!

రావు సిగరెట్ చేతిలో పట్టుకుని కళ్ళ మూసుకుని తల వెనక్కి వాల్చి ఏదో ఆలోచిస్తున్నాడు.

రావుని చూస్తూంటే మూర్తికి ఏదో బాధ కలుగుతూంది!!...రావ్!...ఎందుకిలా మారిపోతున్నాడు! యిదివరకటి రావుకి యీ సంవత్సరంనించి మారిన రావ్‌కి ఎంత తేడా! ఎందుకిలా మారిపోతున్నాడు? ఎందుకిలా తయారయ్యాడు?!

ఎన్నోసార్లు వేసుకునే ఆ ప్రశ్నకి మూర్తికి జవాబు దొరకడంలేదు!

రావ్‌కి, మూర్తికి మొందు పరిచయం పూనాలో యిద్దరూ లెఫ్టినెంట్సుగా వున్నప్పుడు జరిగింది. ఇద్దరూ ఇంజనీర్స్!

మొదట అసలు రావుని తెలుగువాడనే అనుకోలేదు మూర్తి. ఆరడుగులపొడుగు, పొడుక్కుతగ్గ లావు. తెల్లటి తెలుపు. ఏ పంజాబీవాడో, కాశ్మీరీవాడో అనుకున్నాడు. పేరువిని ఏ కూర్గువాడో, కన్నడం వాడో అనుకున్నాడు. ఓ సారి రావునోట తెలుగుపాట కూనిరాగం విని ఆశ్చర్యంగా అడిగి తెల్సుకున్నాడు. ఆ పరిచయం అలా ఆరంభించింది.

ఆంధ్రదేశంలో ఆంధ్రులమధ్య వుంటే పక్కింటివాడు చస్తున్నా పట్టించుకోడు అదే ప్రవాసాంధ్రంలో తెలుగుమాట తెలుగుమనిషి కనపడితే ప్రాణం లేచి వచ్చినట్టుంటుంది. అందులో ఆఫీసర్సులో రావ్, మూర్తి ఇద్దరే తెలుగువాళ్ళవడం, ఇద్దరూ ఒకే రాంక్‌వాళ్ళు, సమవయస్కులు అవడంతో ఇద్దరూ మంచి స్నేహితు లయ్యారు కొద్దిరోజుల్లోనే!

అప్పటి స్నేహం...తరువాత యీ మూడేళ్ళుగా, పాకిస్థాన్ యుద్ధం ఆరం

ఖించిన దగ్గరనించి యీ బోర్డరు ఏరియాస్‌లో మళ్లీ కలిసివుండడంతో అప్తులు లేని చోట యిద్దరూ మరింత అప్తులయ్యారు. రావ్ యీ మధ్యే మేజరయ్యాడు! అయినా ఆ చనువు యింకా అలాగే వుంది యిద్దరిమధ్య!

యుద్ధం ముగిసినా... ఆ హడావిడి తగ్గినా వారి స్థావరాలు మారలేదు. యూనిట్ అక్కడేవుంది యింకా. బోర్డరులో రోడ్లు వేయడం, బ్రిడ్జిలు కట్టడం, కందకాలు తవ్వడం...యుద్ధం ఏ క్షణం వచ్చినా ఎదుర్కోడానికి సర్వసన్నాహాలు అన్నమాట!

అంతా సట్టమైన అడవులు! కొండలు...వాగులు...రకరకాల పిట్టలు... ప్రకృతిదృశ్యాలు చూడ్డానికి మొదట్లో బాగానే వుంటుంది అందరికి. రాను... రాను...ఎంత సేపు యూనిఫారాలుతప్ప... మగపురుగులు తప్ప కనపడని ఆ ప్రదేశాలు విసుగుపుట్టించేవి. పెద్దపెద్ద తోటలలో పోదాకి తగినట్టు టెంట్లు...ఆఫీసర్ల టెంట్స్‌కి దూరంగా జవాన్ల టెంట్స్. టెంట్స్‌కి దూరంగా రెండుఫర్లాంగులలో మెస్సు! అంతా క్రమబద్ధమైన జీవితం! లేవడం ... చలిలోనే పెరేడ్ ... బ్రెక్‌ఫాస్ట్ ... ఆఫీసుపని ... లంచ్ ... మళ్లీ పని ... సాయంత్రం ఐదుగంటలకే చీకటి!...ఆ హరికెన్ లాంతర్ల ముందు చదవడానికికూడా బుద్ధిపుట్టక...అందరూ ఆరుగంటలకల్లా మెస్సు చేరుతారు. టీ తాగి, పుస్తకాలు చదువుతూ, రికార్డు ప్లేయరు వింటూ, పేకాడుతూ, తాగుతూ ఎవరిష్టంవచ్చినట్టు వాళ్ళు సరదాగా గడుపుతారు. డిన్నరయ్యాక ఓఅరగంటో గంటో బాతాఖానీ కొట్టి ఎవరి టెంట్స్‌కి వారు చేరుతారు ... యీ దినచర్యలో మార్పు అంటూవుంటే చుట్టుపట్ల యూనిట్స్‌కి ఏదో పార్టీలపేరుతో నలుగురుకలసి నాలుగైదు గంటలు గడపడం! బొత్తిగా మెకానికల్ లైఫ్! బాచిలర్స్ బాధపడేవారుగాదుగాని, పెళ్ళయినవాళ్ళు కాపురం పెట్టడానికిలేక చికాకుగా వుంటారు!

పుస్తకం తిరగేస్తున్న మూర్తి దృష్టి అంతా రావుమీదే వుంది. రావ్ లేవడం కోసం ఓపిగ్గా కనిపెట్టుకుని కూర్చున్నాడు.

రావు ఎందుకిలా అయిపోతున్నాడు! ఎలావుండే మనిషి ఎలామారిపోయాడు!! సర్వం కోల్పోయినట్లు ఎందుకా దైన్యం! ఎందుకంత నిర్లిప్తత బ్రతుకుమీద! ఏం లోటని! ఏం నష్టపోయాడని ఆ నైరాశ్యం! పూర్వపు చలాకీతనం మచ్చుకైనా కనపడదేం!

రావు!...మనిషి ఎంత అందగాడో మనసూ అంత అందంగా వుండేది! ఎంత సరదాగా వుండేవాడు! రావు ఎక్కడుంటే అక్కడ ఉల్లాసం, ఉత్సాహం వురకలు వేసేది! అతనిచుట్టూ ఎప్పుడూ పదిమంది పోగయివుండేవారు! అతనిలో ఆకర్షణ అలాంటిది అప్పుడు! కొత్త కొత్త విట్లువేస్తూ, పాటలన్నీ వరసలు

మార్చేసి ఇష్టంవచ్చినట్లు పాడి అందర్ని నవ్వించేవాడు. కాస్త ఫ్రీటైము దొరికితే చాలు పేక పరిచేవాడు. శలవురోజు వస్తే చాలు పిక్నిక్ లనేవాడు. లేకపోతే చుట్టు పక్కల అడవులకి తుపాకులు పుచ్చుకుని షికారీకి బయలుదేర దీసేవాడు! అందమైన అమ్మాయిలకి అందమైన పేర్లుపెట్టి అందంగా వర్ణించేవాడు! సరే, తాగడం ముందునించీ వుందికాని యిలా వళ్లుతెలియని తాగుడుకాదు! రావ్ ఎక్కడుంటే ఆ యూనిట్ అంతా ఉల్లాసంగా వుండేది! పై అధికార్లుకూడా రావ్‌ని ఎంతో అభిమానిస్తూ, ఎంతో ఆదరం అభిమానం చూపించేవారు.

అలాంటి రావు...యిప్పుడు ఎవరితో మాట్లాడడు! నవ్వేలేదు ఆ మొహం మీద!...పేకాటలు, షూటింగ్‌లు మానేశాడు. పార్టీలు, పిక్నిక్‌లు రిఫ్యూజ్ చేస్తున్నాడు. ఎంతసేపూ తాగుడుతప్ప యింకో పనిలేదు! పనికాస్తా అయ్యాక అలా సీసాలు ముందుపెట్టుకుని తాగుతూ, సిగరెట్లమీద సిగరెట్లు తగలేస్తూ అలా అన్యమనస్కంగా కూర్చుంటాడు.

శలవరోజువస్తే టెంట్స్‌కి దూరంగా దట్టంగావున్న చెట్లమధ్య రెండు చెట్లకి హేమక్ వేలాడేసి వెల్లకిలా పడుకుని, పక్కన టేప్ రికార్డరు పెట్టుకుని పడుకుంటాడు సిగరెట్లు కాలుస్తూ! అలా గంటలకి గంటలు తిండితిప్పలుకూడా అక్కరలేకుండా పడుకుంటాడు. తను పిలిస్తే...పదిసార్లు పిలవగా పిలవగా యిష్టమయినరోజు లేచివస్తాడు!

రావుతో అసలు మాట్లాడాలంటేనే యీమధ్య భయంగా వుంటూంది! కోపం ఎంత ఎక్కువయింది! తమ మధ్య స్నేహాన్నికూడా దూరంచేస్తున్నాడు! ఎంత అడిగినా ఏంచెప్పడు! రావుని చూస్తూంటే ఎంత బాధగావుంది! ఎలాంటి వాడు ఎలా అయిపోయాడనిపిస్తుంది!

మొదట్లో రావ్‌లో యీ మార్పుకి...రావ్‌లో నిర్లిప్తతకి కొత్తభార్యా వియోగం అని అర్థంచేసికున్నాడు.

రావ్‌ది లవ్‌మేరేజ్! కెప్టెన్‌గా జబల్‌పూర్‌లోవుండగా పైఅధికారి మేజర్ జనరల్ కూతురిని పెళ్ళిచేసుకున్నాడు. రావ్ తల్లిదండ్రులకి యీ పెళ్ళి యిష్టంలేదు; పంజాబి అమ్మాయి అని వాళ్ళిష్టపడకపోయినా లెక్కచేయకుండా రిజిష్టర్ పెళ్ళి చేసుకున్నాడు.

రావ్ భార్య చాలా అందగత్తెట! అందరూ అన్నారు! లెఫ్టినెంట్‌కల్నల్ జెట్లీకి రావ్ మామగారు తెలుసు! చాలాసార్లు అన్నాడు!

అంత అందగత్తె అయిన భార్య! హోదా, సిరిసంపద అన్నీవుండి రావ్‌లో ఎందుకీ నిస్తేజం? నిర్లిప్తత!

పెళ్ళయ్యాక ఓ ఆరునెలలు మాత్రమే ఇద్దరూ కలసివున్నారు...తరువాత రావ్ ఫ్రంట్‌కి రావల్సి రావడంతో ఆమె ప్రస్తుతం ఢిల్లీలో పుట్టింట్లో వుందిట!

పెళ్ళయిన వెంటనే భార్యని వదల వలసివచ్చినందుకు రావు ఎంతో ఇదయ్యే వాడు! మనిషిక్కడ, మనసక్కడ అన్న ట్లుండేవాడు. ప్రతి రెండుమూడు నెలలకి షార్టులీవు తీసుకుని భార్యదగ్గరకి పరి గెత్తేవాడు. రెండురోజులకో ఉత్తరం తావులు తావులు రాసేవాడు! జాలేసేది రావు ఆరాటం, అవస్థ చూస్తే! ట్రాన్స్ ఫర్ కోరుతూ ఎన్నో దరఖాస్తులు పెట్టాడు...

అలాంటిది...ఓసారి పది రోజులు శలవు తీసుకుని వెళ్ళినవాడు నాలుగో రోజునే వచ్చేశాడు లీవు కాన్సిల్ చేసుకుని. అప్పటినించి యీ ఏడాదిలో ఒక్కసారీ ఢిల్లీ వెళ్ళలేదు.

అంతే!...అప్పటినించి యిదీవరస!

భార్యతో ఏదన్నా తగూవచ్చి వుంటుందా? వస్తేమాత్రం భార్యాభర్తల కోపం యిన్నాళ్ళుంటుందా? అంత అంద గత్తె అయిన భార్య, ఏరికోరి చేసుకున్న భార్యాభర్తలమధ్య అభిప్రాయభేదా లెందుకు వొచ్చివుంటాయి? రావులో మార్పుకి కారణం అదా? కాదా?

జవాబు తెలియదు మూర్తికి.

ఆలోచనలమధ్యరావుని గమనించలేదు మూర్తి, మెస్ నౌకరు వచ్చి పిలిచేవరకు. అప్పటికి...రావు ముందు టేబిల్‌మీదకి వాలివున్నాడు. మెల్లిగా నౌకరు సాయంతో రావుని జీపులో చేర్చి టెంట్‌కి తీసికెళ్ళాడు మూర్తి

* * *

ఆరోజు శలవు మధ్యాహ్నం నిద్ర లేచి బద్ధకంగా ఆవులిస్తూ టెంట్‌కి వచ్చాడు మూర్తి.

అందరూ రాత్రి పార్టీనించి చాలా ఆలస్యంగా వచ్చారేమో మంచి నిద్రలో వున్నారు. అంతటా నిశ్శబ్దంగా వుంది. పక్కనే పారుతున్న వాగు శబ్దం... అప్పుడప్పుడు పక్షుల కిలకిలారావాలు... ఎంతో ప్రశాంతంగావుంది అంతటా!... పక్క టెంట్‌లోకి చూశాడు మూర్తి. రావు టెంట్‌లో లేడు! అంటే...ఎక్క డుంటాడో మూర్తికి తెలుసు!

చన్నీళ్ళతో మొహం కడుక్కుని రావు దగ్గరకి బయలుదేరాడు మూర్తి.

యధాప్రకారం హెూమన్ వేలాడేసి తలకింద చేతులు పెట్టుకుని కళ్ళుమూసు కుని పడుకున్నాడు రావు.

పక్కన ఫోల్డింగ్ టేబిల్‌మీద టేప్ రికార్డర్ మెల్లిగా తలత్ ఘజల్ పాడు తూంది...

"రో...రో...బీతా జీవన్‌సారా...
జీవన్‌సారా...
ఆయే న మన్‌కామీత్ హమారా...
రో...రో...బీతా ...
ఖుషియోంకా సబ్‌గీత్ చురాకర్ ...
ప్యార్‌కా జల్‌తా దీప్ భుజాకర్
టూట్ లియా సారాజీవన్ ... మైహూ
అకేలా...రో...రో..."

తలత్ గొంతులోని విషాదం వింటూంటే...రావు మనసులో నిండిన



బాధనే ఆలాపిస్తున్నాడా అనిపించింది... అలా ఏదో పోగొట్టుకున్నవాడిలా పడుకున్న రావుని చూస్తుంటే బాధనిపించింది.

రావు నిద్రపోతున్నాడేమో...మూర్తి వచ్చిన అలికిడికూడా కళ్ళు విప్పలేదు. పక్కనున్న కాన్వాసు కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు మూర్తి. రావు అంతవరకు చదివి పెట్టిన పుస్తకం తీసుకున్నాడు. పుస్తకంలోంచి ఓ ఫోటో జారి కింద పడింది గడ్డిలో! వంగి తీసిన మూర్తి చూపు అక్కడే నిలిచిపోయింది! అబ్బ!... ఏం అందం!

రావు భార్య ఫోట్లో గాబోలు! టూ రావ్ డార్లింగ్' — 'ప్రీతి' అని వుంది ఫోటో వెనకాల!

ప్రీతి!...ఎంత చక్కని పేరు! ఫోటోలోనే ఎంత అందంగా, ఎంత కోమలంగా కనిపిస్తూంది! ఆ కనుబొమలు, చిరునవ్వు చిందించే ఆ పెదాలు...నుదుటిపై పడే ఆ వంకులజుత్తు...

అందరూ అంటే ఏమిటో అనుకున్నానుగాని ఇంత అందగత్తె అనుకోలేదు...అనుకున్నాడు మూర్తి. పరాయి స్త్రీ, స్నేహితుడి భార్యఅన్న సంగతికూడా మరచి తదేకంగా ఫోటో చూస్తూ వుండిపోయాడు

ఎంత అదృష్టవంతుడు రావు! ఇంత చక్కని భార్యనుంచుకుని ఎందుకలా ఏదో కొంపమునిగినట్లుంటాడు. ~~షిలీ పెలో~~!

రావు కాస్త కదిలాడు... మూర్తి తొందరగా ఫోటో పుస్తకంలో పెట్టేసి, పుస్తకం టేబిల్ మీద పెట్టేశాడు.

రావు లేచాక ఏదో మాట్లాడుతున్నా... మూర్తి ఆలోచనలు ప్రీతిచుట్టూనే వున్నాయి.

* * *

తరువాత రెండునెలలకి.

మూర్తి ఢిల్లీ వెళ్ళాడు బ్రిగేడియరు రెడ్డిగారి కూతురి పెళ్ళికి. రెడ్డిగారు, మూర్తి తండ్రి ఒక ఊరివారు, ఆప్త మిత్రులు! మూర్తిని ఇంట్లో తమ కొడుకు లాగే చూసుకుంటారు రెడ్డిదంపతులు. ఎప్పుడు ఢిల్లీ వెళ్ళినా మూర్తి రెడ్డిగారింట్లోనే మకాం.

పెళ్ళికి కాస్త ముందువచ్చి సహాయ పడాల్సిందని రెడ్డిగారు చాలాసార్లురాశారు. మూర్తి తండ్రికూడా తన తరపున కొడుకుని పెళ్ళికి వెళ్ళమని పురమాయించాడు.

మూర్తి మొత్తం వారంరోజులు శలవు తీసికుని వెళ్ళాడు.

ఉదయం పెళ్ళి ఆడంబరంగా, అట్టహాసంగా ముగిసింది. సాయంత్రం ఓ పెద్ద హోటల్లో రిసెప్షన్ ఏర్పాటుచేశారు. విందుకి పెద్దపెద్ద మిలటరీ అధికారులు హాజరయ్యారు భార్యలతో! చాలా కలర్ ఫుల్‌గా వుంది పార్టీ

మూర్తికూడా ఓ హోస్టు అయి అతిథులందరిని ఆహ్వానిస్తూ పానీయాలు అందిస్తూ చాలా హడావిడిగా తిరుగుతున్నాడు. అందరూ మిలటరీవారవడం చేత పరిచయస్థులు గుంపులుగుంపులుగా నిల్చుని, కూర్చుని రంగురంగుల పానీయాలు తాగుతూ నవ్వుకుంటూ మాట్లాడుతున్నారు.

డ్రింక్స్ ఆఫర్ చేస్తూ, గెస్టులని ఆహ్వానిస్తూన్న మూర్తి గుమ్మంలో మెరుపు మెరిసినట్లనిపించి తిరిగి చూశాడు

ప్రీతి! .... రావు భార్య!... రావు భార్యేనా?...

అచ్చు అలాగే వుంది! ఫోటోలో కంటె వెయ్యిరెట్లు అందంగా వుందనిపించింది మూర్తికి. ముట్టుకుంటే రక్తం చిందుతుందేమో ననిపించే కోమలత్వం! పొడుగ్గా, సన్నగా, నాజూగ్గా...లేగులాబి రంగు ఎందుకు పనికివస్తుంది ఆ రంగు ముందు! వంటి రంగుకి, చీర రంగుకి తేడా తెలియని లేగులాబి ఎంబ్రాయిడరీ చేసిన ఫారెన్ షిఫాన్ చీర, అదేరంగు స్లీవ్‌లెస్ జాకెట్టు, అందంగా ఆధునికంగా చుట్టిన జుత్తుముడి, గులాబి చెప్పులు, గులాబి హేండ్‌బాగ్... సిగలో విరిసి విరియని గులాబి... పైనించి క్రింద దాకా మంచులో తడిసి ఉషాకాంతిలో మెరిసిపోయే లేగులాబిలా వుంది!

రెప్ప వేయడం మరచిపోయాడు మూర్తి.

ఇంత అందం!...అన్నీ ఇలా ఒక చోట కలియడం అపురూపం! యింత అద్భుతమైన అందం చూడగలిగి తన

అదృష్టాన్ని అభినందించుకున్నాడు మూర్తి! రావు అదృష్టానికి ఆ క్షణంలో ఎంతో అసూయకలిగింది మూర్తికి.

ఇంత అదృష్టానికి స్వంతదారుడయి ఆ రావు ఆముదం తాగిన మొఖంపెట్టుకుని కూర్చుంటాడేం!

ఆమెప్రక్కన పొడుగ్గా, సన్నగా, తెల్లగా వున్న ఓ యువకుడున్నాడు. ఇద్దరు ఒకరినొకరు రాసుకుంటూ, నవ్వుకుంటూ, మాట్లాడుకుంటూ లోపలికి వస్తున్నారు.

మూర్తి ఎదురెళ్ళాడు ఆహ్వానించడానికి సంభ్రమంగా. నమస్కారంచేసి తనని పరిచయం చేసుకుంటూ ఇద్దర్ని సోఫాల దగ్గరికి లీడ్ చేశాడు.

"ఏం తీసుకుంటారు?" వంగి, మర్యాదగా అడిగాడు హిందీలో.

"ఎనీథింగ్!" నెమ్మదిగా నవ్వుతూ అంది ఆమె.

రెడ్డిదంపతులు వచ్చి పలకరించారు. మిసెస్ రెడ్డి ఏదో అడిగింది కాబోలు, "డాడీకి వంట్లో బాగులేదు ... మమ్మీ నన్ను వెళ్ళమంది. అందుకు...రాజేన్ వస్తూంటే అతని కారులో వచ్చాను..." అంటూంది హిందీలో.

ఆ క్షణంనించి మూర్తి చుట్టూ చూడ్డం మానేసి ఆమెమీదే దృష్టిపెట్టుకుని కూర్చున్నాడు. రావలసిన గెస్టులు అందరూ వచ్చేశారుకనక తీరుబాటుగా ప్రీతి సోఫాకి కాస్తదూరంగా కూర్చుని ఆమెని సునిశితంగా గమనించసాగాడు మూర్తి.

ఆమె ఏమాత్రం అభ్యంతరం చెప్పకుండా ఓ గ్లాసు షాంపైన్, మరోపెగ్ విస్కీ తాగడం...మగవాళ్ళతో చేతులు కలుపుతూ ఛలోక్తులు ఆడడం..మ్యూజిక్ మొదలవగానే అడిగిన అందరితో డాన్సు చేసే ఆమె అడుగుల చాతుర్యం, ఆమె శరీరం వంపుల్ని, ఆమె హొయలని, విలాసాన్ని...రెప్పవేయకుండా చూశాడు మూర్తి.

ఆమెకి తెలియనివారే లేరులావుంది! 'హలో!' అని అందరూ పలకరిస్తున్నారు. నవ్వుతూ ఏదో మాట్లాడుతున్నారు...చేతులుకలిపి ఏదో ప్రశ్నిస్తున్నారు...అందరితో చనువుగా మాట్లాడుతూంది...ఒకోసారి ఎందుకో విరగబడి నవ్వుతూంది...

మూర్తి యింక చూస్తూ కూర్చోలేకపోయాడు. ఆమెని పరిచయం చేసుకుని మాట్లాడాలి! రావు ఫ్రెండునని పరిచయం చేసుకోవాలి!

ఆమె వంటరిగావున్న క్షణంకోసం ఎదురుచూసి ఆమె పక్కన నిలబడ్డాడు. ఆమె చిరునవ్వుతో కళ్ళెత్తి చూసింది.

తనని తాను పరిచయం చేసుకున్నాడు...మూర్తితో చేయికలిపి 'హౌ డు యూ డూ...' అంది సుతారంగా. ఏవో మర్యాదమాటలు నాలుగు మాట్లాడింది. అదే అదనని రావు తన కెంత ఆప్తమిత్రుడో తెలియచెప్పాడు మూర్తి.

అంతవరకు నవ్వుతూ మాట్లాడిన ఆమె మొహం కాస్త ఎర్రబడింది

ఐసీ! అంది క్రిందపెదవి కాస్త నొక్కిపట్టి.

వెంటనే ఎవరో పిలుస్తున్నట్టుగా, ఎవరినో పలకరిస్తూ తొందరగా అక్కడ నించి ఇంకోవైపు వెళ్ళిపోయింది.

మూర్తి చాలా నిరుత్సాహపడ్డాడు. ఆమెతో ఎన్నో మాట్లాడ్దా లనుకున్నాడు. రావులో మార్పుగురించి చర్చించాలని, రావ్‌లో సభ్యతకి విరుగుడు మీరేనని చనువుచేసుకుని చెప్పాలని ... ఎన్నో చెప్పాలని అనుకున్నాడు. కాని అలా అంటీ అంటనట్టు తెంచుకుని ఆమె వెళ్ళిపోతే మళ్ళీ వెళ్ళి వెంటబడి మాట్లాడడం ఏం సభ్యత అని వూరుకున్నాడు. తరువాత ఉత్సాహం అంతా చచ్చిపోయినట్లయింది మూర్తికి.

పార్టీ ముగిసింది.

* *

కారులో రెడ్డి దంపతులతో ఇంటికి వస్తుంటే ప్రీతిగురించి తెలుసుకోవాలన్న ఆరాటాన్ని అదుపులో పెట్టుకోలేక పోయాడు మూర్తి.

"ఆమె ఎవరు! ఆ ప్రీతి అన్న ఆమె చాలా ఫార్‌వర్డ్‌గా వుందే! చక్కగా డ్రింక్స్ తాగేస్తోందే ... డాన్సుకూడా బాగా చేస్తోంది ... ఎలాగైనా పంజాబి లేడీస్ చాలా పార్‌వర్డ్‌గా వుంటారు గద్దూ!..." సంభాషణకి ఉపక్రమించాడు ఏం తెలీనట్టు మూర్తి.

రెడ్డిగారు కొంటెగా నవ్వారు ... "నీ కళ్ళుకూడా ఆ అమ్మాయిమీద పడ్డా యన్నమాట! నో యూస్ మై బాయ్! ఎ యూజ్ ఆల్‌రెడీ మారీడ" అన్నారు భార్యవైపు నవ్వుతూ చూసి.

మూర్తి సిగ్గుపడ్డాడు.

"ఒక్క పెళ్ళేంఖర్మ!...చేసుకోడానికి వీలయితే రోజుకో పెళ్ళి చేసుకునేది" ఎకసక్కెంగా అంది మిసెస్ రెడ్డి.

"మరీ అంతలా మాట్లాడకు...మీ ఆడవాళ్ళకి తమకంటె అందమైన ఆడదాన్ని చూస్తే అసూయ..." ఉడికించినట్లు అన్నారు రెడ్డిగారు.

"చాల్లెండి! నాకా అమ్మాయినిచూస్తే అసూయ ఏమిటి?... ఏ భై ఏళ్ళు వచ్చాయి; నా కూతురివయసు అమ్మాయినిచూసి నా కసూయ ఏమిటి? ఆవిడ గారి బుద్ధులనిబట్టి అలా అన్నానుగాని..."

"ఆ...ఇదిగో పులంటే అదిగో తోకం టుంది లోకం!... కాస్త ఫార్‌వర్డ్‌గా వుంటే ఏదో అంటారు...అవన్నీ నిజమనుకోడం...నిజమని మనమూ అనడం" భార్యని మందలిస్తున్నట్టు అన్నారు.

"నేను నోరు మూసుకుంటే లోకం మూసుకుంటుందా? ఆ అమ్మాయి తిరిగే తిరుగుళ్ళు, అర్ధరాత్రిదాకా నాట్యాలుచేసే క్లబ్బులు, ఆడదాన్నని మరచిపోయి మగాళ్ళతో సమానంగా తాగడం, అడగని మగాడిదిపాపం అన్నట్టు రోజుకోడితో సినిమాలు, షికార్లు, క్లబ్బులంట తిరగడం ఎవరికి తెలీంది... కాస్తోకూస్తో నిప్పు లేందే పొగ ఎందుకు వస్తుంది...?"

"ఏమో. మన కెందుకు...టూ ఫార్‌వర్డ్‌లే ఆ అమ్మాయి..." రెడ్డి అన్నారు మూర్తివంక చూస్తూ



"మొగుడు దగ్గర లేదేమో ఆ తిరుగుడుకి మరీ అంతుపొంతు లేదు...అసలు మొగుడికి పెళ్లానికి అంచేతే పడటంలేదని, మొగుడు అందుకే రావడం లేదని అంటారు...ఎంతవరకు నిజమో!"

"అదంతా ఏం లేదులే!"

"లేక పోవడం ఏమిటి...మొన్న మిసెస్ సిన్హా అంది...భార్యాభర్తలకి పడడంలేదని...యీవిడ వ్యవహారం నచ్చక...చెప్పినా లక్ష్యపెట్టలేదని అతను

అసలు రావడం మానేశాడట!...ఉత్తరాలు కూడా రాసుకోడంలేదట ఆఖరికి..."

"ఆ...యీవిడ వెళ్ళి చూసిందా? లేకపోతే వాళ్లు వచ్చి చెప్పారా?...

"ఇలాంటివి ఎక్కడ దాగుతాయండి. వీళ్ళయిల్లు, వాళ్ళయిల్లు పక్కపక్కనేగా. వాళ్ళ ఆయా మిసెస్ సిన్హాతో అందిట. రెండు మూడుసార్లు ప్రీతి మొగుడు వూరినించి వచ్చేసరికి యీవిడ గారు ఎవరెవరి కారులలోనో అర్ధరాత్రి దిగడం, ఆ నవ్వులు, ఆ వికారాలు అవి చూశాడట అతను. రెండుమూడుసార్లు చూశాక ఓసారి యిద్దరూ దెబ్బలాడుకున్నారట. ఇలాంటివి నాకు నచ్చవు... యీ అర్ధరాత్రి క్లబ్బుల తిరుగుడు మానేయ'మన్నాడట.

'పదోశతాబ్దపు మనిషిలా మాట్లాడకు. తిరిగితే తప్పేమిటి?' ప్రీతి అందిట.

'నాగరికత అంటే రోజుకో మొగాడితో తిరగడం కాదు...నా భార్య అలా తిరగడం నాకిష్టంలేదు' అన్నాడట అతను. 'అలా నాకిష్టం' అందిట ప్రీతి పెంకిగా

అంతే వున్నపాటున వెళ్ళిపోయాడట అతను...మరి రాలేదుట అప్పటినించి." అంతా-చూసినట్టు, విన్నట్టు విశదపరచింది మిసెస్ రెడ్డి.

"అతను తెలుగువాడు ... మిలటరీవాడే. మేజర్ అనుకుంటాను ... ఎంతయినా తెలుగువాడు...మన సంస్కృతికి, వీళ్ళ ఆచారవ్యవహారాలకి తేడావుంటుంది. అందులో ప్రీతి – ప్రీతి కుటుంబం ముందునించి చాలా ఫార్వర్డ్‌గా వుండే మనుష్యులు...అతనికి ఇదంతా సరిపడినట్టు లేదు.." రెడ్డిగారు సాలోచనగా అన్నారు

"ఉత్త ఫార్వర్డ్‌నెస్ అయితే అందరూ యింకోలా ఎందుకంటారండీ... ఆ అమ్మాయికి ముందునించీ మరీ ఎక్కువ ఫ్రీడమ్ ఇచ్చేశారు తల్లీతండ్రీ...ఇష్టం వచ్చినట్టు ప్రతీవారితో రాత్రనక పగలనక తిరగడం ముందునించీ వుందట...యీ అమ్మాయి అందంచూసి మోసపోయి వుంటాడు పాపం అతను...నిక్షేపంలా మంచి అందంగా, మంచి పొజిషన్‌లో వుండే మొగుడుండగా యీ తిరుగుళ్ళు ఎందుకో!... యిన్నాళ్ళు ఓ మేజర్‌తో తిరిగింది, యిప్పుడు యీ కెప్టెన్ రాజేన్‌ని పట్టింది ... ఏ మొగుడు భరిస్తాడు యీ వ్యవహారం అంతా..."

భార్యాభర్తల సంభాషణ అంతా మౌనంగా విన్న మూర్తికి యింకేం అడగనవసరం లేకుండానే అంతా అర్థం అయింది.

కొద్దిక్షణాలకిందట రావు అదృష్టానికి అసూయపడ్డ మూర్తే యీ క్షణంలో రావుని తల్చుకుని 'పూర్ ఫెలో' అని నిట్టూర్చాడు.






అమ్మగారి పనులు ముగించుకొని ఆలో చిస్తూ యింటిదారి పట్టింది రంగి. 'పెట్టుపోతల్లేని పదిళ్ళపని చేసుకునే కంటె ఒక పెద్దింట్లో పనిచేసుకుంటే సరిపోద్ది' అనుకుంది తను (రంగి) రంగికి పెద్దిళ్ళన్నా పెద్దింటోళ్ళన్నా భయం

లేకపోలేదు అందునా ఆ యింటిబాబు కాస్త జల్సాగ్రా వున్నమనిషే అని విన్నది ఆ అయ్య అందాలబొమ్మ ఆ అమ్మగార్నే గురుతుంచుకోరు, అమ్మగారి దాసీ లెక్కడ గుర్తుకొస్తారు. ఫరవాలేదని సాహసించి ఆనందయ్యగారింట్లో పనికి కుదిరింది తను (రంగి)

తెల్లారకుండానే పనిలోకి పోవడం, ఇల్లు గుమ్మాలు వూడవడం, అంట్లు తోమడం, అమ్మగారి స్నానానికి ఏర్పాట్లు చెయ్యడం, గాజు కుండీల్లో వాడినపూలు తీసిపారెయ్యడం క్రొత్తవి పెట్టడం, అమ్మగారి చీరెలు మాసినవీ మంచివీ వేటికవి సర్దడం అందులో తనకు మోజున్నచీర, కాస్త పాతగిలితే అమ్మగారు సంబరంగా వున్నపు డడగడం ఇంకా ఎన్నిపనులు రంగికి వాళ్ళ ఫలహారాలయాక వంటవాడు పడేస్తే తాను టిఫినుతిని ఆనక వంటలూ భోజనాలూ అయాక మిగిలిన సామానంతా సర్దుకుని గిన్నెలు తోమియిచ్చేసి యింటికి రావడం, మామకి వేడీన్నీళ్లు సిద్ధంచేసేసరికి వాడు స్నానం చేసివచ్చి తినుకుంటూ కసుక్కున నవ్వుకుంటూ మస్తుగా గొప్పింటి భోజనం ముగిస్తాడు ఆనక తను కాస్త తిని మళ్ళీ మూడుకాకుండా అమ్మగారింట్లో హాజరుకావడం

అమ్మగారు సాయంత్రం తలంటి పోసుకుంటారు. తను సాంబ్రాణిధూపం వేస్తుంది సాంబ్రాణి సువాసనలు తనకెరికే గాని అదేటో అమ్మగారు స్నానం చేసిరాగానే, మొగిలిపూవులా, సంపెంగ పూవులా రకరకాల సువాసన స్నానమాడేటపుడు ఏటి రాసుకుంటారో ఏటో - అన్నీ అడగడానికి భయం తనకి

ఆ తరువాత అమ్మగారు సానా అందంగా ముస్తాబవుతారు అమ్మగారి గదివేరు అయ్యగారి గదివేరు. అమ్మగారి గదిలోకి అయ్యగారు రావల్సిందే గాని ఆరి గదిలోకి అమ్మగారు ఎల్లడానికి వీలులేదు రోజూ రోజా పువ్వులా తయారయే అమ్మగారి [illegible] రోజూ వస్తారో రారో అయ్యగారు? ఏంటో పెద్దింటోళ్ళ గొడవలు

అయ్యగారి వివరాలు అమ్మగారికెవరూ చెప్పరు అమ్మగారు మాత్రం ఏలాగడుగుద్ది పెద్దింటిది, అభిమానం కాదూ! పోతే నౌకరీ చాకిరీచేసే తామైనా నోరిప్పుకోరు అలా యిప్పుకుంటే గుండెలు పేల్చెయ్యరూ! ఆ నాలుగు గోడలమధ్య ఒకరికొకరు పనులు చేసుకోవడమేగాని ఓ కాడ కూర్చుని మాటాడుకోరు బైట గుసగుసలనుకున్నా యజమానులతో ఫిర్యాదులు చెప్పుకోరు ఒకళ్ళకూట్లో ఒకరు దుమ్ముపోసుకోరు అనుకుండే. అలాంటి యిద్దెలన్నీ పెద్దింటోళ్లే పడతారు ఆ యింటిసంగతులన్నీ ఎవరి మనసు

కారికే ఎరిక అంతగుట్టు! అంతా తను సన్నల్లో మసలాల్సిందే

అయ్యగారు అమ్మగారి గదిలో నిద్రకొస్తే అమ్మగారు ప్రొద్దుటే లేచి పోయి పస్తు కాఫీ అమ్మగారే పట్టు కెడతారు ఒకవేళ అయ్యగారి గదిలో అయ్యగారుంటే అమ్మగారు ఎనిమిది గంటలదాకా టేబిల్ కాడ టిఫిన్లు తిండానికి ఎదురు చూస్తూ కూర్చో వల్సిందే

అమ్మగారు అయ్యగారి గది ప్రవే శించడానికి వీలులేదు

అమ్మగారొక మల్లెమొగ్గ, మెరుపు తీగ కాని, అదేటో మొగలిపువ్వులా ఎప్పుడూ ముడుచుకున్నట్లు వుంటది అయ్యగారితో కాపరం ఆమె కెలా గుందో ఎవరి కెరుక కాని తనతో మాత్రం సర్దాగా సానామాట్లాడుద్ది.

సాయంత్రం స్నానమయాక తల తుడుస్తూన్నపుడూ సాంబ్రాణిపొగ వేస్తు న్నపుడూ అమ్మ అడుగుతాది - "రంగీ మీమామ ఎలా వుంటాడే" అని నవ్వుతూ

"మా కందాలేటి అమ్మగారూ బలంగుంటేచాలు కష్టపడి పనిచేసుకుని కడుపు నింపుకోవాలి"

"పోనీ నిన్ను బాగా చూస్తాడా?"

చిన్నగా నవ్వుకుంటుంది తను "నే నంటె పడిచస్తాడు అమ్మగారూ మీ రిచ్చే చీరెలూ, రవికెలూ, సింగా రించానంటే ఊపిరాడనియ్యడు ఏదో చ్చినా గొడవేకదా వాడితో"

అమ్మగారు ఉత్సాహంగా వింటుంది "అయితే మీలో చాలామంది తాగుతా రనీ పెళ్ళాల్ని కొడతారనీ పెళ్ళాం డబ్బుతోటే సంసారం గడపాలనీ అను కుంటారే?"

"ఎవరో పోకిరి యదవలట్టాగే అమ్మగారూ! కాని మా మావ అల్లా కాదు" ఆ మాటలంటూ తను తల వాల్చేసుకుంటుంది, సిగ్గేమో అని అమ్మగారు అనుకోవాలె

రంగి యింటి గుమ్మందగ్గర కొచ్చే సింది ఆలోచనలు ఆగిపోయాయి

రాజయ్య అప్పటికే వచ్చి మంచం మీద అడ్డంగా పడుకున్నాడు రంగి రాగానే లేచికూర్చున్నాడు సారా కంపు వెంటనే తెల్సుకుంది రంగి

పొయ్యికేసి నడుస్తుంటే పట్టుకు నిలె సాడురాజయ్య "సానాబాకీ అయ్యింది డబ్బులు పడెయ్యి యిచ్చేసి వస్తా"

"నా దగ్గర డబ్బులుకూడా నీ సారాకే తగలెడితే మనం ఏం తింటాం నీ గడిస్తున్న డబ్బులు నే నడిగానా నాయి నీ వడగడానికి నా దగ్గ రేం లేవు ఎళ్ళు"

"ఎప్పటి కపుడు కొత్తగా మాట్లా డకే రంగీ! నీ దగ్గర లేకపోవడ మేమిటి, పెద్దింటి సిలకవి నీ సింగారం నీ బంగారం నాకు తెల్దేటి! బాబు ఊరికే

యిస్తాడా ఎవన్నీ నీ యిష్టమే! నీ యిష్టాని నీ ఎం అడ్డంరాను డబ్బు మాత్రం యిలా పాడెయ్యి. నామాట మర్యాదగా యినుకో!"

"నీ జిమ్మడ. నాకు రంకు కడతా వంటా. బంగారు బొమ్మలాంటి ఆ అమ్మకేసే చూడ్డు ఆదొర. ఏ దొరసా నులతో వుంటాడో ఏటో. రోజూ ఎంతో సింగారించుకుంటే ఆ అమ్మ, ఏదో ఒక రోజు అవిడ గదిలో కెళతాడు. ఆ యమ్మకి నీ వెంతో మంచివాడవని చెబుతా. బాగా చూస్తావని చెబుతా. సంబరపడి యియన్నీ నా కిస్తాది. నీ నాలిక పీకా, నానుసానిపనిచేసి నీతాగు డికి తెస్తానుట్రా. నీ డబ్బేదో నీవు తగ లెడుతున్నావ్, పోనీ యి ల్లి యి నా జరుగుద్దని కష్టంచేసి తెచ్చి నీయదాన్ని పెడుతున్న అడబుద్దికొద్దీ. నీ మగ బుద్ధి పోనిచ్చుకున్నావ్ కాదు. రేపటి నుంచి పనికే ఎళ్ళను."

"ఏటీ నీ ఇష్ట మొచ్చినట్లు నిన్ను ఏసాలెయ్యనిచ్చి డబ్బులు చాలే అంటే అయూ యియ్యవూ? ఎలాగియ్యవో చూస్తా" అని రాజయ్య రంగి జుట్టు పట్టుకుని పడదీసి బాత్తుంటే అమ్మో అయ్యో అని వోపికున్నంతవరకు అరచి ఆనక రంగి బొడ్లో రూపాయలు దూరంగా విసిరిపారేసింది.

అవి పట్టుకుని మరుక్షణంలో మాయ మయ్యాడు రాజయ్య ఆ రోజుకికి తిండీ నీళ్ళూ సున్నా రంగికి

* * *

శారద ఆ రాత్రి ఎంతో ఎదిరి చూచింది. భర్త తన గదిలోకి వస్తాడనే ఆశ క్షణ క్షణమూ క్షీణించసాగింది. ఏంటో ఈ జీవితాలు! గొప్పవారి జీవితాలు యిలా గొప్పల్తో గోడలు కట్టబడ్డాయా? కాకుంటే ఆయన డియ వచ్చిననాడు, ఆయనకి గుర్తు వచ్చిన నాడు తన గదికి రావడం. దాని కెంతో చెప్పడం, తాను అడగాలనుకున్నవి అడగకుండానే నోరు మూత బడటం. తాను మాత్రం మనసైనప్పుడు భర్తని పిలవలేదు. ఎందుకు పోలేదు? భయం. ఆ గదిలోకి ఎవ్వరూ వెళ్ళరు. అది ఆయనగారి ఆజ్ఞ. తనూ వెళ్ళరాదు. ఎందుకు వెళ్ళరాదు? ఈ రోజు వెళ్ళి తీరుతుంది. ఏమైనాసరే. ఏముంది ఆ గదిలో? తన భర్త దగ్గరికి తను వెళ్ళ డానికి ఆలోచన దేనికి? నెమ్మదిగా తడబడే అడుగులతో ఆ గది దాటింది. ఎన్నడూ చేయని పని చేయబోతున్నం దుకు గుండెలు దడదడా కొట్టుకుం టున్నాయి.

నెమ్మదిగా ఓరగా వేసిన తలుపు తెరుచుకుని భర్తగది ప్రవేశించింది!

గదిలో అలవోకగా పడుకుని పేక ముక్కలు పట్టుకుని ఎదురుగా ఎవరో వున్నట్లు టేబిల్ మీద ముక్కలు పడే



స్తున్నాడు భర్త ఆ చిన్న టేబిల్ మీద కాళీసీసా గ్లాసూను. బెంకుతో వెనక డుగు వేసి మళ్ళీ తమాయించుకుని ముందడుగు వేసి చిరునవ్వుతో – "మీలో మీరు ఒక్కరే ఆడుకోవడమేం. నన్ను ఆడమంటే ఆడనూ" అంది.

నివ్వెరపోయి చూసాడు ఆనందు. కళ్ళు ఎర్రగా వున్నాయి. పేక ముక్కలు విసిరేసాడు. చూపుల్లో నిప్పులు కురుస్తున్నాయి. "ఎవర్నడిగి వచ్చావ్?"

ఆ గొంతుక ఆ తీరు–హడలిపోయింది శారద. "అడగలేదు.. కాని – కాని నా మనసు కాళ్ళు మీ దగ్గరికి లాక్కు వచ్చేసాయి." అంతకుమించి మాట్లాడ

లేకపోయింది. భర్తతీరుకు భయంతో కంపించిపోయింది, శారద.

'అయితే రా' అని ఆమెను బలంగా చేతులుపట్టి లాగి మంచంమీద పడవేసాడు. మోటుగా బుగ్గల చర్మం వూడేలా కరిచాడు. అకస్మాత్తుగా లేచి నించున్నాడు.

భర్తయొక్క యిలాంటి రూపం ఈ ప్రవర్తన ఎన్నడూ చవిచూడలేదు శారద. యిదంతా తాగుడు వ్యవహారం కాబోలని గ్రహించడాని కాట్టే సేపు పట్టలేదు. భయంతో ఒణుకుతూ రెండు చేతులూ జోడించింది. "తప్పే చేసాను, క్షమించండి. ఇంక ఎప్పుడూ మీ గదికి రాను."

దగ్గరలోవున్న బెల్టు చేతిలోకి తీసుకుంటూ అన్నాడు. "నువ్వు క్షమించరాని తప్పు చేసావు. శిక్ష అనుభవించాల్సిందే. కిక్కురుమన్నావంటే చూడు!" అన్నాడు.

చావు తప్పదు కాబోలు అనుకుని విలవిల్లాడిపోయింది శారద. ఒకటి రెండు దెబ్బలకే స్పృహతప్పి మంచం మీదనుంచి జారి క్రిందపడిపోయింది. ఆ తరువాత ఏం జరిగిందో శారదకి తెలియలేదు. ఆమెకు తెలివి వచ్చి చూసేసరికి భర్త వోవార తనలాగే ఒంటిమీద సరిగా బట్టలైనా లేకుండా పడి వున్నాడు. భయంతో నెమ్మదిగా జరిగి అతని గుండెలమీద చెయ్యివేసి చూసింది. గుండెలు కొట్టుకుంటూనే వున్నాయి. నాడి చూసింది అది కొట్టుకుంటూనే వుంది. ఫరవాలేదని వూపిరి పీల్చుకున్నాక ఒక్క-క్షణం ఆలశ్యం చెయ్యలేదు. వెంటనే గదితలుపు తీసుకుని డాబామీదకు వచ్చి డాబామెట్లు గబగబా దిగిపోయింది.

తన వెనుక ఆయనా వస్తున్నాడేమో అనే భయంతో దొడ్లోకి పరుగుతీసి వూలమొక్కల్లో దాక్కుంది. కాస్సేపు ఎవరూ రాకపోవడంచూసింది. ఏ నౌకర్ల చేతయినా తనని పట్టిస్తారేమో అని అనుకుంది. నౌకర్లు అనే వూహ రాగానే రంగి గుర్తువచ్చింది అనేకసార్లు రంగి తమ డాబామీదనుంచి తమ గుడిసె చూపించింది ఆట్టేఆలశ్యం చెయ్యకుండా దొడ్డితలుపు తీసి పరుగున రంగి యింటికొచ్చి వాలింది.

రంగి యింట్లోకూడా ఆ అర్ధరాత్రి ఏదో రభస జరుగుతోంది. తలుపు దగ్గరే చతికిలబడిపోయింది శారద.

లోపలినుంచి మాటలు.

"జీతం నెలకోసట్టు యిస్తారో గాని అస్తమానూ యిస్తారా నువ్వు తాగి తందనాలు తొక్కడానికి" అంది రంగి.

"ఎప్పుడు నువ్వు సజావుగా ఇచ్చావు గనుక. బాకీ జమకట్టాలి. చూస్కో నీ వోపిక."

"నన్ను చంపినావనరే నా దగ్గర యిప్పుడు డబ్బులేదు.''

"నువ్వు అలా ఇంటావ శే! బంగారు పిచ్చుకనుపట్టి నీదగ్గర డబ్బులేకపోవడ మేమిటి. పోనీలే అనివూరుకుంటే..."

"నీ నోరు పడిపోనూ ఆ మా టనకురా నాకి కంపరమొస్తూంది."

మరొాట్టే మాట్లాడకుండా మీద కురికాడు రాజయ్య

వాడి దెబ్బలూ రంగి అరుపులూ, ఆగలేకపోయింది శారద. ఉలిక్కిపడి తోసు కుని ఆగు అని అరుస్తూ లోపలికొచ్చింది. అదే టైమ్‌లో "రేపీపాటికి డబ్బు జత పర్చకపోయావో చూసుకో నా తఢాకా" అని, రంగిని గుమ్మంవైపు తోసివేసాడు. ఆ విసురుకి రంగి వచ్చి శారదమీద పడగా శారద కిందకు పడి పోయింది.

"ఏలెవో ముదనష్టపోళ్లు" అని విసు క్కుంటూ రాజయ్య వీధిలోకి వెళ్ళి పోయాడు. అంతేకాని వచ్చిన మని షెవరో పట్టించుకోలేదు. రంగి మాత్రం క్షణంలో గుర్తించింది. "అమ్మగోరూ మీరా యిలా వచ్చారేంటి" అంది విభ్రాంతితో.

తొందరగావెళ్ళి వీధి తలుపు మూసే సింది. నులకమంచం వాల్చి వున్న దాంట్లో ఉతికిన చీర పక్క వేసింది. శారదని నెమ్మదిగా తీసుకు వచ్చి మంచం మీద పడుకోబెట్టి గోలున ఏడ్చేసింది రంగి. "అమ్మగోరూ వంటి కేంటయినాది? ముఖం మీద ఈ నెత్తు రేటి? ఏంటయినాదమ్మా?"

బాధతో మూలుగుతూ చెప్పింది శారద. "అన్నీ చెబుతా రంగీ! అయినా నువ్వు తెల్సుకోలేనిది కాదు" అంది వెర్రిగా నవ్వుతూ. రంగి స్వతహాగాదిట్ట. ధైర్యవంతురాలే. కాని అమ్మగారిలా రావడం యిలా వుండటం బేజారెత్తి పోయి ఏమీ పాలుపోక అటూ యిటూ కంగారుపడి తిరుగుతోంది. వేడి నీళ్ళు పెట్టి తెచ్చి దెబ్బలుతగిలి నెత్తురు చిందిన భాగాలన్నీ తుడిచింది. కొబ్బరి నూనె వెచ్చచేసి వెల్లుల్లీ పసుపూ వేసి గాయాలకి రాసింది. 'ఛీ యిదేం వయి ద్యగం' అని ఆ నూనె తుడిచేసి తన పెట్లో ఆ అమ్మగారే యిచ్చిన స్నో పౌడర్లు తెచ్చి రాసింది.

రంగి సేవకి, ఆప్యాయతకి, అలజడికి కరిగిపోయింది శారద. శారదకి ఎక్కడ లేని శక్తి వుత్సాహాలూ వచ్చాయి. 'రంగీ!' అని ఆప్యాయంగా అమాంతం రంగిని కౌగిలించేసుకుంది. 'రంగీ నాకు వేడి వేడిగా ఏవైనా త్రాగడానికి యిస్తావా?'

రంగి యింతసేపూ తన కా ఆలో చన రానందుకు తిట్టుకుంది. "మా యింట్లో ఏటుంటదమ్మగోరూ? సినిమా హాలుకాడ వేడి టీ వుంటాది తేనా" అంది.

"వద్దు రంగీ! నువ్వు నన్ను వదిలి వెళ్ళొద్దు."

"అయితే ఎట్లా?"

"గంజి లేదూ?"

"గంజా! పంచభక్ష పరమాన్నాలు తిని ఒకరికి పెట్టే మీకు గంజి ఎట్లా గియ్యనమ్మగోరూ?

"అదే యిప్పుడు అమృతంలా ఉండొచ్చు. కాస్త పల్చనచేసి వేడి చేసి ఉప్పు వేసి తీసుకురా. వేడి వేడిగా ఏదైనా తాగుతేగాని ప్రాణం కుదురు పడదు.".

గత్యంతరం లేక గంజే వేడిచేసి ఉప్పు వేసి గాజుగ్లాసులో పోసి యిచ్చింది దుఃఖపడుతూ రంగి.

వేడి వేడిది తాగాక కాస్త తేరు కుంది శారద. "రంగీ నీ మామ కొట్ట డనీ తాగడనీ ఎందుకు అబద్ధం చెప్పావ్?" రంగి సిగ్గుతో తలవంచు కుంది. ఏం చెప్పాలో క్షణం పాలు పోలేదు, చివరికిలా చెప్పింది. "మీ రేటో మనేగా కనిపించేవారు. నా సుఖమే గాని కష్టం చెప్పడమెందుకులే అని అలా చెప్పానమ్మగోరూ! మిమ్మల్ని బాధపెట్టకూడదు, సంతోషపెట్టాలని."

రంగి అమాయకమైన అంతరంగా నికి ఆనందంతో నిండిపోయింది శారద మనసు. తన భర్తా భయంకర సత్యాన్ని తననుంచి దాచాడు. రంగీ దాచింది. కాని ఏం లాభం? నిప్పులాంటి నిజం తనని కాల్చనే కాల్చింది.

"అమ్మగోరూ! మీరు తెల్లారకుండా యింటి కెళ్ళిపోతే బాగుంటాది."

"నే నింకా ఆ యింటి కెళ్ళలేనే"

"అదేటమ్మగోరూ"

"అవంతే. సాహసించి అయ్యగారి గది కెళ్ళాను. నిజం తెలిసిపోయిందని అయ్యగారికి ఎక్కడలేని కక్షా వచ్చే సింది. నన్ను ఎప్పుడు ఏమైనా చెయ్యొచ్చు. నేను ఆయన చేతుల్లో చచ్చి ఆయన్ని జైలుకు పంపడం మంచిదే నంటావా?"

రంగికి ఎక్కడలేని దుఃఖమూ వచ్చింది. ఎంతపని జరిగింది. తను విన్న గాలికబుర్లన్నీ నిజమేనన్న మాట! పాపం అమ్మగారు మహతారం మనిషి. తానేంటి ఎప్పటికపుడు దెబ్బలుతిని దులిపేసుకోడానికి. "అయితే అమ్మగో రింటికి వెళ్ళిపోతారా అమ్మా."

"ఊఁహు."

"మరెక్కడ కెడతా రమ్మగారు ఒంటిగా?"

"ఇంత విశాల ప్రపంచంలో నాకు చోటే దొరకదంటావా? నేను కాస్త పూరుదాటేవరకు సాయం రాగలవా?"

"ఎంతమాట మ్మగోరు! నా పాణ మైనా వదులుతాగాని మిమ్మల్ని వదులుతానా?"

"మరి మీ మామ?"



"ఏడిశాడు. రంకుపని చేసయినా తన తాగుడికి డబ్బు తెమ్మంటున్నాడు. ఎంతకని చస్తా నమ్మగారూ! నాప్రాణం విసిగిపోయింది. అమ్మగోరింటికి పోదా రనుకుంటున్నాను. మా కేటమ్మగోరు! మాలో మా రు మ ను ము లు కూ డా వుంటాయి. నేనుగాబట్టి యిన్నేళ్ళి కనిపెట్టుకుని దెబ్బలు కాస్తున్నాను."

"తొందరగా ప్రయాణం సంగతి చూడు. ఏదైనా చిన్న పెట్టె తీసుకురా. ఈ నగలన్నీ తీసి అందులో దాచాలి."

రంగి తొందరగా లేచి చిన్న పెట్టె తీసుకు వచ్చింది. అందులో తన ఖరీదైన నగలన్నీ తీసేసి రంగిచేత సర్దించింది. తనెప్పుడో రంగికిచ్చిన పాత చీర కట్టుకుంది. తను కట్టుకున్న చీర పెట్లో పెట్టించేసింది శారద.

"అయితే స్టేషన్ వెడదామా?" అంది రంగి

"అమ్మో స్టేషన్ వద్దు బస్‌స్టాండ్‌కి వద్దు. ఇలాంటివన్నీ అయ్యగారు నౌకర్ల చేత గాలింపించి పరుగులు పెట్టించవచ్చు. ఏదైనా పల్లెటూరికి రెండెడ్ల బండి మాట్లాడు, తొందరగా—"

* * *

ఒక పల్లెటూరు చేరుకుని అక్కడ స్థిరపడింది శారద. ఆ వూరి స్కూల్లో టీచరుగా పనిచేస్తోంది. ఒకటే పెద్ద హాల్లో ఒకే ఒక మేష్టరు అక్కడ పిల్లలకి చదువు చెపుతున్నాడు. అందులో ఆడపిల్లలకి తను చదువు చెబుతోంది ఆ హాల్లోనే కాస్త భాగం తనకి కేటాయించుకుని తడిక అడ్డం కట్టించుకుంది రంగి అనుక్షణం కంటికి రెప్పలా శారదని కాపాడుతుండటంవల్ల, శారద కాలం సులువుగానే దొర్లిస్తోంది.

పల్లెటూరులో రకరకాల ప్రశ్నలు పుట్టకపోలేదు వాటి నన్నిటినీ శారదకి సోకకండా రంగి పిలైనంతవరకూ తన తెలివితో అణిచేస్తోంది.

రెండుమూడు నెలలా పల్లెటూళ్ళో గడిపేసరికి శారదప్రాణం విసిగిపోయింది. తనలా బ్రతకలేననిపించింది. ఏం చేయడానికి పాలుపోలేదు. తన లాంటి ఒంటిప్రాణం ఆ పల్లెటూళ్ళో మనలేదు. సరైన రక్షణా వుండటం కష్టం. ఏ పట్నమైనా పోయి ఏ లేడీస్ హాష్టల్లో అయినా వుంటే, తన మనసుకు వూరట కల్గవచ్చు. రంగిని దాని అమ్మగారింటికి పంపేస్తే మంచిది. తన కూడావుంటే తనని గురించి దానికి చికాకులు రావచ్చు. ఈ విధంగా సాగుతున్నాయి శారద ఆలోచనలు.

ఎప్పుడూ ఎవరింటికీ వెళ్ళలేదు శారద. ఎవరితోటీ పరిచయంలేదు. ఆరోజు మేష్టారింటికి వెడదామని బయలు దేరింది. గుమ్మం చేరేసరికి లోపలనుంచి ఏవో కేకలూ గొడవా వినిపించేసరికి గోడపక్కకి తప్పుకుంది. ఒక వారగా లోపలి రభస కనిపిస్తోంది. కనుచీకటిగా వుంది.

“నిన్నటినుంచీ పిల్లకి జ్వరంకదా, సాయంత్రం పెందరాళే యింటి కొద్దామనైనా వుండొద్దూ! అయినా ఎందుకు వుంటుంది లెండి, అంత అందమయినది కళ్లెదురుగా వుంటే. నా కెక్కడ దాపురించిందో శనిలా! అదొచ్చినప్పటినుంచీ మీ వాలకం బాగోలేదు.”

“నోరు ముయ్యి. నోటికొచ్చినట్లు మాట్లాడకు. ఆవిడెవరో అయినింటి ఆడపడుచులా వుంది. ఏదో కష్టంవచ్చి దారి తప్పి యిలా వచ్చినట్లు వుంది నువు చూడాపెట్టందే యిలా మాట్లాడకు.”

“నానోరు మూస్తాను లోకంనోరు మూస్తారా?”

మేష్టారింక భరించలేక పోయాడు “నీకు నేనులెఖ్ఖా లోకంలెఖ్ఖా! ఆవిడపట్టుమని నాల్గు మాటలైనా మాట్లాడదు నోరుముయ్యి.”

“ముయ్యను, ముయ్యను గాక ముయ్యను. అంతా తేల్చేస్తాను” అంది రెచ్చిపోయి.

ఆమాట శాంతాదేవి నోటినుంచి వచ్చిందోలేదో, మేష్టారు మీదికురికి నాల్గు బాదారు. నోరు మూస్తావా లేదా అని జుట్టు పట్టుకుని గుంజి పారేసారు.

మరింక చూళ్ళేకపోయింది శారద క్షణం నిలబడలేక పోయింది. చకచకా యింటికివచ్చి పడింది.

* * *

ఆ మరునాటి మధ్యాహ్నం. శాంతాదేవి ఏదో పనితో వుండగా స్కూలు కుర్రాడో చీటీయిచ్చి వెళ్ళిపోయాడు ఏమిటబ్బా అని విప్పి చదవడం ప్రారంభించింది మాస్టారి భార్య.

“శాంతాదేవీ! రాకరాక మీ యింటికి వచ్చాను. నేను ఏదైతే చూళ్ళేనో అదే చూసాను. ఏదైతే వినలేనో అదే

విన్నాను. యింతవరకు నా వూహా వేరుగా వుంది. కొందరు గొప్పవాళ్ళు డబ్బు బాగా వుండటంవల్ల విలాసానికి తాగి తందనా లాడతారు. కొందరు పేదవాళ్ళు మూర్ఖత్వంకొద్దీ తాగి ఆలిని చావబాది యింట్లో డబ్బుదస్కం పెళ్ళాం సంపాదన పట్టుకుపోతారని విన్నాను. చూశాను. కాని మధ్యతరగతి వారి కిలాంటి బెడదలు వుండవనుకున్నాను. ఆర్థిక యిబ్బందులు తప్ప వారిని యిలాంటి విషయాలు బాధించడానికి రావనుకున్నాను. మీరు తాగక పోయినా తాగినట్లు మాట్లాడారు. మేష్టారు తాగి రాకపోయినా తాగిన వాడిలాగే కొట్టారు. యిందుకు మూలకారణం నేనైనందుకు చాలా సిగ్గు పడుతున్నాను.

మీకు పాపం నా సంగతి తెలియదు. నేను గొప్పయింట్లోపుట్టాను. గొప్పగా పెరిగాను. గొప్పయింటికే కోడల్ని అయ్యాను. నాకు ఏ లోటూలేదు. వున్న ఒకేఒక లోటు నన్నక్కడ నిలవనిచ్చింది కాదు.

నా గదికి నా భర్త రావడమేగాని వారిగదికి నే నెప్పుడూ వెళ్ళలేదు. ఆ యింట్లో నాఉనికి ఏమిటో బోధపళ్లేదు. నా భర్త నా చేరువకి రావడమేగాని వారి చేరువకి వెళ్ళలేక పోయాను. అలా వెళ్ళాలని తీవ్రమైన కోరిక కల్గిన రోజున వారి గదికి వెళ్లాను. తీవ్రంగా శిక్షింపబడ్డాను. అంతవరకూ నా భర్త యొక్క నిజస్వరూపం నాకు తెలియదు. తెలిసినాక ఆ యింట్లో ఒక్కక్షణం వుండలేక పోయాను. ప్రాణభీతితో పారి పోయాను. కంటికి రెప్పలా కాపాడు కోడానికి రంగి నాకు తోడుగా వచ్చింది. అదీ తాగిన భర్తతో తన్నులుతింది. నేనూ తిన్నాను. మీరూ తిన్నారు. కాని ఒక్కటి. నేను బాధ భరించలేను. ఎవర్నీ బాధించలేను. నావల్ల మీకింక బాధలేకండా ఈ వూరి నించి వెళ్ళిపోతున్నాను. పొట్టకోసం పని చేయాల్సిన అవసరంలేదు. నా దగ్గరున్న నగలు నన్నుజీవితాంతం పోషించ గలిగినంత ఖరీదైనవి. కాని కాలక్షేపం కోసం పని కల్పించుకున్నాను. నాకు యిక్కడ ఏమీ తోచడంలేదు. పట్నంపోయి ఏ లేడీస్ హాస్టల్లో అయినా చేరుతాను. రంగిని పంపేస్తాను. నాకు మంచిదారీ కర్తవ్యం పరోక్షంగా చూపించిన మీకు నా ధన్యవాదాలు. మీ శ్రేయోభిలాషి శారద టీచర్."

ఉత్తరం సాంతం చదివి తెల్లబోయింది శాంతమ్మగారు. దిగాలుగా దొడ్లోకి చూస్తుంటే - దొడ్లో తన కొడుకు జామచెట్టుమీది చిలకను రాయి విసరగా చిలక ఎగిరిపోయింది. జామ పండు కింద రాలింది. తనకొడుకు రాయి విసురుతే చిలక పండు విదిలించింది. ఈ మామూలు సంఘటనలో తెలియరాని దేదో తెలియజెప్పినట్లయింది శాంతమ్మగారికి.



వీరారు గేయాలెలా రాస్తారండీ?
అంగుళాలు, అడుగులు, గజాల్లో!!




ప్రపంచమే నాటకరంగం_ మానవులంతా పాత్రధారులని వెనకటికొకో.....
అచ్చే- కొంతమంది డైరెక్టర్లు, నిర్మాతలు టెక్నీషియన్లు కూడా ఉన్నారు!!




నే రాకె తోర్కలేను, నా నవల తోసికెళ్ళి అచ్చేసి అమ్ముకో ఫో అన్నాడా రచయిత!!
Anjan




నీ నవలను వెడల్పాటి దళసరి పేపర్లతో అచ్చు వెయ్! పొట్లాలకు, పోయిరాజేసుకోడాని కూడా పనికొస్తుందని అట్ట మీదో చిన్న ప్రకటన వెయ్!! జనం విరగబడి కొనకపోతే నన్ను అడుగు!!!

# కళాభిమాని

లక్షాధికారు లందరిలాగే సుబ్బరామయ్యగారు గొప్ప కళాభిమాని. ఆయన దేశంలో ఎక్కడెక్కడోవున్న గొప్పగొప్ప కళాఖండాలన్నీ తీసుకొచ్చి తన విశాలమైన భవంతిలో అందంగా అమర్చేడు. అంతతోనే వూరుకోక తనకు మనసు పుట్టినప్పుడు—చిన్ననాటి అలవాటువల్లనయితేనేం, తోచకపోతేనేం, గొప్ప కళాఖండాల్ని అనుకరిస్తూ, ఆయనా యథాశక్తి చిత్రలేఖనం సాగిస్తూ వుండేవాడు.

సుబ్బరామయ్యగారి అనుంగుపుత్రిక విమలాదేవి. బి. ఏ. ప్యాసయ్యింది. తండ్రిగారంటే ఎంతో వినయవిధేయతలుకూడాను. కుమార్తె బి. ఏ. ప్యాసయ్యినప్పట్నుంచీ, ఆమె వివాహం చూసి ఆనందించాలని సుబ్బరామయ్యగారి తాపత్రయం. అయితే, వారి పరీక్షలకు నిలవగలిగిన యువకుడు ఎవరూ కన్పించలేదు.

ఆ యువకుడు అందంగా వుండాలి. బాగా చదువుకొని వుండాలి. ఉద్యోగం వుండితీరాలని లేదు. విమల అంటే యిష్టంమాత్రం వుండాలి. వీటన్నిటికీ మించి, ఆ యువకుడికి చిత్రకళమీద అభిరుచి వుండాలి.

రాజారావు అందంగా వుంటాడు. ఎమ్. ఏ. వరకు చదివాడు. విమలను ప్రేమించేడు. విమలకూడా అతనిని ప్రేమించేసింది. అయితే వచ్చినచిక్కల్లా రాజారావుకు చిత్రకళ అంటే, కాఫీమీదవున్న యిష్టంకూడా లేదు. పోనీ దానిని తెల్సుకుందామనే అభిరుచి కూడాలేదు. చిన్నప్పుడు, డ్రాయర్, కుర్చీకూడా వెయ్యడం చేతకాక, డ్రాయింగ్ మేష్టారి చేతుల్లో తిన్న దెబ్బలు మరిచిపోలేని రాజారావు, యీ చిత్రకళను నేడు ఎట్లా ప్రేమించగలడు? అందుచేతే విమల రాజారావును పబ్లిక్ గార్డెన్స్‌లో ఓ బెంచీపైన కూర్చోపెట్టి చిలక్కి బోధించినట్లు బోధించ సాగింది...చిత్రకారుల్ని గురించి, తమ యింట్లోవున్న కళాఖండాల్ని గురించి.

రాజారావు అంతా చిర్నవ్వుతో ఎంతో ప్రశాంతంగా విని, "లాభంలేదు విమలా! నువ్వింకే పేర్లన్నా చెప్పుగాని, నాకా పేర్లు గుర్తుండవు. ఈ పరీక్షలో నేను ప్యాసవను. మన పెళ్లి యీ జన్మలో జరగదు. నాకా భాగ్యంలేదు," అన్నాడు.

"అదేమిటి రాజూ! ప్రయత్నిస్తే చెయ్యలేనిదంటూ వుంటుందా? ఆ

డ్రాయింగ్ మేష్టారి సంగతి మరచిపోయి నువ్వో గొప్ప చిత్రకారుడి వనుకో. నీ చిత్రాలు అంతర్జాతీయ ఖ్యాతిని పొందే యనుకో. వూ ... అనుకో ... అప్పుడు యీ పేర్లన్నీ అతిసులువుగా గుర్తుంటాయి. చూడు, నువ్వు లోపలికొచ్చి మా నాన్నగారి రూంలో కూర్చోగానే నీకు ఎదురుగా కన్పించేవి మూడు కళాఖండాలు. ఎడమవైపునుంచి మొదటిది...రవివర్మ గీసింది. రెండవది, పణిక్కర్, మూడవది పైడిరాజుగారు గీసింది. ఊ ... యిప్పుడు చెప్పు," అన్నది లాలనగా. రాజారావు భుజం పైన తలపెట్టి.

రాజారావు కళ్లు మూసుకుని, "మొదటి చిత్రం రవిశర్మ గీసింది, రెండోది పైడితల్లిగారిది, మూడోది శంకరనాయర్ కదూ!" అన్నాడు.

"అబ్బ! చంపేస్తున్నావు రాజూ! మూడంటే మూడుపేర్లు... ఏదీ ... ఓ యాభయిసార్లు అను...రవివర్మ, పణిక్కర్, పైడిరాజు..."

రాజారావుకి యముడ్ని జయించిన సావిత్రి గుర్తుకొచ్చింది. ఈ పరీక్షలో తను గెలిస్తే, తన పేరుకూడా అంత చిరస్థాయిగా వుండాల్సిందే. తనుపడే కష్టానికి.

రాజారావు ఆ మూడుపేర్లను యాభయిసార్లు జపించేక, నలభయి తొమ్మిదోసారి కాబోలు, కరెక్టుగా అనగలేడు. విమలాదేవి ఆనందంతో పరవశమయిపోయి, అతని చేతుల్ని, తన రెండుచేతుల్లోకి తీసుకుని, కళ్ళకు అద్దుకుని, "జాగ్రత్తగా గుర్తుపెట్టుకో. తడబడకు. కావలిస్తే చిన్న కాగితం మీద రాసుకుని, యింట్లోకి రాబోయే ముందు చూసుకో. మరి వస్తా. నాన్నగారు ఎదురుచూస్తూంటారు. నువ్వు కూడా ఓ అరగంటలో వచ్చెయ్యి." అన్నది.

"ఓ. కే. నువ్వేం భయపడకు. నేను కరెక్టుగా చెబుతాలే," అంటూ మళ్లీ ఆ పేర్లు జపించసాగేడు. విమల 'టాటా' చెప్పి కారులో యింటికి వెళ్ళిపోయింది.

*   *   *

సుబ్బరామయ్యగారు చిర్నవ్వుతో రాజారావును లోపలకు ఆహ్వానించేరు. కుశలప్రశ్నలు వేసేరు. రాజారావు పెద్దవాళ్ల యోగక్షేమాలు విచారించేరు. పనిమనిషి తీసుకొచ్చి యిచ్చిన 'కాఫీ టిఫిన్లు' చల్లారిపోతున్నాయి, తీసుకోమని హెచ్చరించేరు.

రాజారావు బల్లమీదవున్న పుష్పాను కొద్దిగా రుచిచూసి, ధైర్యంగా తల ఎత్తి గోడవైపు చూసేడు. గోడను మూడు చిత్రాలు నిలువెత్తు సైజులో, ఆక్రమించుకుని వున్నాయి.

రాజారావు మొహం సంతోషంతో విప్పారింది. కళ్ళు ఆనందంతో నృత్యం చేస్తున్నాయి. పెదిమలు భయంతో తడబడుతున్నాయి.




ఫలహారం తినడం ఆపేసిన రాజారావువైపు చూసిన సుబ్బరామయ్యగారు-"ఏమిటి అట్లా చూస్తున్నారు? ఆ చిత్రాలంటే యిష్టమా?" అన్నారు.

"ఇష్టమా? ఇంకా నెమ్మదిగా అంటారా? రవివర్మగారి చిత్రాలంటే నా మనస్సు ఆనందంతో వురకలు వేస్తుంది. ఆ మొదటిది రవివర్మగారి చిత్రంకదూ?" అన్నాడు రాజారావు.

రాజారావు కళాభిరుచికి సుబ్బరామయ్యగారు కొంచెం ఆశ్చర్యపడ్డారు. గదిబయటనే తచ్చాడుతూ, పై సంభాషణను విన్న విమల ఆనందించింది

నెపోలియన్ లాగ ఎదురుదాడి చేసి సుబ్బరామయ్యగారిని ఆశ్చర్యంతో ముంచెత్తుదామనుకున్నాడు రాజారావు. సుబ్బరామయ్యగారి పరీక్షకు ఎదురుచూడకుండానే, తనే "పణిక్కర్ గారి చిత్రాలను ఎంతసేపు చూసినా తనివితీరదుకదా! చాలా గొప్పచిత్రం ఆ రెండోది," అనేసేడు రాజారావు ఉత్సాహంతో కాఫీని గడగడ తాగేసేడు.

సుబ్బరామయ్యగారి ఆనందానికి అంతులేదు. "ఈ యువకుడికి కళలో యింత ప్రవేశంవుందా? అల్లంతదూరం నుంచే ఆ కళాఖండాల్ని ఎంతచక్కగా గుర్తుపట్టకల్గేడు. ఇతనే నా అల్లుడయితేనా?" అని అనుకున్నాడు.

బయటనే నిలబడి రాజారావు మాటలు విన్న విమల, మూడోచిత్ర

కారుడి పేరు సరిగ్గా చెప్పాలని మనస్సు లోనే వెయ్యిదేవుళ్ళకు మ్రొక్కింది.

ఇంతలో సుబ్బరామయ్యగారు "విమలా యిటురా అమ్మా, ఓసారి," అన్నారు.

"ఏం నాన్నా పిల్చేరా?" అంటూ విమల లోపలికి వచ్చింది. గోడమీద నున్న మూడో చిత్రం ఆమెదృష్టి నాకర్షించింది. అది కొత్తచిత్రం. తనెన్నడూ చూడనిది ఎవరో ప్రవేశంలేనివారు గీసిన కొత్తచిత్రంలా వుంది. అయినా నిలువెత్తుది! ఫ్రేం కట్టించి, చక్కగా గోడను అలంకరించి వుంది. ఎప్పుడు వచ్చిందో యింట్లోకి యీచిత్రం విమలకు అర్థంకాలేదు.

"ఆ మూడో చిత్రం..." అన్నాడు రాజారావు వుత్సాహంగా.

"చాలా గొప్పచిత్రంలెండి కొంచెం వక్కపొడి కావాలా?" అంటూ అడ్డొచ్చి, అలమారులోని వక్కపొడి డబ్బాలోంచి కొంత తండ్రికి, కొంత రాజారావుకి యిచ్చింది విమల!

"భగవాన్! ఈ చిత్రం పేరు ఎట్లాగా తప్పుచెబుతారియన. దాంతో పరీక్షలో ఎట్లాగా ఫెయిలవుతారు. కాస్సేపు మాట్లాడకుండావుంటే బాగుండును" అనుకుంది విమల

రాజారావు వక్కపొడి త్వరితంగా నమిలి, "ఆ చిత్రంలో గొప్ప శైలి వుంది. అది ఒక్క పైడిరాజుగారివద్దనే వుంది. పైడిరాజుగారి చిత్రం కదూ అది?" అనేసేడు, వుల్లాసంగా సుబ్బరామయ్యగారి మొహంలోకి చూస్తూ

విమలకి చెమట్లుపట్టేయి మూర్ఛ వచ్చినంత పనయ్యింది; పడిపోబోతూ, కుర్చీని ఆనుకుంది.

సుబ్బరామయ్యగారు లేచి, వుద్వేగంతో ముందుకివచ్చి, "నువ్వు నాకు చాలా నచ్చేవోయి. నీకు గొప్ప కళాదృష్టి వుంది. నీలాంటి కళాపిపాసి నా అల్లుడవటంకంటె నేను కోరేదేముంది? చాలా సంతోషం నువ్విట్లా యివ్వాళ ఇక్కడకు రావడం! రోజూ తీరికయినప్పుడు వస్తూండు," అన్నారు.

రాజారావు అత్యుత్సాహంతో సెలవుతీసుకుని పరీక్షహాల్లోంచి బయట పడ్డాడు

ఆ తర్వాత కాబోలు ... రాజారావుతో పెళ్ళయిపోయిన విమల తండ్రిని అడిగింది — "ఆ చిత్రం ఎవరు గీసేరు నాన్నా!" అని.

"నేనేనమ్మా! పైడిరాజుగారి శైలిలో ఎప్పుడో గీసేను. కాని మిత్రులొక్కరూ మెచ్చుకోకపోతే దానిని చాలారోజులు దాచేసేను ఓరోజున పైడిరాజుగారి చిత్రం పైనుంచి జారి కిందపడి గ్లాసు పగిలితే, నేను గీసిన చిత్రం దానిపైన ఎందుకు పెట్టకూడదనిపించింది. మన అల్లుడొక్కడేనమ్మా గొప్ప విమర్శకుడు. ఆ చిత్రాన్ని అంత గొప్పగా మెచ్చుకున్నాడంటే, అతని కళాభిరుచికి నేను ముగ్ధుడినయిపోయేననుకో! మన అల్లుడు..."

ఆ తర్వాత మాటలు విమలకు ఏమీ విన్పించలేదు-తప్పిపోయిన ప్రమాదం తల్చుకునేసరికి.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

## 26

మేం యింటికి వచ్చేసరికి అమ్మా, నాన్నగారు, మిసెస్ లింగం, ఆవిడ భర్తా, మాకోసం ఎదురుచూస్తున్నారు.

నాన్నగారు మా కెదురుగావచ్చి సారథిని ఎంతో ఆప్యాయంగా పలకరించి లోపలకు తీసుకువచ్చారు.

ఈ పూట మిసెస్ లింగం దంపతులు యిద్దరూ మాయింట్లోనే భోజనం చేస్తున్నారు.

అంత హడావుడిలో వూపిరి సలపనట్టుండికూడా అమ్మ అన్నంలోకి సారథికి యిష్టమైన స్పెషల్స్ చేయించింది. భోజనాలప్పుడు అతనిప్రక్కన కూర్చుని కొసిరికొసిరి వడ్డించి తినిపించింది.

అమ్మ మనసులో అంత ఆదరణకి, అభిమానానికి చోటుచేసుకున్న సారథి అంటే ఆ నిముషంలో నిజంగా నాకు యీర్ష్య అనిపించింది.

భోజనాలు అయిపోయిన తర్వాత, అమ్మా, మిసెస్ లింగం వాళ్ళు వెళ్ళిపోయారు. సారథి పడుకున్నాడు.

అతనికోసం మాయింట్లోనూ, లింగంగారి యింట్లోనూ, రెండుచోట్లా ప్రత్యే

కంగా గదులున్నాయి. అతనికి ఎప్పుడు ఎక్కడ వుండాలనిపిస్తే అక్కడ వుండి పోయేటందుకు అమ్మ యీ యేర్పాటు చేసింది.

నాన్నగారు అమ్మావాళ్ళని క్లబ్‌లో దింపి, తన కెక్కడో పనివుందని చెప్పి వెళ్ళి 5 గంటలు అవుతుండగా తిరిగివచ్చారు.

సాయంత్రం అవగానే అమ్మ ఆదేశంప్రకారం సారథి పంపిన టమాటారంగు జరీ ఎంబ్రాయిడరీ చీర కట్టుకుని, దానికి మాచ్ అయే జాకెట్ వేసుకున్నాను.

నాకు ముదురురంగులంటే ఏమాత్రం యిష్టంలేదు అలాటి బట్ట లేసుకోగానే నా కేమిటో ఒళ్ళంతా కంపరంగా వుంటుంది. ఎప్పుడెప్పుడు విప్పి లైట్‌కలర్స్ వేసుకుంటానా అని ప్రాణం హైరానగా ఎదురుచూస్తుంది.

కానీ నా అభిప్రాయం అమ్మ మన్నించదు.

"చక్కటి శరీరఛాయ వుంది నీకు. అది బాగా కన్పించాలంటే ముదురు రంగుగల చీరలే కట్టుకోవాలి నువ్వు," అంటుంది అమ్మ.

మధ్యాహ్నం క్లబ్‌కి వెళ్ళబోతూ, నా దగ్గరకివచ్చి, "సాయంత్రం యిదుగో యీ చీర కట్టుకో," అంటూ ఆ ఎర్రటిచీర నా మంచంమీద పెట్టింది.

"అబ్బా! అంత ఎర్రటిఎరుపు! కొట్టినట్టుగా వుంటుంది," నసుగుతూ అన్నాను.

అమ్మ చురకల్లాటి చూపులతో నావైపు తీక్షణంగా చూసింది.

కంఠం తగ్గించి "పిచ్చివేషాలు వేయకుండా చెప్పినట్టు చెయ్యి. పూరికే సణిగి నాకు చిరాకు తెప్పించకు," అని వెళ్ళిపోయింది.

అమ్మ వెళ్ళినవైపే చూస్తూ బొమ్మలా నిలబడిపోయాను నేను. ఏ విషయంలో నైనాసరే, నేను స్వంతఅభిప్రాయం ప్రకటిస్తే అమ్మకి అది నా పిచ్చివేషంగా కన్పిస్తుంది. చిరాకు కలుగుతుంది. ఎప్పుడూ యింతే. అప్పటికి మొహం మాడ్చుకున్నా సాయంత్రం అయేసరికి ఆవిడ చెప్పినట్టే తయారయాను.

ఆరుగంటలు కావస్తోంది.

నా అలంకరణ పూర్తయింది.

అప్పటికి ఐదునిముషాలక్రితం అమ్మ ఫోన్‌చేసి సారథి లేచాడా? కాఫీ తాగాడా? అంటూ వివరాలు అడిగింది.

అత నిప్పుడే లేచాడని బాత్‌రూమ్‌లో వున్నాడని చెప్పాను.

"తొందరేం లేదు. మీరు 6-30 కి వస్తే చాలు," అంది.

"అలాగే."




"నువ్వు తయారవటం అయిందా?"

"ఆ!"

"నేను చెప్పిన చీర కట్టుకున్నావా?"

"ఆ!"

"రక్షించావు!" ఫోన్ పెట్టేసింది

నేను నా గదిలోకి వచ్చి నిలువుటద్దంముందు నిలబడి జడలో పువ్వులు పెట్టుకుంటుండగా తాయారమ్మ గదిలోకి తొంగిచూస్తూ, "మీకు ఫోన్ వచ్చింది," అంది.

"మళ్ళీ ఏమిటిట?" విసుగ్గా అన్నాను.

"ఏమో నాకు తెలియదు. ఫోన్ చేసింది మీఅమ్మగారు కాదు."

"అమ్మ కాదూ? ఎవరు మరి?" చివ్వున వెనక్కు తిరుగుతూ అడిగాను.

"నాకేం తెలుసు? ఎవరో మగవాళ్ళు." చురుక్కుమని చూస్తూ అంది.

"మగవాళ్ళా!" నాకర్థంగాలేదు. ఎవరై వుంటారు? నాన్నగారు, సారథి యిద్దరూ యింట్లోనే వున్నారు. యింకెవరు చేస్తారు నాకు?

నేను ఆశ్చర్యంగా రెండేసిమెట్లు ఒక అంగచొప్పున గబగబా దిగుతూ క్రింద హాలులోకి వచ్చాను.

నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

రిసీవర్ తీసుకుని, మెల్లగా "హలో!" అన్నాను.

"మీనా!" అనునయంగా పిల్చా రెవరో.

"ఎవరు?" బెదురుతున్నట్టుగా అడిగాను.

"నేను!"

"కృష్ణా!"

"అవును."

నేను చప్పున ఖంగారుగా చుట్టూ చూస్తూ చూశాను. అదృష్టవశాత్తూ ప్రక్కల ఎవరూ లేరు.

"ఏమిటి?" ధైర్యంగా అడిగాను

"మీనా! నాకింకా ట్రెయిన్‌కి టైముంది. నేను—"

"వద్దు వద్దు. వెళ్ళకు. నీతో చాలా పనుంది. చాలా ముఖ్యమైన సంగతులు మాట్లాడాలి."

"కానీ—"

"నా కింకేం చెప్పకు."

"పోనీ ఆ విషయం ఏదో యిప్పుడు చెప్పేయకూడదూ?"

"ఇప్పుడా?"

"అవును. ఏం? బిజీగా వున్నావా?"

"ఊఁ!"

క్షణంసేపు యిద్దరం మౌనంగా వుండిపోయాం.

"సారీ మీనా. నిన్ను డిస్టర్బ్ చేసానేమో!" మనస్ఫూర్తిగా క్షమార్పణ కోరుతున్నట్టుగా వుంది అతని స్వరం.

"ఫర్వాలేదు."

"నాకు రేపు బెజవాడలో పనుంది. ఒకతన్ని కలుసుకోవాలి. నేను కావాలంటే మళ్ళీ వచ్చేవారం వస్తాను."

"ఉహు. వీల్లేదు. రేపు నేనుచెప్పిన టైమ్ మర్చిపోకు. నాన్నగారు వున్నారు యింట్లో పిలవనా? మాట్లాడతావా?"

"ఉహు, వద్దు. సరే, వుంటాను." పెట్టేస్తున్నానని చెప్పనైనా చెప్పకుండా పెట్టేశాడు.

నేను కొద్దిసేపు అక్కడే అలాగే నిలబడిపోయాను.

నా కేమిటో చాలా సిగ్గుగా, అవమానంగా, దొంగతనం చేసినట్టుగావుంది. వారం పదిరోజులు నిమ్మలూరులో వాళ్ళ యింట్లో వుండి అన్నిరకాల ఆతిథ్యాలు పొంది వచ్చిన నేను, అతను యీ వూరు వస్తే, కనీసం మాటవరసకి, మర్యాదకైనా మా యింటికి రమ్మనమని అనలేక పోతున్నాను.

నా గుండెల్లోకి వుద్రేకంలాటిది ఒక్కసారి పొంగులా వచ్చింది.

రోషంగా, అభిమానంగా అన్పించింది.

ఏమైనా సరే, కృష్ణని యింటికి పిలిచితీరాలి.

ఇందుకు మొదట నాన్నగారిని అనుమతి అడిగితే, అమ్మసంగతి తర్వాత చూద్దాం.

ఈ యింటికి ఎంతోమంది వస్తుంటారు. ఆ వచ్చేవాళ్ళంతా మా కుటుంబానికి ఆప్తులేనా!

సభ్యత, సంస్కారం పేరిట బద్ధశత్రువులతోనైనా సరే, నవ్వుతూ మాట్లాడగలిగిన సంస్కారంగల అమ్మ వీళ్ళ విషయంలో ఇంత కఠినంగా ఎందు కుండాలి! అప్పు డెప్పుడో ఏదో అభిప్రాయ భేదం వస్తే అది మనసులోపెట్టుకుని వైరాన్ని సాగదీయాలా? మనిషి కాలంతోపాటు కొన్ని స్మృతులని గతంలోకి వదిలేయాలి గానీ అవే పట్టుకుని కూర్చోటం ఏం బాగుంటుంది.

నేను విసురుగా నాన్నగారి గదిలోకి వచ్చాను.

ఆయన అప్పటికే తయారై మాకోసం వేచిచూస్తున్నట్టుగా, కూర్చుని పేపరు చూసుకుంటున్నారు.

నన్ను చూడగానే పేపరు మడిచి ప్రక్కనపెడుతూ, "అయిందా? బైలుదేరుదామా," అన్నారు.

"అవలేదు. సారథి స్నానం చేస్తున్నాడు," అన్నాను.

ఆయన టైమ్ చూసుకున్నారు.

"ఫర్వాలేదులే. ఇంకా చాలాటైముంది. 6-30 కి ప్రోగ్రాం మొదలు అన్నారేగానీ అంత త్వరగా తెములుతుందా! అందులో ఆడవాళ్ళ ఆధ్వర్యం." నవ్వుతూ అన్నారు.

అంత మామూలుగా మాట్లాడుతున్న ఆయనతో సడన్‌గా కృష్ణ సంగతి ఎలా మాట్లాడాలో అర్థంగాలేదు.



నాన్నగారు యింక మాట్లాడ వలసింది అంతగా ఏంలేనట్టు అక్కడ పెట్టిన పేపరు తీసుకుని అందులోకి మళ్ళీ చూడసాగారు.

"నాన్నగారూ!"

"ఏమిటి మీనా!"

"మీకు, మీకు - కృష్ణ వచ్చాడు తెలుసా?"

ఆయన చివ్వున తలెత్తారు.

ఆశ్చర్యంగా అడిగారు. 'అవును. కానీ నీకెలా తెలుసు?"

నేను నిర్విణ్ణురాల నయ్యాను.

నోటమాట రానిదానిలా కళ్ళప్పగించి చూడసాగాను.

"మీ...మీకు తెలుసా?" ఎంతో ప్రయత్నంమీద అడగగలిగాను.

''తెలుసు. నిన్న వచ్చాడు. ఈ రోజు సాయంత్రం వెళ్ళిపోతున్నా నని చెప్పాడు. కానీ మధ్యాహ్నం కలిసినప్పుడు మళ్ళీ ఏదో ముఖ్యమైన పనితగిలిం దని, బహుశా ఈరోజు వెళ్ళటం పడదేమోనని అన్నాడు."

"మధ్యాహ్నమా! మీరు అతన్ని కలిశారా?"

నాన్నగారు తలూపుతూ అన్నారు. "అవును. మీ అమ్మా వాళ్ళని క్లబ్బులో వదిలి నేను అంతసేపు వెళ్ళింది ఎక్కడికి అనుకున్నావు? వాడిదగ్గరకే. నువ్వు యింతకీ చెప్పనేలేదు. ఎక్కడ కన్పించాడు నీకు!"

''ఎయిర్ పోర్టులో."

''ఓ! మధుసూదన్ ఈరోజు బెంగుళూరు వెళ్ళాడని చెప్పాడు. పంపించ టానికి వెంట వెళ్ళాడు కాబోలు.''

"మధుసూదన్ ఎవరండీ?"

"కృష్ణకి స్నేహితుడు. అతని పినతండ్రిదే కృష్ణ తీసుకుని చేస్తున్న పొలం.

నాకు హఠాత్తుగా గుర్తుకు వచ్చింది. వెంటనే అడిగాను.

"కృష్ణ అసలు యీ ఊరు ఎందుకు వచ్చాడుట? మీకేమైనా చెప్పాడా?"

''ఏముంది? ఎప్పటిపాటే. ఆ పొలం యజమాని అంటే మధు పినతండ్రి పొలానికి బేరం వచ్చింది అమ్మేస్తున్నానని టెలిగ్రాం ఇచ్చాడట. వాడు వచ్చి అదే ధరకి తనుకొంటానని, గడువు యిమ్మని అడిగాడు."

''ఇచ్చాడా?"

''ఇచ్చాడు. 15 రోజులు. అదికూడా మధు గట్టిగా చెప్పి, బ్రతిమలాడితే."

"ఎంతట ఖరీదు.''

"పాతిక వేలు."




"పాతికవేలు!" నేను కళ్ళప్పగించి చూశాను.

"అవును. పాతికవేలు. ఆ పొలం అంత ఖరీదు చేస్తుంది." నాన్నగారు పేపర్లోకి చూస్తూ అన్నారు. ఆయన ముఖానికి అంతులేని గాంభీర్యం ఆచ్ఛాదనలా వచ్చేసింది.

ఆయన ముఖ కవళిక గమనిస్తే యీ ప్రసంగం యిక పొడిగించటం యిష్టం లేనట్టుగా అన్పించింది నాకు. అమ్మ అయితే నాకు భయం. ఆవిడ కాస్త కనుబొమలు ముడిచి చూస్తే చాలు, ఆ చుట్టుప్రక్కల నుండబుద్ధిగాదు. కానీ నాన్నగారు అలా కాదు. ఆయన యిష్టాయిష్టాలతో నాకేం పనిలేదు. ఎలాటి సమయం అయినా, నేను కావాలనుకున్నది అడిగే చనువు, స్వతంత్రం నాకు చిన్నప్పటినుంచీ వున్నాయి. అందుకే ధైర్యంగా సంభాషణ పొడిగించాను.

పాతికవేలు! కృష్ణ ఎక్కడినుంచి తెస్తాడు! నాన్నగారిని అడగలేదుకదా! కృష్ణ నాకు కన్పించాడు. కానీ మాటవరసకికూడా నాన్నగార్ని కలిసినట్టు చెప్పలేదు. ఆ విషయం గోప్యంగా వుంచాల్సిన అవసరం ఏ మొచ్చింది?

హాఠాత్తుగా నాకు మెరవులా ఒక అనుమానం వచ్చింది.

"నాన్నగారూ! కృష్ణ మిమ్మల్ని డబ్బు సాయం చేయమని అడిగాడా?"

నాన్నగారు మళ్ళీ తలెత్తారు.

"వాడా? నన్నా! ఉహు. లేదు. నా అంతట నేనే అప్పుగా యిస్తానంటే కూడా విన్పించుకోలేదు. నా యీ యిన్ని సంవత్సరాల జీవితంలో వాడంత మొండిమనిషిని ఎక్కడా చూడలేదు." కోపంగా అన్నారు.

"మరి డబ్బు ఎక్కడినుంచి తెస్తాట్ట?"

"అదే నాకూ తోచడంలేదు. వాడికి అంత డబ్బు అప్పుయిచ్చేవాళ్ళు మాత్రం ఏరి? ఒకవేళ యిచ్చినా మళ్ళీ అక్కడకూడా యిదే బాధ ఎదురవుతుంది. వాడికి కాబోయే మామగారిని అడుగుతాడేమో?"

"సుందరి తండ్రినా?"

"అవును. కానీ ఆయన అప్పు ఇవ్వటానికి ఒప్పుకోవటంలేదుట. కావాలంటే ఆ పొలం కూతురి పేరుమీద కొనేస్తాను, అమ్మాయి పేరుమీద రిజిష్టర్ చేయించు అన్నాట్ట. అది వీడికి ఏ మాత్రం యిష్టంలేదు. ఆ పొలం అంటే వీడికి ప్రాణంతో సమానం. యజమాని అమ్మటం అంటూ జరిగితే అది తనే కొనాలని పట్టుదల. చూడబోతే చేతిలో కానీలేదు. ఏం చేస్తాడో మరి."

నాన్నగారు ఆలోచనగా కుర్చీలో వెనక్కు ఆనుకుని కూర్చున్నారు. టేబిల్ మీద స్థిరంగా నిల్చిపోయిన ఆయన దృష్టినిబట్టి తన మనసు యిక్కడెక్కడా లేదని నాకు తెలిసింది.

"కృష్ణ పొలం విషయంగురించి తప్ప యింకేం చెప్పలేదా?" అన్నాను.

"చెప్పాడు. రాజు పెళ్ళి వచ్చేనెల స్థిరం అయిందని చెప్పాడు."

"నాన్నగారూ!" ఎంతో గారంగా పిలిచాను.

ఆయన ఏమిటన్నట్టు చూసారు నా వైపు.

"రాజుకి కాబోయే ఆ మొగుడిని నేను చూశాను. ఏం బాగుండడు. అచ్చు కోతిలా వుంటాడు."

"మనుష్యుల్లో కొంతమందికంటే ఆ కోతులే చాలా నయం మీనా."

"అవుననుకోండి. రూపంలో సామ్యమైతే ఫర్వాలేదు. కానీ స్వభావంలోకూడా మర్కట చేష్టలు ప్రదర్శించే మనుష్యులతో జీవితాంతం గడపడం కష్టంకదండీ. రాజుని నేను యీ పెళ్ళికి ఎదురు తిరగమని ప్రోత్సహించాను."

"ఏమిటి?"




"అవునండీ. నా కెందుకో ఆ సంబంధం ఏమాత్రం యిష్టంలేదు. రాజు ఒప్పుకుంది. కృష్ణకి ఎదురుతిరుగుతానని వాగ్దానం యిచ్చింది. కాబట్టి యీ పెళ్ళి జరగదు."

"ఏమిటి?" నాన్నగారు లేచి నిలబడ్డారు.

ఆయన ముఖం ఎర్రబడింది. కళ్ళు అగ్నిగోళాల్లా మెరిసినాయి.

ఉగ్రమూర్తిలావున్న ఆయన రూపంచూసి తెల్లబోయిన నేను అప్రయత్నంగా ఒకడుగు వెనక్కు వేశాను.

నాన్నగారికి ఎందుకో హఠాత్తుగా ఎప్పుడూరానంత కోపం వచ్చింది.

ఇందులో ఆయనంత ఆగ్రహించాల్సినంత చెడు ఏముందో నా కర్థంకాలేదు.

రాజుకి ఆ పెళ్ళితప్పించటానికి నేనుచేసింది మంచి కాదా? అది దానికి వుపకారం చేయటంకాదా?

నాన్నగారు కఠినంగా అన్నారు.

"ఎందుకు చేశావు ఆ పని? ఇది తెలిస్తే కృష్ణ మళ్లీ మన ముఖం చూస్తాడా?

మీ అమ్మ వాళ్ళతో సంబంధం లేకుండా చేసింది. నువ్వు వాళ్ళ ముఖాలు చూసే ప్రాప్తంకూడా లేకుండా చేశావన్నమాట. రాజు ఆ పెళ్ళి మానేసి ఏం చేస్తుందిట? నీతో వచ్చి యిక్కడ వుంటుందా? నువ్వు వుద్ధరిస్తావా? లగ్నం పెట్టుకున్న తర్వాత ఆ పెళ్ళి ఆగిపోయిందంటే ఆ పల్లెటూళ్ళో ఆ కుటుంబం ఎంత నవ్వుల పాలు అవుతుందో తెలుసా నీకు?"

"నాన్నగారూ!"

"నువ్వసలు వుత్తరాలు వ్రాసేముందు కనీసం నాతో చెప్పావా? నన్నడిగావా? నిన్నసలు నిమ్మలూరు పంపటం నాది బుద్ధితక్కువతనం. వాడెంతో కష్టపడి, అన్ని ప్రయత్నాలు చేసుకున్నతర్వాత ఆ పెళ్ళి నీమూలంగా ఆగిపోయింది అంటే వాడేంచేస్తాడో తెలుసా? నిన్నేమీ అనడు, నన్నేం అనడు. మనకి కొన్ని వేలమైళ్ళ దూరంలో వుండేలా జాగ్రత్తపడతాడు. నేను వాళ్ళకేం సాయం చేయలేకపోయినా, కనీసం కంటితో చూసుకునైనా తృప్తిపడుతున్నాను. చివరికి ఆ యోగంకూడా లేకుండాచేసి పుణ్యం గట్టుకున్నావన్నమాట!"

"కానీ–నాన్నగారూ–" కళ్ళలో గిఱ్ఱున తిరగబోతున్న నీళ్ళని బలవంతంగా నిగ్రహించుకోటానికి పెనుగులాడుతూ అన్నాను.

"వెళ్ళవతలికి. చాలా గొప్పపని చేసావు. పెళ్ళి జరగదుట! ఎందుకు జరగదో నేను చూస్తాను. రాజుకి నేను యీరోజే వుత్తరం రాస్తాను. అలాటి పిచ్చిపిచ్చి వేషాలేం వేయవద్దని, బుద్ధిగా కృష్ణ చెప్పినమాట విని, ఆ యింటి పరువుని నిలబెట్టమని యిప్పుడే వ్రాస్తాను. అంతేగాదు, రాజుకి యిష్టంవున్నా లేకపోయినా, దానికాళ్ళు కట్టిపడేసి అయినా సరే వాడు అన్ని ప్రయత్నాలూ చేసుకుంటున్న ఆ లగ్నానికి ఆ మూడుముళ్ళూ పడేలా చూడమని కృష్ణకికూడా వ్రాస్తాను."

"ఇందులో నేను చేసిన తప్పు ఏముందండీ?" బిగబట్టిన కంఠంతో అన్నాను.

"తప్పని అడుగుతున్నావా యింకా? అశుభం, శుభం తెలియని దాని మనసులో వెర్రికోర్కె లెత్తించటం, అంతంలేని ఆశను కల్పించటంకంటే క్షమించరాని నేరం యింకోటుందా? పెళ్ళి మానేయమన్నావు నువ్వు. మానేస్తానని చెప్పింది అది. తర్వాత ఏముంది? ఏం చేస్తుందిట? దానికి నువ్వేం సాయం చేస్తావుట? దాన్ని తెచ్చి యిక్కడ యీ యింట్లో అట్టిపెట్టుకోగలవా నువ్వు? లేక దానికి పెళ్ళి చేయగలవా? ఏం చేయగలనని వద్దని, ఎదురు తిరగమని వ్రాసావు? తరువాత ఎన్ని బాధలు ఎదురవుతాయో కించిత్ అయినా ఆలోచించావా నువ్వు?"

నేను నోటమాట రానిదానిలా నిలబడి కళ్ళప్పగించి చూడసాగాను. ఇంత జవాబు చెప్పలేనట్టుగా, యింత నిస్సహాయంగా నా కెప్పుడూ అన్పించలేదు. నాన్నగారుకూడా తన కోపాన్ని నిగ్రహించుకోటానికి ప్రయత్నం చేస్తున్నట్టు అలాగే నిలబడిపోయారు.

"సారీ! నేను లేటుచేసినట్టున్నాను. టైమయినట్టుంది కదూ?" అంటూ సారథి లోపలకి వచ్చాడు.

నేను అంతెత్తున ఎగిరిపడినదానిలా వులిక్కిపడి తిరిగి చూసాను. నన్ను చూసి నవ్వుతూ, ఏదో అనబోయిన సారథి, నా ముఖంచూసి కాబోలు ఆగిపోయి నా వైపు, నాన్నగారి వైపు అర్థంగానివాడిలా మార్చి మార్చి చూసాడు. నాన్న గారు, నేను - ఇద్దరిలో ఎవరమూ వెంటనే ఏం మాట్లాడలేదు.

"క్షమించాలి. నేను మిమ్మల్ని డిస్టర్బ్ చేయలేదు కదా?" అనుమానంగా చూస్తూ, వెనక్కి తిరిగి వెళ్ళబోతూ అన్నాడు.

నాన్నగారు అప్పటికి తేరుకున్నారు కాబోలు. వెంటనే "లేదు లేదు రా! రా! మీనా రోజురోజుకి చిన్నపిల్లయిపోతోంది. కొంచం మంకుతనం వదిలించుకో మని కోప్పడుతున్నానంతే. వెడదామాయిక." టైము చూసుకుంటూ అన్నారు.

"నాదేం ఆలస్యం లేదు" సారథికూడా వాచీ చూసుకుంటూ జవాబు యిచ్చాడు.

"నే నిప్పుడే వస్తాను." ఎవరినీ వుద్దేశించకుండా అనేసిన నేను, గిరుక్కున వెనక్కితిరిగి సుడిగాలిలా బైటికి పరిగెత్తాను.

పది నిముషాల అనంతరం, నేను నా గదిలో మళ్ళీ ముఖం కడుక్కుని పౌడరు వేసుకుంటుండగా, తాయారమ్మ గదిలోకి తొంగిచూస్తూ, "నాన్నగారు, అల్లుడు గారు కార్లో కూచుని మీకోసం చూస్తున్నారు, టైమయిపోతుందిట," అంటూ హెచ్చరించి వెళ్ళింది.

నేను బాగ్ తీసుకుని, హైహీల్స్ శబ్దం అయేలా పరుగెత్తుకుంటూ వచ్చాను. నాన్నగారు అప్పటికే డ్రైవింగ్‌సీటులో కూర్చుని వున్నారు. సారథి నాకోసం వేచి చూస్తున్నట్టుగా వెనకడోర్ దగ్గర నిలబడివున్నాడు. నన్ను చూడగానే డోర్ తెరిచి పట్టుకున్నాడు. నేను కారులో ఎక్కి కూర్చుంటూన్నప్పుడు అతను క్రీగంటన నా వంక పరీక్షగా చూడటం నేను గమనించకపోలేదు. కారులోపల కూర్చున్నాను. సారథి నా పక్కన నన్ను తగిలేటంత దగ్గరగా కూర్చున్నాడు.

అతనికి ఎడంగా జరిగి దూరంగా కూచోవాలనిపించింది. కానీ సభ్యతగా వుండదని వూరుకున్నాను.

మేం వెళ్ళేసరికి అమ్మ బైటే నిలబడివుంది. ఆ సమయంలో ఆవిడని చూస్తే అసలు యీావిడ అంత కష్టపడే మనిషేనా అనే అనుమానం వస్తుంది. అంత హుషారుగా, వుత్సాహంగా, చురుగ్గా వుంది. అప్పటికే కొంతమంది అతిథులు వచ్చారు. నాన్నగారు, అమ్మ కలిసి సారథిని తమకి కాబోయే అల్లుడుగా వాళ్ళకి పరిచయం చేసారు. వాళ్ళలో ఒకళ్ళిద్దరు ఆడవాళ్ళు దగ్గరికి వచ్చి, బొమ్మలా మాటా, పలుకూ లేకుండా నిలబడిన నా చెవిలో రహస్యంగా 'యూ ఆర్ లకీ' అని ఒకరు, 'కంగ్రాచ్యులేషన్స్' అని యింకొకరు ఏవేవో అన్నారు. మామూలుగా అయితే చక్కటి చిరునవ్వు విసిరో, లేక సిగ్గు నటిస్తూనో "థాంక్స్." అనాలి. నేను ఆ రెండూ చేయలేదు. వాళ్ళు చెప్పేవి నా కేం సంబంధించనట్టుగా ముఖంపెట్టి నిలబడ్డాను

ప్రోగ్రాం మొదలైంది.

అమ్మ ప్రారంభంలో అతిథులని ఆహ్వానిస్తూ, "సభ్యసమాజంలో స్త్రీ, ఆమెకున్న విలువ, వుండాల్సిన హక్కులు, అధికారాలు," గురించి దాదాపు ముప్పావుగంటసేపు అవిరామంగా, తడుముకోకుండా వుపన్యాసం యిచ్చింది.

స్టేజీ కెదురుగా, ముందు వరసలో నున్న సోఫాలో నాన్నగారికి, సారథికి మధ్య కూర్చుని వున్న నేను, అమ్మ వుపన్యాసాన్ని అంత శ్రద్ధగా వినలేదు. హాలు మారుమోగిపోయేట్టు మోగుతున్న కరతాళధ్వనుల్ని బట్టి అమ్మ వుపన్యాసం అయిపోయిందని గుర్తించాను.

తర్వాత ఏదో నివేదిక చదివటం మొదలుపెట్టారు. అందులో అక్కడ చేసిన ఘనకార్యాలు, ఆదాయం, ఖర్చు అన్నీ వున్నాయి. విసుగ్గా ముఖంపెట్టి కూర్చున్న నాకు ఏ క్షణంలో యిక్కడి నుంచి వెళ్ళి బైటపడతానా అన్పించసాగింది.

నా అంతర్యం దెబ్బతిన్నట్టుగా, ముడుచుకుపోయినట్టుగా వుంది. వాలంటీర్స్ గా తిరుగుతున్న ఒకరిద్దరు ఆడపిల్లలు నా వైపు యీర్ష్యగా చూడటం నేను గమనించకపోలేదు. కానీ వాళ్ళకేం తెలుసు? నేను ఏంకాంతం కోసం తపిస్తూ ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చున్నా నని.

ఆ రాత్రి మేం యింటికి వచ్చేసరికి చాలాపొద్దుపోయింది. ఇంట్లో అడుగు పెడుతూనే నేను అందరికీ త్వరగా గుడ్ నైట్ చెప్పేసి నా గదివైపు వచ్చే

శాను. రేపు కృష్ణని కలుసుకోవాలి! సారథి వున్నాడు. ఎలా! ఇప్పుడు యిక ఈ విషయంలో నాన్నగారుకూడా నా కేమాత్రం సాయం చేయరని తెలిసి పోయింది.

బట్టలు మార్చుకుని మంచంమీద పడుకున్న నాకు చాలాసేపటివరకూ నిద్ర పట్టలేదు. మాటిమాటికీ నాన్నగారిమాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి. "పెళ్ళి మానేసి ఏం చేస్తుందిట? దానికి నువ్వేం సాయం చేస్తావుట? దాన్ని తీసుకు వచ్చి యిక్కడ యీ యింట్లో అట్టిపెట్టుకోగలవా నువ్వు? ఏం చేయ గలవని, ఏం చేద్దామని వద్దని వ్రాశావు?" నాన్నగారి కంఠస్వరం కోపంగా, పరుషంగా. మాటిమాటికి నన్ను నిలదీసి ప్రశ్నించ సాగింది.

అవును. నే నేం చేయగలను? క్షణంసేపు నిజమే అనిపించింది. ఆ వెంటనే మళ్ళీ, ఏం చేయలేనా నేను? నే నేం చేయలేనూ? అనిపించసాగింది. నాన్న గారి మాటలు నాకు చాలా రోషాన్ని తెప్పిస్తున్నాయి.

అప్రయత్నంగా, ఒకమంచి వుద్దేశ్యంతో స్నేహపూర్వకంగా, రాజు హితం కోరి నేను చేసినపని, నా జీవితానికే సవాల్ అయి కూర్చుంది.

ఏం చేయలేనూ నేను? చూస్తాను.

నాన్నగారుకూడా అనుకుంటున్న అమాయకురాలిని, అసమర్ధురాలిని కానని నిరూపిస్తాను

ముందుగా, వీళ్ళలో ఎవరికీ ఏం చెప్పను నేను.

ముందు కృష్ణని కలుసుకోవాలి.

అతనితో మాట్లాడాలి అది చాలా ముఖ్యం.

దృఢంగా నిశ్చయించుకున్నాను.

*　　　*　　　*　　　*

మర్నాడు ప్రొద్దున నేను కావాలనే చాలా ఆలస్యంగా లేచాను. 9 గంటలు అవుతుండగా అమ్మ నా గదిలోకి వచ్చింది.

ఆవిడ అప్పటికే స్నానం అదీ చేసి మల్లెపువ్వులాంటి బట్టలు ధరించివుంది

కడిగిన ముత్యంలావున్న అమ్మనిచూస్తే రాత్రి అంత పొద్దుపోయేవరకూ మేలుకున్న మనిషి. అని ఎవరూ అనుకోరు.

"ఏమిటా నిద్ర? యింకా పడుకున్నావేం? లే" అంది మందలింపుగా

బద్ధకంగా కళ్ళు తెరిచిన నేను, నీరసంగా ముఖంపెట్టి. "ఒళ్ళంతా నొప్పులుగా, చాలా బడలికగా వుందమ్మా" అన్నాను.

అమ్మ చప్పునవచ్చి నా నుదురు తాకి చూసింది.

అప్పుడే నా గదిలోకి నాకు బెడ్ కాఫీ తీసుకుని వస్తున్న తాయారమ్మని, రాత్రి నాకు దిష్టి తీయాలని జ్ఞాపకం చేయనందుకు కేకలు వేసింది.

నా మంచం ప్రక్కన కూర్చుని స్వయంగా కాఫీ కప్పులోపోసి నన్ను లేచి తాగమని నా చేతికి యిస్తూ, "ఒక్కనిముషం కిందకువచ్చి సారధికి కన్పించి వెళ్ళు" అంది.

"అబ్బా! ఈ నీరస ముఖంతో కన్పించేకంటే అసలు కన్పించకుండా వుండటమే నయం," అన్నాను.

అమ్మ ఏమనుకుందో ఏమో అట్టే తర్కించలేదు. కిందకు వెళ్ళిపోయింది.

నేను మంచంమీద పడుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాను.

అమ్మావాళ్ళు 10 గంటలకి ఎవరినో కలవటానికి వెడుతున్నారు. వాళ్లు వెళ్ళగానే నేను యింట్లోంచి పారిపోయి వాళ్ళు తిరిగిరాకముందు యింటికి చేరుకోవాలి. కానీ వీళ్ళు ఎన్నింటికి బైలుదేరుతారో నాకుస్పష్టంగా తెలియదు నిన్న ఫోన్‌లో మాట్లాడినప్పుడు కృష్ణతో కాస్త ఆలస్యం అయినా అక్కడే వుండి ఎదురు చూడమని చెప్పివుండాల్సింది

ఒకవేళ నేను వెళ్ళలేకపోతే? కృష్ణ మళ్ళీ ఫోన్ చేస్తాడా?

నా కెందుకో అతనలా చెయ్యడని, సరాసరి స్టేషన్‌కి వెళ్ళి ట్రెయిన్ ఎక్కేస్తాడని నమ్మకంగా అన్పించసాగింది.

అతనితో ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అంతా రాత్రి ఆలోచించుకుని ఒకటి రెండుసార్లు రిహార్సల్ కూడా చేసుకుని రెడీగా వున్నాను.

కిటికీ వైపుచూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్న నేను గుమ్మంలో అలికిడి విన్పించటంతో తలతిప్పి చూసాను.

సారథి లోపలకి వస్తున్నాడు. నేను చప్పున లేవబోయాను.

"లేవకు. పడుకో, పడుకో." అతను గట్టిగా వారిస్తూ వచ్చి నా మంచం పక్కన అంతక్రితం అమ్మ కూర్చున్న కుర్చీలో కూర్చున్నాడు.

నేను లేచే ప్రయత్నం అంతకు ముందే మానేసాను.

ఎందుకంటే పల్చటి నైట్ గౌన్లో వున్న నేను లేచి అతని ముందు కూర్చోవటం అసాధ్యం. దుప్పటి కంఠంవరకూ లాక్కుని అతనివైపే చూడసాగాను.

"జ్వరం వుందా?" లేదన్నట్టు తలూపాను.

"ఒట్టి ఒళ్ళు నొప్పులేనా?" అవునన్నట్టు చూసాను.

"బడలికవల్లనేమో!" కావచ్చు అన్నట్టు కళ్ళతోనే సూచించాను

రెప్పవాల్చకుండా చూస్తున్న నా చూపులకి ఎలాగో అయిన అతను నా

వైపునుంచి దృష్టి మరల్చుకుని, నా గదిని, అది అలంకరించిన తీరునీ శ్రద్ధగా గమనిస్తున్నట్లు కూర్చున్నాడు

అతని వాలకం చూస్తూంటే, అమ్మ పంపగా వచ్చినట్టు స్పష్టంగా తెలుస్తోంది. నేను తల తిప్పుకుని శూన్యంలోకి చూడసాగాను ఇతని సమక్షంలో నాకు నోట్లోంచి మాట రాదు. ఎందువల్ల? అతను ఎదురుగావుంటే, నాకు ముళ్ళమీద వున్నట్టుగా వుంటుంది నా కిలా అన్పిస్తుందని అతనితో చెబితే? అమ్మో! ఇంకేమైనా వుందా! అమ్మ చంపెయ్యదూ? అమ్మవల్ల ఆ భయం నాకు లేకపోయినట్టయితే నే నెప్పుడో అడిగేసి వుండేదాన్ని. పది నిముషాలు అతను గదిని పరిశీలించటంతోనూ, నాకు శూన్యంలోకి చూడటంతోనూ గడిచిపోయినాయి.

"నేను వస్తాను" అతను వచ్చినపని అయినట్టుగా లేవబోయాడు నేను వెంటనే సరే నన్నట్టు తలూపాను. అతను కుర్చీలోంచి లేస్తుండగా, ఇంతలో అమ్మ గదిలోకి వచ్చింది. లేవబోతున్న సారథి కూర్చుండిపోయాడు.

"బ్రేక్‌ఫాస్టు యిక్కడి తెప్పించనా? అని అడిగింది అమ్మ.

"వద్దు ఇంటికు వస్తాను"

అమ్మవచ్చి నా మంచం అంచుమీద కూర్చుంది

"టెంపరేచరు లేసట్టుంది," అన్నాను అమ్మతో.

"అవును అయినా ఎందుకయినా మంచిదని డాక్టర్‌గారికి ఫోన్‌చేసాను. ఒట్టి తామరతూడులాటి పిల్ల ఒక్కపూట జ్వరం వచ్చిందంటే ముఖం వేళ్ళాడిపోతుంది" అమ్మ నా నుదుటిమీద చెయ్యివేసి మరోసారి జ్వరం వుందో లేదో పరీక్షకంగాచూస్తూ అంది. అమ్మ అలా మాట్లాడినప్పుడల్లా నా మనసు పరవశంతో పొంగిపోతుంది

ఏమిటీ యీ మానవ మస్తిష్కం యొక్క విచిత్రం! కొన్ని మాటలకి పొంగిపోవటం! కొన్ని కొన్ని మాటలకి కృంగిపోవటం! అన్నింటిని సమానంగా నిర్లిప్తంగా ఎందుకు తీసుకోరో! అటు యిటు చూస్తున్న సారథి చెయిజాచి, పక్కగావున్న టేబిల్‌మీద ఫొటోల్ని చేతిలోకి తీసుకుని పరీక్షగాచూసాడు నా గుండెలు ఝల్లుమన్నాయి.

"చాలా బాగావుంది ఇది. ఎన్నాళ్ళ క్రితం తీసింది యిది?" అమ్మకి నా ఫోటో చూపిస్తూ అన్నాడు

అది నా 17 సం॥ వయసప్పుడు రెండు జడలు వేసుకుని, వాటిని రిబ్బన్లతో మడిచికట్టి ఆ రిబ్బన్లు పువ్వుల్లా మెడ కిరుప్రక్కలా కుచ్చుల్లా వచ్చేలావున్న ఫోటో

"మూడు సంవత్సరాల క్రితం," అంది అమ్మ.

"మూడు సంవత్సరాల క్రితమా!" నమ్మలేనట్టు చూసాడు.

"అవును, సరిగ్గా మూడు సంవత్సరాల క్రితం."

"చాలా తేడా కన్పిస్తోంది అప్పటికీ యిప్పటికీ."

అమ్మ నిట్టూర్పు అణుచుకోవటం నేను స్పష్టంగా గమనించాను.

"ఆడపిల్లలు. ఏముంది? తోటకూర కాడల్లా ఎదిగిపోతారు."

అమ్మ సారథి చేతిలోని ఆ ఫోటోని అడిగి తీసుకుని నా ఫోటోవైపు శ్రద్ధగా చూసింది.

ఆవిడ దృష్టిలో నేనెప్పుడూ పదకొండు సంవత్సరాల పసిపాపలా వుండాలని. కాని ఎలాసాధ్యం?

కొద్దిసేపు తదేకంగా ఆ ఫోటోని చూసిన అమ్మ, "అన్నట్టు మర్చిపోయాను. నీదగ్గర మీనా ఫోటో ఏదీ లేనేలేదుకదూ? ఇదివరకు ఒకటిరెండుసార్లు యివ్వాలనుకునికూడా మర్చిపోయాను. ఇది తీసియిస్తాను." అమ్మ ఫోటోలు వెనకవైపు తిప్పి నా ఫోటోవున్న దాని క్లిప్ వూడదీసింది.

నా గుండెలో రైళ్ళు పరుగెత్తసాగాయి. నాలో చెప్పలేనంత దడవచ్చింది.

అమ్మ మెల్లగా విప్పడం మొదలుపెట్టింది.

దానివెనక కృష్ణఫోటో! అమ్మో! యింకేమైనా వుందా? నాకు కళ్ళు తిరుగుతున్నాయి.

మరుక్షణంలో పైకప్పు విరిగి నా నెత్తిన పడుతుందని తెలిసినదానిలా గట్టిగా బిగబట్టుకొని ఎదురుచూడసాగాను.

గదిలోకి తాయారమ్మగారనే అపురూపమైన దేవత తొంగిచూసి, "అమ్మగారూ, మిసెస్ లింగంగారు ఫోన్ చేసారు. మీతో అర్జెంట్‌గా ఏదో మాట్లాడాలిట, రమ్మంటోంది," అంది.

అమ్మ తీస్తున్న ఫోటో మంచంమీద పడేసి వెళ్ళింది. సారథికూడా లేచివెళ్ళాడు.

నా గుండెదడ తగ్గి, నేను మామూలుమనిషి నవటానికి దాదాపు పావుగంట అయింది.

గబగబా ఫోటో తీసేసి తీసుకెళ్ళి బీరువాలో బట్టలమధ్య జాగ్రత్తపరిచాను. ఈమధ్య బీరువా జాగ్రత్తగా తాళంవేసి, తాళంచెవులు నాదగ్గరే వుంచుకుంటున్నాను.

11 గంటలు అయింది. అమ్మా, నాన్న, సారథి తయారయి కూర్చున్నారు.

మిసెస్ లింగం అంత అర్జెంట్‌గా ఫోన్‌చేసి చెప్పిందేమిటంటే, యీపూటకి మమ్మల్ని అందరినీ వాళ్ళింటికి భోజనానికి రమ్మనమని, యింట్లో వంటప్రయత్నం చేయొద్దని చెప్పటానికి.

కొంచంముందుగా వస్తే ఎవరో వస్తున్నారట, వాళ్ళని సారథికి పరిచయం చేస్తానని చెప్పింది.

గీరా అమ్మావాళ్ళు బైలుదేరబోతుంటే, మా కుటుంబ మిత్రులైన పార్థసారథి, ఆయన భార్య రాత్రి జరిగిన ప్రోగ్రాంగురించి అమ్మని అభినందించటాని వచ్చారు.

వాళ్ళు రావటంతో అమ్మావాళ్ళు మళ్లా కూర్చున్నారు

ఏదేదో మాట్లాడుతున్నారు. ఎంతసేపటికీ లేవలేదు. 11-30 కావస్తోంది. క్రింద హాలులోంచి బిగ్గరగా నవ్వులు యింకావినిపిస్తూనే వున్నాయి.

నాకేం చెయ్యాలో తోచలేదు. కృష్ణ కలవకపోతే నేను అనుకున్నవన్నీ గంగార్పణం అవుతాయి.




454 Gm.
FERRADOL
A VITAMIN NUTRITIVE TONIC
STANDARDIZED
PARKE-DAVIS
PARKE DAVIS (INDIA) LIMITED

నేను వస్తానన్న సమయానికి అరగంటపైగా ఆలస్యం అయింది. అతను వేచి చూస్తుంటాడు.

నేను గదిలో అటుయిటూ బోనులో ఆకలిగొన్న పులిలా తిరగసాగాను.

కారు శబ్దంకోసం చెవులు రిక్కించి వింటున్న నాకు, హఠాత్తుగా ఎవరో పైకి నా గదివైపు వస్తున్నట్టు అడుగులశబ్దం విన్పించింది.

చటుక్కునవచ్చి మంచంమీద పడుకుని, దుప్పటి కంఠంవరకూ లాక్కొని గుమ్మంవైపు చూడసాగాను.

గదిలోకి వచ్చింది ఎవరోకాదు. నాన్నగారు!

ఆయన్ని చూడగానే నేను చప్పున చూపుల్ని నేలవైపు దించుకున్నాను.

నిన్న నాన్నగారు నన్ను కేకలేసిన తర్వాత మళ్ళీ యింతవరకూ నేను ఆయన కంటికి కన్పించలేదు

ఆయన నా ముఖం చూడగానే ఏమనుకున్నారో ఏమో! చప్పున దగ్గరగా వచ్చి నుదుటిమీద చెయివేసి చూసారు

"జ్వరంలేదు.'' సాధ్యమైనంత నీరసంగా అన్నాను.

ఆయనముఖం ఎప్పటికంటే చాలా ప్రసన్నంగా వుంది. "రాత్రంతా నిద్ర పోలేదా?" అన్నారు. పోలేదన్నట్టు తల తిప్పాను.

"ఎందుకని?" నేను సమాధానం చెప్పలేదు.

"రాజు పెళ్ళి ఎలా తప్పించాలని ఆలోచనా?" ఆయన స్వరం గమత్‌గా వుంది.

"అవును." మొండిగాచూస్తూ అన్నాను.

"ఆ ఆలోచనన్నీ మానేయ్. నేను రాత్రే కమలంపేరిట వుత్తరం వ్రాసాను. రాజుపెళ్ళి ఆ లగ్నానికి అయిపోతుంది."

"అసంభవం?" దృఢంగా అన్నాను.

"ఏమిటి నీ కంత నమ్మకం?"

"రాజు నామాట వింటుంది."

"పందెం కడ్తావా?"

"ఆ!"

''ఎంత?'' నవ్వుతూ అడిగారు

"పాతికవేలు."

"పాతికవేలు?!"

"అవును. పాతికవేలు. నేను చిన్నప్పటినుంచి, మంచి హోదాలో పెరిగాను. 'నేను ఏపని చేసినా నాహోదాకి తగినట్టుగా వుండాలి' అని మా అమ్మ ఎప్పుడూ అంటూ వుంటుంది."

"గెలుస్తావని నమ్మకమేనా నీకు?"

"పందెంకట్టి చూడండి. మీకే తెలుస్తుంది."

"సరే అయితే."

"ఒప్పుకున్నట్టేనా?"

"మరి నువ్వు ఓడిపోతె?"

"నేను యిస్తాను."

"ఎలా?"

"ఎట్లాగో యిస్తాను. మీ డబ్బులోంచి మాత్రం కాదు. సరేనా?"

ఆయన నావైపు దీర్ఘంగా, విచిత్రంగా చూసారు. చివరికి తల వూపుతూ, "సరే" అన్నారు.

"మాట తప్పకూడదు మరి."

"ఆమాటను నువ్వే జ్ఞాపకం పెట్టుకోవాలి." నాన్నగారు గుమ్మందాటి వెళ్ళిపోబోతుండగా వెనకనుంచి "నాన్నగారూ!" అంటూ గారంగా పిలిచాను.

ఆయన ఏమిటన్నట్టు వెనక్కు తిరిగిచూశారు.

"తెలిసో తెలియకో నే నేదయినా మీకు బాధకలిగి స్తే నన్ను క్షమించండి."

ఆయన క్షణంసేపు నా వైపు పరీక్షగా చూశారు.

తర్వాత నిదానంగా మృదుగంభీరంగా యిలా అన్నారు. "చూడు మీనా. నువ్వు నిజంగా తెలియక చేసినట్టయితే నా క్షమార్పణ నీకు ఎప్పుడూ వుంటుంది. కానీ తెలిసికూడా తెలియనట్టు నటి స్తే మాత్రం నాకు రెట్టింపుబాధ కలుగుతుంది. నువ్వు ఏపని ఏ వుద్దేశ్యంతో చెప్పేది నాకు యిట్టే తెలిసిపోతుంది. నేను లాయర్ని అన్నసంగతి మర్చిపోకు ఎప్పుడూ" అనేసి వెళ్ళిపోయారు. నాన్న గారు అలా మామూలుగా మాట్లాడేసి వెళ్ళినతర్వాత నా గుండెలమీద నుంచి పెద్ద బరువేదో దించినట్టు తేలికగా, హాయిగా అన్పించింది.

కానీ ఆఖరులో నాన్నగారు అన్నమాటలు నాకు వెంటనే అర్థంగాలేదు. చాలాసేపటి వరకూ వాటినిగురించే ఆలోచిస్తూ వుండిపోయాను.

అమ్మా వాళ్ళు 11-30 దాటుతుండగా చివరికి ఎలాగయితేనేం లేచి వెళ్ళారు. కారు వెళ్ళిపోయిన శబ్దం, గేటుమూసిన శబ్దం చెవులు రిక్కించి విన్న నేను ఒక్కవుదుటనే లేచి చెప్పులు వేసుకున్నాను. టేబిల్ మీదపెట్టి వున్న బాగ్ లాక్కుని మెరుపులా క్రిందకు వచ్చాను. వీధివాకిలివైపు వెళ్ళిపోబోతున్న నేను ఒక్కసెకను ఆలోచించి వంటయింటివైపు బాణంలా దూసుకువచ్చి, "తాయారమ్మగారూ! నేను డాక్టరుగారి దగ్గరకు వెడ్తున్నాను. తలుపు వేసుకోండి," అంటూ యివతలకి వచ్చేశాను.

"డాక్టరుగారు యింటికే వస్తారు టండీ" తాయారమ్మ కేకపెట్టింది వంట యింట్లోంచి.

"ఉహు నేనే వెడతాను నా కిక్కడ ఏం తోచటంలేదు." బిగ్గరగా అనేసిన నేను వాకిట్లోకి వచ్చేశాను.

రోడ్డుమీద మా యిల్లు దాటినతర్వాత 7, 8 గజాలు నడిచిన తర్వాతగాని నాకు టాక్సీ దొరకలేదు. దాన్ని ఆపి లోపలకు ఎక్కికూర్చుని. "జమ్‌రుద్. త్వరగా," అన్నాను. అప్పటికి పావుతక్కువ పన్నెండు గంటలు. కావస్తోంది కృష్ణ వుంటాడేమో ననే ఆశ కొనవూపిరితో రెపరెపలాడుతోంది. మళ్ళా వెంటనే ఆ ఆశ నేను వెళ్ళగానే నిరాశగా మారుతుందని, యిదే టాక్సీలో యింటికి తిరిగి వచ్చేస్తానేమో నని నమ్మకంగా అన్పించసాగింది.

నేను వెళ్ళేసరికి కృష్ణ హాలు వరండాలోవున్న పిల్లర్ కి భుజం ఆనేలా నిలబడి చేతులు కట్టుకుని ఎటోచూస్తున్నాడు. అతని ముఖంలో చిరాకు, విసుగు చూడగానే అతను అక్కడ చాలాసేపటినుంచి నిలబడి వున్నట్టు అనుకున్నాను.

టాక్సీవైపు ఆఖరిసారి అన్నట్టుగా, అనుమానంగా చూశా డతను.

నేను క్షణం అయినా ఆలస్యం చేయకుండా డోర్ తీసుకుని దిగాను.

నన్ను చూడగానే అతని కళ్ళలో తళుక్ మని కాంతి మెరిసింది. విసుగు, చిరాకు వూదేసినట్టు మాయమైనాయి.

"వచ్చావా!" – అన్నట్టు చూస్తూ చిరునవ్వుతో నావైపు వచ్చాడు

నేను బాగ్ తెరిచి పదిరూపాయల కాగితం యిచ్చాను.

"చిల్లర లేదు," అన్నాడు డ్రైవరు.

కృష్ణ పర్స్ తెరిచి మీటర్ చూసి యిచ్చేశాడు.

నేను పది రూపాయల కాగితం అతనికి యివ్వబోతే సున్నితంగా నా చెయి నెట్టేస్తూ 'వుండనీ,' అన్నాడు.

"టైమ్ చాలా అయినట్టుంది కదూ?" అన్నాను గడియారం చూసు కుంటూ.

"ఆ! కొన్ని కోట్ల యుగాలనుంచి నీకోసం ఎదురుచూస్తూ యిక్కడ నిలబడి నట్టుగా వుంది నాకు," నవ్వుతూ అన్నాడు.

"నువ్వు వుండవు, వెళ్ళిపోతావనే అనుకున్నాను."

"ఇంకొక్క ఐదునిముషాలు చూసి ఆ పనే చేద్దామనుకుంటున్నా."

"రక్షించావ్ నన్ను. యిప్పుడు ఎక్కడికి వెళ్దాం మరి?" అన్నాను చుట్టూ చూస్తూ. అక్కడెక్కడా ఎవరూ జనం అన్నమాట లేదు.

"ఇంకెక్కడికి లోపలికే." జేబులోంచి టిక్కెట్లు తీసి చూపిస్తూ అన్నాడు.

"సినిమాకా! మొదలుపెట్టి చాలాసేపయిందేమోగా!"

"మనం సినిమా చూడటానికి వెళ్ళటం లేదుగా!" కొంటెగా చూసాడతను.

మేం వెళ్ళింది హైక్లాసుకావటం వల్ల ఎవరూ జనమే లేరు. అక్కడక్కడా, ఒకళ్ళిద్దరు మాలాగే జంటలున్నారు. ఒక మూలగా చూసుకుని, ఆ జంటలకి దూరంగా కూర్చున్నాం యిద్దరం. ఏదో పాత పిక్చరు గీతలు గీతలుగా వుంది. మనుష్యులంతా సుస్తిపడి లేచినవాళ్ళలా వున్నారందులో. కృష్ణ కూర్చోగానే "అబ్బ! నిలబడి నిలబడి కాళ్లు నొప్పిపుట్టాయి. ఊఁ చెప్పు. ఏమిటా అర్జెంట్ మాటలు?" అన్నాడు.

"నువ్వలా తొందరచేసావంటే నా నోట్లోంచి అసలు మాటేరాదు." సీరియస్ గా అన్నాను.

"సరే అయితే." అతను పిక్చర్ వైపు చూడటం ప్రారంభించాడు. 5 నిము

షాలు గడిచాయి. నేను తలతిప్పి చూసాను. అతను తదేకంగా పిక్చర్ వైపే చూస్తున్నాడు.

"నువ్వు నాతో మాట్లాడటానికి వచ్చావా? పిక్చర్ చూడటానికి వచ్చావా?" చిరుకోపంగా అన్నాను.

"రెండింటిలో ఏదో ఒకటే చేద్దామని వచ్చాను. నువ్వు మాట్లాడటం లేదుగా. అందుకని కొన్న టిక్కెట్లని సద్వినియోగం చేయటానికి ప్రయత్నిస్తున్నాను."

"టిక్కెట్ల డబ్బు నే నిచ్చేస్తాలే."

"అంటే నీవైపు చూడమనా?"

నేను ఫక్కుమని నవ్వాను

"హుష్ నెమ్మది." అతను చుట్టూ చూసాడు.

నేను జేబురుమాలు నోటికి అడ్డుపెట్టుకున్నాను వెంటనే. కొద్ది సేపయిం తర్వాత అన్నాను.

"నిన్న అలా సరాసరి ఫోన్ చేసావ్. నీ కెంత ధైర్యం!"

"ఇందులో ధైర్యం ఏముంది?" అతని కంఠంలో ప్రసన్నత మాయమైంది. సీరియస్‌గా అన్నాడు.

"అమ్మ వింటే?"

"ముందు ఆవిడనే కావాలని అడిగాను. ఆవిడ యింట్లో లేరని తెలుసుకున్న తర్వాతనే నిన్ను పిల్చాను."

"అమ్మ వున్నట్టయితే?"

"వచ్చే లోపలే ఫోన్ పెట్టేసేవాడిని."

"మంచివాడివే!"

"నువ్వనుకున్నంత చెడ్డవాడిని మాత్రం కాను."

నేను చప్పున అతనివైపు తలతిప్పి చూసాను. అతని ముఖం ఎందుకో చాలా సీరియస్‌గా అయింది.

ఆ నిముషంలో నవ్వు మాయమైన అతనిముఖం చూడగానే, యిలాంటి తెలివి తక్కువ సంభాషణ తెచ్చినందుకు నామీద నాకే విసుగువేసింది.

నేను చెయిజాచి అతని చేతిని తీసుకోబోయి హఠాత్తుగా ఆగిపోతూ అడిగాను. "నేను నిన్ను తాకితే మీ సుందరికి అన్యాయంచేసినట్టు అవుతుందా?

"సుందరి సంగతి వదిలేయ్. మీ సారథి సంగతి ఆలోచించు."

నేను మాట్లాడలేదు. మౌనంగా అతని చేతిని తీసుకుని నా రెండుచేతుల మధ్యా పట్టుకున్నాను

నా స్పర్శకి అతనిలో ఎలాంటి చలనంవచ్చినట్టు నాకు ఏం అన్పించలేదు. కానీ నాకు శరీరం అంతా విద్యుల్లత పాకినట్టుగా అయింది

"ఒకటి అడుగుతాను, చెబుతావా?"

"అడుగు."

"మన రెండుకుటుంబాలమధ్యా అసలు వైరం ఎందుకువచ్చింది? ఈ యింటి మీద కాకి ఆ యింటిపైన వాలకపోవటానికి కారణం ఏమిటి?"

కుర్చీలో వెనక్కు ఆనుకుని, జారగిలబడి కూర్చునివున్న అతను, నా చెయి వదిలించుకుని, లేచి సరిగ్గా కూర్చున్నాడు

"నువ్వు మీ అమ్మనికాని, నాన్ననుగాని అడగలేదా ఎప్పుడు?"

"నాన్నను అడిగాను నాకు నీ నోటినుంచికూడా కారణం వినాలనివుంది."

"ఏముంది? వున్నవాళ్లకి, లేనివాళ్లకిగల మధ్య వైరమే"

"అంటే?"

"వున్నవాళ్ళు లేనివాళ్ళని తక్కువగా, అల్పులుగా చూస్తారు లేనివాళ్ళు వున్నవాళ్ళని అహంకారులుగా, అధికులుగా పరిగణించి, యీర్ష్యపడతారు."

"అంటే ప్రపంచంలో లేనివాళ్లంతా వున్నవాళ్లని చూసి యీర్ష్యపడుతున్నారంటావా?"

"నూటికి 90 మంది అంతే"

"మిగతా ఆ పదిమందిలో మీరు ఒకరు కావచ్చుగా."

"ఆ సంగతి మీ అమ్మ ఒప్పుకోదు"

"దీనికంతటికీ మా అమ్మే కారణం అంటావు. అవునా?"

అతను సమాధానం చెప్పలేదు.

"మాట్లాడవేం?"

"ఏం మాట్లాడను?"

"మవ్వసలు మా యింటికి ఎందుకురావు?"

"మామయ్యని అడుగు. చెబుతాడు."

నేను హఠాత్తుగా స్నేహపూర్వకంగా, చనువుగా అన్నాను. "చూడు కృష్ణా! చాలారోజుల క్రిందట జరిగిందేదో జరిగింది. అదక్కడికి మర్చిపోయి మనరెండు కుటుంబాలు సన్నిహితం అయి ఒకరింటికి ఒకరు వస్తూ, పోతూ వుంటే బాగుంటుందని నా వుద్దేశ్యం. ఏమంటావు?"

"నీ వుద్దేశ్యం బాగానే వుంది. కానీ అసంభవం అంటాను."

"ఎందువల్ల ?"

"విరిగిన మనసులు అతుక్కోవటం కష్టం మీనా."

"కనీసం అతుకు పెట్టాలని ప్రయత్నించటం మన ధర్మంకాదా ?"

"మనం అంటే ?"

"ఉదాహరణకి నువ్వూ నేనూ అనుకో "

అతను వెంటనే సమాధానం చెప్పలేదు. ఆలోచిస్తున్నట్టుగా కూర్చున్నాడు.

"చెప్పు మాట్లాడు."

"మన కుటుంబాలు కలిసినందువల్ల కలిగే లాభంగాని, కలవనందువల్ల వచ్చే నష్టంగాని నాకేం కన్పించటంలేదు "

"నువ్వు చాలా కఠినమైన మనసుగలవాడివి. అసలు యీ వైరం యిలా పెరగటానికి సగం నీ పట్టుదలే కారణమేమోనని నా అనుమానం "

"ఇంత అన్యాయమైన ఆరోపణ నేనెక్కడా వినలేదు "

"లేకపోతే ఏమిటి నువ్వనేది? సన్నిహితులమైన మనం కలిసివుండటానికి యిందులో లాభనష్టాల ప్రసక్తి ఏముంది? నాన్నకి మీరంటే ఎంతప్రాణమో తెలుసా ఆయన మనసు ఎప్పుడూ మీ దగ్గరే వుంటుంది ఇన్నాళ్ళూ నాకు తెలియనేలేదు. నేను అసలు నిమ్మలూరు రాకుండా వుంటే ఏమయ్యేదో తెలియదు. కానీ వచ్చిన తర్వాత నా కెలాగో వుంది. నేను మీ దగ్గరకు వచ్చి అన్నిరోజులు వున్నాను. మీరు నన్ను ఎంతో ఆప్యాయంగా చూసారు. నువ్వు యీ వూరు వచ్చావు. కనీసం మర్యాదకైనా నిన్ను మా యింటికి రమ్మనమని పిలిచే ధైర్యం నాకులేదు. ఇలా ఎందుకుండాలి? అమ్మకి మీ పట్ల కలిగిన అపోహవల్లనే కదా' నే నెంత కష్టపడయినా సరే దాన్ని తొలగించి, మా కెంతో ఆత్మీయులు అయిన మీ అసలు స్వరూపాలని గుర్తించేలా చేయాలని చాలా పట్టుదలగావుంది నాకు "

"థాంక్స్ మీనా "

"నువ్వు వూరికే థాంక్స్ అంటే సరిపోదు "

"యింకేం చేయమంటావు ?"

"నాకు సాయం చేయాలి. ఈ రెండు కుటుంబాలని కలిపేందుకు నాతో సమంగా ప్రయత్నించే బాధ్యత స్వీకరించాలి." (సశేషం

**Printed and Published by A. Sudhakar Rao for Yuva Publications, Hyd-4. and Printed at Yuva Press, Public Garden Road - Hyderabad-1. Phone 36336**
**Controlling Editor: Sri "CHAKRAPANI"**

YUVA February '70 One Rupee Regd. No. H 13